ఆంధ్రసాహిత్యపరిషత్పత్రికాశేషము — ౪.

శ్రీరస్తు.

# చంపూరామాయణము.

ఇది

కార్వేటినగరసంస్థానవిద్వత్కవియగు

ఋగ్వేదికవి వేంకటాచలపతికవిచే

నాంధ్రీకరింపఁబడినది

---

చెన్నపట్టనము

శ్రీనివాస వరదాచారి అండుకంపెనీ వారిచే

ముద్రింపఁబడి

---

ఆంధ్రసాహిత్యపరిషత్తు వారిచే

ప్రకటింపఁబడినది

---

౧౯౧౭.

వెల రు ౧—౦—౦

# విషయసూచిక.

# చంపూరామాయణపీఠిక.

## కవికాలనిర్ణయము

ఈకృతి నొనర్చినకవి కవిరాజకంఠీరవబిరుదాంకితుఁడును వాసిష్ఠగోత్రజుఁడును నగుఋగ్వేదికవి వేంకటాచలపతి ఆశ్వాసాంతగద్యములయందు "ఋగ్వేదికవి తిరువేంగళార్యకలశరత్నాకరసుధాకరుఁ" డని తన్ను వర్ణించికొనుటచే నీతనితండ్రిపేరు తిరువేంగళార్యుఁ డైనట్లు తెలియుచున్నది మఱియు గ్రంథావతారికలోఁ దాను "తిరువేంగళార్యకవిరాజసమాశ్రయ ధన్యచిత్తవర్తనుఁ" డనియు—

"అత్తిరువేంగళార్యుని యుదారదయావిలసత్కటాక్షసం
పత్తినుదీర్ణమైన సుకుమారవచఃప్రతిభానిరూఢి ను
ద్యత్తరగద్యపద్యచయ మాశుగతిన్ రచియింపనేర్చి"

ననియు వ్రాసికొనుటచే నీతని కవితాగురువు కూడఁ దిరువేంగళార్యుఁడైనట్లు కన్పట్టుచున్నది ఈతిరువేంగళార్యు లిరువురు భిన్నపురుషులై యుందు రని తోఁచుచున్నది. అట్లు కానిచో గురువును వర్ణించునవసరమున నతఁడు తనతండ్రియే యని చెప్పకుండునా?

కవికాలమును నిర్ణయించుటకుఁ దగినయాధారములు కొన్ని గ్రంథమునందే యున్నవి వానిలోఁ గృతిపతివంశావతారము ముఖ్యమైనది ఈకృతిపతి యిప్పుడు కార్వేటినగరసంస్థాన మని వాడఁబడుచున్న దేశమున కధిపతి యైన వెల్లంటి కనవరాజు. ఆదేశమునకుఁ దొండమండలము, తుండీరమండలము నని పూర్వనామములు ఆంధ్రజైమినిభారతకృతిపతి యగుసాళువ నరసింగరాజు మొదలగు సాళువరాజులు పూర్వ మాదేశమును బాలించిరి వారిపిదప మాకరాజు వంశ్యులు రాజులైరి ఈమాకరాజుకులములోఁ జేరిన తిరుమలరాజునకే చదలువాడ మల్లయకవిప్రణీత మైన విప్రనారాయణచరిత్ర మంకిత మైనది. కొంతకాలమునకు రాజ్యము మాకిరాజువంశమునుండి దౌహిత్రభాగముగా వెల్లంటివారికి సంక్రమించినది ఈమార్పెప్పుడు జరిగెనో స్పష్టముగాఁ దెలియదు. ప్రస్తుతగ్రంథకృతిపతి యైనకనవనృపతి యీవెల్లంటివంశమువాఁడే ఇప్పుడున్న కార్వేటినగరపు జమీందారులు గూడ నీవంశమువారే మాకరాజువారును

వెల్లంటివారును గూడఁ బూర్వపుసాళువరాజులబిరుదములఁ దమబిరుదములుగాఁ జేసికొన్నారు.

కసవరాజువంశము గ్రంథములో నిట్లు వర్ణింపఁబడినది. కరికాళచోళుని వంశములో సింగరిరాజు పుట్టెను సింగరిరాజునకు శ్రీరంగరాజును, శ్రీరంగరాజునకు సింగరిరాజును, సింగరిరాజునకుఁ గావేరిరాజును, గావేరిరాజునకు సింగరిరాజును, సింగరిరాజునకుఁ గావేరిరాజును, గావేరిరాజునకుఁ గసవరాజు, సింగరిరాజు, తిరువేంగళరాజు, పెరుమాళ్రాజు ననునలువురు కొడుకులును బుట్టిరి. ఈకసవరాజే కృతిపతి. కసవరాజుపిదప నేడవతరమువాఁడగుబ్రహ్మరాజు కాలమునఁ బుట్టిన [1]పద్మావతీపరిణయ మనుసంస్కృతచంపూగ్రంథ మీవంశక్రమమును దృఢపఱుచుచున్నది. ఆగ్రంథములోఁ గసవరాజునకు మాఱు కేశవరా జనియున్నది కసవయనునది కేశవశబ్దభవము కాఁబోలును. కసవరాజు తరువాతి తరములవారు పద్మావతీపరిణయములో నీరీతిం జెప్పఁబడినారు :—

కసవరాజు పిమ్మట నతనితమ్ముఁడైన వేంకటపెరుమాళ్రాజు రాజ్యముచేసెను. అతని యనంతర మాతని యన్నకొడుకగుబ్రహ్మరాజు రాజ్యముచేసెను. బ్రహ్మరాజుకొడుకులు కావేరిరాజు వేంకటపెరుమాళ్రాజులు. వేంకటపెరుమాళ్రాజు కొడుకు బ్రహ్మరాజు; అతని కొడుకులు కుమారవేంకటపెరుమాళ్రాజు, కావేరిరాజు, తిరుమలరాజు, సుందరకృష్ణరాజును. కుమారవేంకటపెరుమాళ్రాజుకొడుకులు అ[2]బ్రహ్మరాజు మొదలగువారు. ఈబ్రహ్మరాజే పద్మావతీపరిణయ కృతిపతి. కసవరాజునకు బ్రహ్మరాజునకు నడుమ నయిదుగురు రాజ్యముచేసినట్టులు దీనివలనఁ గనఁబడుచున్నది. ఈగ్రంథములోఁ గుమారవేంకటపెరుమాళ్రాజు తారణసంవత్సరచైత్రమాసములో లోకాంతరగతుఁడైనట్లును, నానంవత్సరజ్యేష్ఠమాసములో బ్రహ్మరాజు పట్టాభిషిక్తుఁడైనట్టును బ్రహ్మరాజునాజ్ఞ ననుసరించి యాగ్రంథము వికృతిసంవత్సరమునం దచ్చుపడినట్లు నున్నది తారణసంవత్సరము 1884వ క్రైస్తవసంవత్సరమునకును, వికృతిసంవత్సరము 1890 సంవత్సరమునకును సరిపోవును. కుమారవేంకటపెరుమాళ్రాజు సవతితమ్ముఁడగుతిరుమలరాజున కంకితమైనట్టియు, గరుడాద్రి సుబ్రహ్మణ్యవిద్వత్కవి ప్రణీతమైనట్టియు [3]శత్రుఘ్న

---

[1] ఈగ్రంథము కార్వేటినగరమునందలి శ్రీభారతీలీలాసదనముద్రాక్షరశాలలో నచ్చుపడినది

[2] బ్రహ్మరాజునకు బొమ్మరాజని వాడుకపేరు బ్రహ్మరాజుగారిపుత్రు లయినకుమారవేంకటపెరుమాళ్రాజు, కుమారస్వామిరాజుగార్లు ప్రస్తుతసంస్థానాధిపతులుగానున్నారు.

[3] ఈగ్రంథము ప్రాఁతప్రతి యాంధ్రసాహిత్యపరిషత్పుస్తకభాండాగారమున నున్నది

విజయ మీావంశక్రమమును దృఢపఱుచుచున్నది. ఈ గ్రంథము ౧౭౮౬ వ (రసకరిమునిశశి) శాలివాహనసంవత్సరమునకు సరియైన ప్రభవసంవత్సరమునఁ బూరింపఁబడినట్లు గ్రంథాంతమం దున్నది. ఇది క్రీ. 1864-వ సంవత్సరమునకు సరి పోవును. అప్పటికిఁ గుమారవేంకటపెరుమాళ్ళ్రాజు సజీవుఁడై యున్నట్లును, వతనికి బ్రహ్మరాజు, కుమారవిజయవీరరాఘవరాజు, కావేరిరాజు, సింగరిరాజు వనువలు పురుకొడుకు లున్నట్లును జెప్పి యింకను బలువురు తనయులు కలుగుదురుగాక యని కవి యాశీర్వదించినాఁడు క్రీ 1884 సంవత్సరమునఁ గాలధర్మమునొందిన కుమారవేంకటపెరుమాళ్ళ్రా జీతఁడే యగుట నిస్సంశయము ఈకుమారవెంకట పెరుమాళ్ళ్రాజు కసవరాజునకై దవతరమువాఁ డగుచున్నాఁడు. ఆచారానుసార ముగాఁ దరమున కిరువదియైదుసంవత్సరములచొప్పున లెక్కించినచోఁ గసవరాజు క్రీ. 1714 సంవత్సరప్రాంతమువాఁ డగుచున్నాఁడు. స్థూలదృష్టిచే, క్రీ 1700 సంవత్సరప్రాంతమువాఁ డనుకొందము

వేఱొక లెక్కనుబట్టి చూచినను నించుమించుగా నీకాలమే ధ్రువపడుచు న్నది. ఎట్లన :—

కవిగురువైన తిరువెంగళార్యుఁడు సాళ్వతిమ్మన్నపాలుఁడు, వీరవేంకటరాయ శౌరి, వెలుగోటివేంకటవిభుఁడు, చెంజి వరదేంద్రుఁడు ననుప్రభువులచే గౌర వింపఁబడినట్లు గ్రంథములోనున్నది. (అ ౧ ప. ౩౧) సాళ్వతిమ్మన్నపాలుఁ డెవ్వఁడో తెలియదు. ఆకాలమం దాపేరుగల సుప్రసిద్ధరాజు గానరాఁడు. సామాన్యుఁడై నజమీాందారుఁడై యుండనోపును చెంజి వరదేంద్రుని కాలము స్పష్టముగాఁ దెలియుచున్నది. దీనినిబట్టి యితరుల కాలము నిర్ణయింపవలసి యున్నది. చెంజి యనునది దక్షిణార్కాటు మండలములో సుప్రసిద్ధ మైనస్థలము. ఆంగ్లేయభాషను దీనిని "జింజి" యందురు. కర్ణాటరాజ్యకాలమం దీచెంజిదేశమును గొందఱునాయకులు పాలించుచుండెడి వారు. ఆనాయకులలో నొక్కఁడగు "చెంజ వరదప్పనాయనయ్యవారు తీర్థాచ రణవచ్చి శేతుదర్శనం శేశి స్వస్తిశ్రీశాలివాహనశకవర్షంబులు ౧౫౯౩ కల్యబ్దాః ౪౭౭౨ అస్మిన్ వర్తమానె వైశాఖబహుళసప్తమి స్థిరవారం యీాపుణ్యక్షేత్ర మైన... ...మరప్రదేశం ఆకార్తికశుద్ధపౌర్ణమినాడు కొమారస్వామికి బం గారు అందలమున్ను సమర్పణశేశి తమఆరతిను యేర్పాటు శేయించినారు" అని మధురకు సమీపమందున్న సుప్రసిద్ధకుమారక్షేత్రమగు తిరుప్పరంగుండ్ర మను

గ్రామమునందలి దేవాలయములో నొక్క తెలుఁగుశాసనమును, దాని కనువాదముగా నొక యఱవశాసనమును గలవు౧ ఈశాసనములో వరదప్పనాయనితోఁ గూడ నిరువదియైదు తరములవారు పేర్కొనఁబడియున్నారు. వీరిలో వరదప్ప యనుపేరుగలవాఁ డితఁ డొక్కఁడుమాత్రమే యున్నాఁడు. తిరుమలార్యుని గౌరవించిన చెంజి వరదేంద్రుఁ డీవరదప్పనాయఁడే యనుటకు సందేహ ముండఁ గూడదని నాయభిప్రాయము. వరదప్పనాయనిశాసనసంవత్సరము క్రీ. 1671 సంవత్సరమునకు సరిపడును. ఇఁక వీరవేంకటపతిరాయశౌరి యెవ్వరో చూతము. పేరునుబట్టిచూడ నీతఁడు కర్ణాటరాజని స్పష్టమగుచున్నది సుప్రసిద్ధుఁ డగు వీరవేంకటపతిరాయలు క్రీ. 1614 ప్రాంతమున మృతి నొందెను 1643 ప్రాంతమున శ్రీరంగరాయలు రాజ్యమునకువచ్చి 1678 ప్రాంతమందు రాజ్యభ్రష్టుఁడై మహిసూరు దేశములో మృతినొందెను ఈయిద్దఱురాజుల నడిమికాలమునందుఁ బలువురు రాజ్యమును గాంక్షించుటచే ఘోరమగుపోరు పుట్టి శ్రీరంగరాయలు రామరాయలు వేంకటపతిరాయలు ననువారు స్వల్పస్వల్పకాలము సింహాసనమధిష్ఠించి పదభ్రష్టు లగుచువచ్చిరి. శ్రీరంగరాయలపిదప క్రీ 1678–1680 సంవత్సరములలో వేంకటపతిరాయలు రాజ్యముచేసినట్టులు కొన్ని౨శాసనములవలనఁ గనఁబడుచున్నది. ఈవేంకటపతిరాయలకాలము చెంజ వరదప్పనాయనికాలమునకు సరిపోవుచున్నది. ఈతఁడే తిరువేంగళార్యుని గౌరవించిన వీరవేంకటరాయశౌరియైనట్లు తోఁచుచున్నది. నిజముగా శ్రీరంగరాయలతోడనే కర్ణాటరాజ్యమంతరించినది. అదిమొదలు చాలకాలమువఱకు నావంశములోనివా రెవ్వరో యొక రానెగొంది సమీపదేశమునకుఁ బ్రభువులై పూర్వాధికార మంతరించినను బూర్వరాజుల బిరుదములను మాత్రము పెట్టుకొనుచుండినట్లును, గౌరవార్థముగా వారినే కర్ణాటరాజులుగా మధురనాయఁకులు మొదలగువారు భావించుచుండినట్లును శాసనములవలనఁ గన్పట్టుచున్నది ఇఁక వెలుగోటి వేంకటప్రభుఁ డెవ్వరో చూడవలసి యున్నది. ౩ బ్ర వెల్లాల సదాశివశాస్త్రిగారు రచియించిన వెలుగోటివారి వంశచరిత్రమువలన వేంకట యనునామముగలవారు ౧౯–౨౦–౨౧ తరములలోమాత్రమే యున్నట్టులు కనఁబడుచున్నది. ౨౦–వ తరమువాఁడైన యాచ

౧ ఈశాసనములు రాజకీయశాసనాధికారులు 1917 సంవత్సరములో సంపాదించిన శాసనములలో 860-881 సంఖ్యలు గలవి. వారికార్యస్థానమునఁ జూడనగు.

౨ చూ. Sewell's Lists of Antiquities Vol. II.

శూరున కెనసుంద్రు కొడుకులు వారిలో వేంకటాద్రినాయఁడు, వేంకటప్పనాయఁడు, చిన వేంకటప్పనాయఁడు నను ముగ్గురు వేంకటాభిధాను లుండిరి. వీరిసోదరుఁడును రాజ్యభర్తయు నైన కుమారయాచమనాయఁడు మహిసూరువారితో యుద్ధముచేసి జయమంది "అబ్దుల్ ఫాదుషా" గారివలన బహుమానములు పొందినట్లు బ్ర. సదాశివశాస్త్రిగారు వ్రాసినారు అబ్దుల్ ఫాదుషా యనఁగా అబ్దుల్ కుతుబ్ షా యను గోలకొండరాజు ఈరాజు క్రీ 1611 మొదలు 1672 వఱకు రాజ్యముచేసెను ఇదియుఁ జెంజి వరదప్పనాయని కాలమునకు సరిపోవుచున్నది. యాచశూరునిసోదరులు కూడ నీకాలమువారే వారు ముగ్గురిలో నెవ్వరో యొకరు చంపూరామాయణములోఁ జేర్కొనఁబడిన వెలుగోటి వేంకటవిభుఁడు కావలయును ఈప్రమాణములు మూఁటినిబట్టి తిరువేంగళార్యుఁడు క్రీ 1670–80 సంవత్సరములప్రాంతమువాఁ డైనట్లు తేలినది ఆతని శిష్యుఁడైన వేంకటాచలపతికవి క్రీ 1700 ప్రాంతమందుఁ గృతినిర్మించుట యీకాలనిర్ణయమున కవిరోధమే కదా !

కవికాలనిర్ణయము చేయుట కింకొకయాధారము కూడఁగలదు వేంకటాచలపతికవి దామర యక్కన్నృపాలుని సన్నిధికిం జని నప్పు డెవ్వరో "వరకవి గంధసింధురము వచ్చె" నటన్న "నేను గవిరాజకేసరి" నని కవి పల్కెనఁట. (చూ ఆ. ౧ ప ౩౮) ఈ యక్కనృపాలుఁ డెవ్వరో నిర్ణయింపవలసియున్నది. ధూర్జటి లింగకవి కృత ౧కాళహస్తిమాహాత్మ్యమువలనఁ గాళహస్తి రాజవంశమం దక్కప్ప యనుపేరు గలవారు నలువు రున్నట్లు తెలియవచ్చుచున్నది వారిలో మొదటివాఁడు చెన్నపట్టనమునకుఁ బేరొసంగిన చెన్నప్పనాయని రెండవకుమారుఁడు ఈతఁడే ఉషాపరిణయగ్రంథకర్త. ఈయక్కప్పనాయని మనుమఁడుఁగూడ నక్కప్పయే ఈ రెండవయక్కప్పకు, అక్కప్పయను కుమారుఁడును మనుమఁడును నమ్మక్కయను గూఁతురునుండిరి అమ్మక్క వెలుగోటి వీరకుమారయాచమనేని భార్యయై బంగరు యాచమనేనిం గనియెనఁట ఈబంగరు యాచమనీఁడు క్రీ. 1693-వ సంవత్సరమువఱకు సజీవుఁడై నట్లు వెలుగోటివారి వంశచరిత్రము చెప్పుచున్నది కావున, బంగరు యాచమనేని మేనమామకుమారుఁడగు నాలుగవయక్కప్ప క్రీ. 1700 సంవత్సరప్రాంతమువాఁ డనియు వేంకటాచలపతికవికి సమకాలికుఁ డనియుఁ దేలుచున్నది. ఏవిధమునఁ జూచినను వేంకటాచల

---

౧ ఈగ్రంథము వ్రాఁతప్రతి, యాంధ్రసాహిత్యపరిషత్పుస్తకభాండాగారమునఁ జూడనగు.

పతికవి క్రీ. 1700 ప్రాంతమం దుండె నని సిద్ధాంతీకరించుట కాస్పద మేమియుఁ గనఁబడదు

పద్మావతీపరిణయమునందుఁ గనవరాజు నుత్తరచరిత్ర మిట్లు వర్ణింపఁబడినది :—

“కనవరాజపుత్రకుండై వయసునఁ జిన్నవాఁడైనను గుణములచేఁ బెద్దయు, వేంకటేశ్వరాంశసంభూతుండు నైన వేంకటపెరుమాళ్రాజనుచిన్నతమ్ముని రాజ్యతంత్రధురంధరుంగా నెంచి యతనియందు రాజ్యభార ముంచి నిస్పృహుఁడై వానప్రస్థాశ్రమము నంగీకరించి భార్యతోఁ గూడ మునినికరముం జేరి వారిచెంతఁ గొండగుహాయందు వసించి దుష్కరమగు తప మొనర్చుచుఁ గొంతకాలముండి యంతటఁ దనకు మోక్షకాలము సమీపించినదని యెఱింగి నిజరాజధాని యైననారాయణపురమునకేగి యందున్నకల్యాణవేంకటేశ్వరుని యాలయములో ధ్వజస్తంభముచెంత భగవత్పాదములు స్మరించుచు బ్రహ్మరంధ్రమునుండి ప్రాణమును విడిచెను.” అని చంపూరామాయణములోఁ గనవరాజునకు సింగరిరాజు, తిరువేంగళరాజు పెరుమాళ్రాజు ననువారు ముగ్గురే తమ్ము లుండినట్లు చెప్పఁబడినది. పద్మావతీపరిణయములో నీతనికి, తిరుమలరాజు, వేంకటపతిరాజు, చిన్నరాజనను మఱి ముగ్గురుతమ్ములుఁగూడ నుండిరనియు నీయార్గురిలో వేంకటపెరుమాళ్రాజు కడపటివాఁ డనియు నీతఁడే ౧కార్వేటినగరమును గట్టించెననియు, నంతకుఁ బూర్వము నారాయణపురమే రాజధానిగా నుండె ననియుఁ జెప్పఁబడియున్నది.

ఈగ్రంథము ప్రతియొక్కటే అత్తిరాలలో బ్ర॥ వెల్లాల చిన్నవేంకటసుబ్బయ్య సిద్ధాంతిగారివలన దొరకినది దీని చివర “యతుల నారసింహ్వరాజు వ్రాసిన చంబూరామాయణం” అనియున్నది. ప్రత్యంతర మింతవఱకు దొరకలేదు లేఖనదోషములుమాత్రము సవరించి వలసినపట్ల సంస్కృతచంపూరామాయణమునకు సరిచూచి మాకు దొరకిన ప్రతి ప్రకటించినారము.

వేంకటేశ్వరాష్టకములోనివి గ్రంథావతారికలో (పుట ౪.) ముద్రింపఁబడిన మూఁడుపద్యములుగాక మిగిలిన యైదుపద్యములు నీక్రిందఁ జేర్పఁబడినవి.

శా. సర్వేందు ప్రతిబింబవక్త్రము శరత్పద్మాక్షియుగ్మంబు కీ
రార్వశ్లాఘ్యధనుర్గుణాసహన నూనాకారనాసోన్నతి

౧ చంపూరామాయణములోఁ గార్వేటినగరప్రశంస యుండుటచే నీమాట సత్యము కా దని తెలుచున్నది.

శర్వాదుల్ను తియింపలేనితఱి నీసౌందర్య మెంతోగదా
కార్వేటీశ ప్రసన్న వేంకటరమాకాంతా మనోవల్లభా.

శా॥ ఆర్వేలేండ్లు తపంబుచేసి భవదీయావాస శేషాద్రిపైఁ
జెర్వంగాంచెను వేల్పుమూఁకకు మహాసేనుండు బల్నెత్తురుల్
నుర్వెల్లట్టఁగఁ దారకాసురుని దానుగ్గాడె నీశక్తిచేఁ
గార్వేటీశ ప్రసన్న వేంకటరమాకాంతా మనోవల్లభా

శా॥ తార్వాళంబులు వంచి చిత్తరుల వింతల్పుచ్చెపైయుండఁగాఁ
దిర్విథుల్ భవదీయ సన్నిధిని ముస్తైదైన యావీథిలోఁ
దెర్వారే తిరునాళ్ల నీకు నడవ దృశ్యంబు గాకుండఁగాఁ
గార్వేటీశ ప్రసన్న వేంకటరమాకాంతా మనోవల్లభా.

శా॥ కుర్వేరుం దమనంబు జాతిసుమముల్ గోరంట చేమంతులుఁ
హార్వైనిగ్గులు దేలు శ్రీతులసి సీకర్పించు మర్త్యుండు దా
నేర్వజ్రంబుల మౌక్తికంబులను బూజంచేఫలం బొంగుఁగా
కార్వేటీశ ప్రసన్న వేంకటరమాకాంతా మనోవల్లభా.

శా॥ ఓర్వన్నశక్యమె యామ్య బాధ కటువై యుండన్మనుష్యుండిలం
జార్వాకోక్తులచేతనే చెడు దురాచారంబు గావించుఁగా
శర్వర్యంగు సహస్రునందును భవచ్చారిత్రదూరాత్ముఁడై
కార్వేటీశ ప్రసన్న వేంకటరమాకాంతా మనోవల్లభా

జయంతి రామయ్య.

---

కవిత్వవిమర్శనము.

శ్రీమద్రామాయణమును జంపువుగా సంస్కృతభాషయందు రచించినకవి భోజరాజు ఈరాజకవి ధారానగరము రాజధానిగాఁ గల మాలవదేశమున క్రీ. శ.1018 సం॥ మొదలుకొని 1060 వఱకు రాజ్యముచేసినట్లు శాసనములవలనఁ దెలియుచున్నది కనుక నితఁడు క్రీ శ 1022 సం॥ మొదలు 1063 సం॥ వఱకు వేంగీదేశమును బాలించిన మనరాజరాజనరేంద్రునకు సమకాలికుఁడుగా నున్నాఁడు. ఇతఁడు సరస్వతీకంఠాభరణము, పాతంజలసూత్రవృత్తి మొదలగు గ్రంథములను రచించియుఁ బెక్కుపండితకవులకు నాశ్రయభూతుఁడై వారిచే బహుగ్రంథముల రచింపించియు సంస్కృతభాషను మహోన్నతిఁ దెచ్చెను.

చంపూరచన కితఁడు మార్గదర్శి. ఇంగుల కితఁడు 'గద్యానుబన్ధరసమిశ్రితపద్యసూక్తి ర్హృద్యాహి వాద్యకలయాకలితేవ గీతి' యని గద్యముతోఁ గూడిన పద్యకావ్యము వాద్యముతోఁ బాడినగీతమువలె హృద్య మని కారణమును నిరూపించెను. ఇతఁ డీచంపూరామాయణమున నయిదుకాండములే రచించి యేకారణమువలననో యాఱవది యగుయుద్ధకాండమును రచింపక విడువఁగా దానిని లక్ష్మణసూరి యనుకవి రచించి పూరించినవాఁడయ్యె. ఈకవిశిఖామణు లిద్దఱును రచించిన యీచంపువు మృదుమధురపదసందర్భసుందరమై చదువరుల నిర్భరరసాస్వాదపరవశులం జేయుచు సంస్కృతభాషకు వన్నెగలిగించుకావ్యములం దొక మిన్నగా నెన్నంబడగియున్నది.

ఇట్టి ప్రబంధమును దెనుఁగుచేసినవాఁడు కవిరాజకంఠీరవ బిరుదాంకితుఁ డగుఋగ్వేదికవి వేంకటాచలపతి

ఇతని యాంధ్రీకరణపుఁ దెఱంగులు కొంత పరామర్శింతము. ఇతఁడు మూలమును గొన్నియెడల వేఱుగ మార్చియుఁ, గొన్నిపట్టుల లేనివి గూర్చియుఁ, గొన్నిచోట్ల నున్నవి విడిచియుఁ దెలిఁగించినను మొత్తముమీఁద మూలమున కంతగా హెచ్చును దక్కువయుఁ గాకుండ దీనిని రసవంతముగానే రచించినాఁ డనవచ్చును. భాషాంతరముసేయుట యనఁగా నొకభాషలోనిపదమునకు మఱియొకభాషయందలి మాఱుపదమును మక్కికిమక్కిగాఁ బెట్టుట గాదు. భాషలు తమతమశబ్దవాక్యస్వరూపవిశేషములంబట్టియుఁ, దన్మూలకము లైనవ్యాకరణప్రక్రియలంబట్టియు, రచనయందును శైలియందును, స్వభావమునందును బరస్పరభేదము గలిగియుండును గనుక నొకభాషయందలిపదములను మఱొకభాషలోనికిఁ బరివర్తనము చేయునప్పు డారెండవభాషస్వభావాదుల ననుసరించి తగుకొలందిని వానిని మార్చియుఁ గూర్చియు రచించిననే యవి రమణీయమై రసవంతముగా నుండును. 'బ్రహ్మాండభాండము'లను 'బమ్మగుడ్డుకుండ'లనుటగాని 'పెండ్లికొడుకు'ను 'వివాహపుత్రుఁ' డనుటగాని భాషాంతరము గాదు. దీని నెఱింగియే కవికులాదృష్టాధ్వగమనుఁ డగుశ్రీనాథుఁడు తన తెనుఁగునైషధమున 'శబ్దం బనుసరించియు, నభిప్రాయంబు గుఱించియు, భావం బుపలక్షించియు, రసంబుఁ బోషించియు, నలంకారంబు భూషించియు, నౌచిత్యం బాదరించియు, ననౌచిత్యంబు పరిహరించియు మాతృకానుసారంబునఁ జెప్పంబడిన యీభాషానైషధకావ్యం' బని వ్రాసినాఁడు. ఇఁక నీకవి తెనుంగునందలి మార్పులను గూర్పులను విడుపులను నుదాహరించెదము

మార్పు:—ఇట మూలమును పెంచికాని తగ్గించి కాని మాత్రింత మెఱుంగు గూర్చిన మార్పులను దెలిపెదము

మూ. సీతా పురా గగనచారిభి ర ప్యదృష్టా
మాభూ దియం సకలమానవనేత్రపాత్రమ్
ఇ త్యాకలయ్య నియతం విదధే విధాతా
బాష్పోదయేన నయనాని శరీరభాజామ్ (అయోధ్యా)

తె మ. అజరాదుల్ పొడగాంచఁగూడని యసూర్యంపశ్య నా రాముదే
వి జనానీకవిలోకభాజనము గావింపక మదిం గొంకి పం
కజగర్భుండు ఘటించె నాగరకలోకశ్రేణికిం జూడ్కి బా
ష్పజలాకీర్ణముగా నజాహ్వయభృతత్రాత్రాభిమానోన్నతిన్ (4అ 52ప)

మూలమునందుంబోలెఁ దెనుఁగున గగనచారులకును బొడగాంచరానిదని సీతకు వనవాసానర్హతను దెలుపుటకై పరమసౌభాగ్యప్రయుక్తి మగుసౌకుమార్యాతిశయము చెప్పుటయే కాక యెక్కువగా 'అసూర్యంపశ్య'యనియుఁ జెప్పి యెండ కన్నెఱుంగనిది యడవి కెట్లు పోఁజాలు నని సందర్భోచిత మగుకరుణరసమును మూలముకంటె మిక్కుటముగా నిండుఁగని వెలివిరియించినాఁడు రాముని దేవిని మనుష్యులు చూడ నెనువుగాకుండునట్లు చేసినవిధాతకు రామునియం దింతయభిమానమేల యని యాశంక కల్పించికొని బ్రహ్మకును రామునితాతకును గల "యజాహ్వయ"మే హేతువుగా నిబంధించి మూలమున కెంతో మెఱుఁగు గావించినాఁడు

మూ యద్యస్తి కౌతుక మపూర్వమృగే మృగాక్షి
చాన్ద్రం హరామి హరిణం నను సన్నిధేహి
యావ న్న ముఞ్చసి ముహుః ప్రతి మేణ మేనం
తావ ద్దధాతు తవ వక్త్రతులాం మృగాఙ్కః (అరణ్య)

తె. శా. సీతా వింతమృగంబుపైని దమియుం బే నేమి కాదంటినా
రాకాచంద్రున కంతరంగ మగుసారంగంబు రప్పించెదం
గైకొ మ్మాహరిణంబు నీకరమునం గన్పట్టునందాఁక శు
ద్ధాకారుం డతఁ డొందుఁగాక భవదీయాస్యైకదాస్యోన్నతిన్ (5అ. 81ప)

మూలమందలి 'చాన్ద్రంహరిణ'మ్మునకంటెఁ దెనుంగునందలి 'రాకాచంద్రున కంతరంగ మగుసారంగ' మనుట మిక్కిలిసొంపు మూలమునఁ జంద్రుఁడు మృగాం

కమును వీడి శుద్ధుఁడై సీతాముఖమున్ఁబోలు నని యుండఁగాఁ దెనుఁగునందు శుద్ధుఁడయ్యును సీతాముఖమునకు దాస్యోన్నతినే పొందునని మిక్కిలి సారస్యము గలిగి యున్నది

'సచివా స్తైలద్రోణ్యాం నిక్షిప్య' యన్నముక్కను

గీ. అర్హమయ్యెఁ గృతాధ్వరుం డయినయతని
దేహము తిలోత్తమోదితస్నేహమునకు
నర్హముగదా కృతాధ్వరుం డైనయతని
దేహము తిలోత్తమోదితస్నేహమునకు.

అని తెలిఁగించి శ్లిష్టార్థాంతరన్యాసానుప్రాసములతో మిక్కిలి చమత్కరించినాఁడు.

ఇట్లె మూలమున 'అస్తి ప్రశస్తా జనలోచనానా, మానన్దసన్ధాయిషు కోసలేషు। అజ్ఞానముత్సారితదానవానాం, రాజ్ఞా మయోధ్యేతి పురీ రఘూణామ్' అనుశ్లోకమునకుఁ జాతుర్వర్ణ్యాదివర్ణనకలిత మగు నొకసీసపద్యమును, విశ్వామిత్ర యాగసందర్భమున 'కరతలగలితపలాశనమిత్రులాశాః కుశికసుతాన్తేవాసినః' అనుటకు ౩-వ యాశ్వాసమున (84, 85, 86, 87) నాలుగు పద్యములును, హనుమదాదులప్రాయోపవేశఘట్టమున 'తాస్తాః కథాః పరిదేవయన్త' మ్మనుటకు నయిదాఱుపద్యములను రచించి మూలముకంటెఁ దెనుఁగును రసోద్వేలము గావించినాఁడు.

కూర్పు:—ఇందు మూలములో లేనివై కేవలకవికల్పితము లగువానిని వ్రాసెదము

వసంతవర్ణనము

సీ. జిగిలేవపడఁతికిఁ జెంగావిపావడ యవనీపదోచితయావకంబు
మాధవశ్రీకి నిమంత్రసిందూరంబు కలికానికాయతారలకు సంజ
పరభృతవాఙ్మయప్రదశాంభవీరుచి వనికాపురంధ్రి కాననహరిద్ర
వనదేవతచనుంగవకుఁ గుంకుమముడంబు ధారణీరుహశైలగైరికంబు
కామినీకాముకవినోదకలనకొఱకు, సమయవర్ధకి పొదరింటిగమికిఁ గీలు
కొలిపినరుటంపుఁగెంపుజాతులకుఁ దోడు, బల్లగుము రెల్లకడనుద్భవిల్లెఁ జిగురు.

మ. మరునంపుల్ మఱుసృష్టి మ్రాఁకులయెడం బాలించు టెక్కు హేమో
పరిసంహారముఁ జూపి తత్త్రిపురుషీభాగాచితిం జైత్రుఁ డొం
దురజస్సత్త్వతమోగుణోన్నతు లనం దోఁచెం జిగుళ్లుం జిగు
ళ్లరకంబయ్యెడుక్రొవ్విరుల్ విరులపట్లఁ బ్రాలుభృంగంబులున్.

చ. చనదు వినోదకోప మిఁక సాగవు బింకము లాలకింపుఁ డీ
మనసిజుఁ డానతిచ్చినక్రమం బిది యంచు విటీవిటాలికిం
బనుప వసంతుఁ డకురసమాజము వ్రాసిన కాగితంబులో
యనఁ దనరెఁ బంభరవనాంతరకాంతలతాంతబృందముల్.

ఇత్యాదులు పెక్కులుగలవు బాలకాండమున దశరథుని యనపత్యతావిచారమును, మిథిలాపురవర్ణనమును విశ్వామిత్రకృతసీతాసౌందర్యవర్ణనమును వివాహవర్ణనమును మూలమందు లేవు అష్టాదశవర్ణనములనందర్భములో నీతని సొంతపద్యములు లేనితావు లేదు

విశువు:—ఇందు మూలమున నుండియుఁ గవిచే విడిచిపెట్టఁబడినవానిని వ్రాసెదము మూలమున విరాధుఁడు సీతను విడిచి రామలక్ష్మణుల నెత్తికొని పోవుసందర్భమున

'యాతునః పదవీ మైషా యా తు న శ్వాస్య లక్ష్మణ
యాతు కామం తస్మై వేదం యాతు కామం నహాన్యతామ్.
'అయి కబలయ మా మమా విముఞ్చ త్యతికరుణం రుదతీ మవేక్ష్య సీతామ్
అర మరచయతా ముభా వసిభ్యాం పిశితభుజం భుజభారహీనమేనమ్
'పక్షోవధః ప్రకృత ఇ త్యయమేవ శంసే
త్స్వర్గాయ గాయకపదం గమితో విరాధః
నాగాలయాయ వపు రస్య వదే దితీవ
శ్వభ్రే త దక్షిప దిషుప్రహతం స రామః॥' అను శ్లోకములును, శూర్పణఖ రామునిం గూర్చి—
'లావణ్యామ్బునిధే రముష్య దయితా మేనా మి మైనం జనం
కస్మా న్మాస్పృజ దస్మదన్వయగురో రుత్పత్తిభూః పద్మభూః
అస్మా మేత దరణ్యవాసరసికే హా కష్ట మస్మి న్నిమామ్
కాన్తిం కాననచన్ద్రికాసమదశాం కిం నిర్మమే నిర్మమే.
అన్నశ్లోకమును మఱియు నిట్లి రసవంతము లగుకొన్నిశ్లోకములను విడిచినాఁడు.

మూలమునకు సమాన మైన తెనుఁగు

మూ. శ్లో. సంక్రాన్త వర్ణా న్తరగాధిసూనో
స్సంపర్కపుణ్యాదివ రామభద్రః
జూత్రిక్రమా త్త్రిప్పులదణ్డయోగ్యః
పలాశదణ్డాద్ధృతపాణి రాసీత్. (బాల)

తె. గీ. కలితవర్ణాంతరుం డైనగాధిసూను
సహచరత నేమొకో నిజపుత్త్రిజాతి
కయిన పిప్పలదండ మూనియుఁ బలాశ
దండకరుఁ డయ్యె నపుడు మార్తాండకులుఁడు. (2 ఆ. 90 ప)

మూ. శ్లో. రేఖారథాబ్జ సరసీరుహశఙ్ఖచిహ్నే
క్షేమంకరే తవ కరే జగతాం త్రయాణామ్
కాన్తారకన్దఖననం రచయేతి నూన
మాబద్ధవాన్ ప్రతిసరం భగవా న్వసిష్ఠః. (అయోధ్యా)

తె. చ. ధరజలజాదిచిహ్నములు దాపుకొనంగ జగత్త్రయీశివం
కర మగునీకరంబునకుఁ గంకణ మార్తినిదానకాననాం
తరతరుమూలకందఖననం బొనరింపు మటంచుఁ గట్టెనో
గురుఁ డగుశక్తితండ్రి రఘుకుంజరు నిన్నఁటియుత్సవోన్నతిన్.

మూ. శ్లో మహాసమరసూచకః ప్రతిదినం మనోజన్మనో
మయూరగళకాహళీకలకల స్సముజ్జృమ్భతే
పయోదమలినే దినే పరమవిప్రయోగవ్యథాం
న రేషు వనితాసు వా దధతి హన్త కేకా ఇతి (కిష్కింధా)

తె. పృథ్వి. చెలంగె నలుదిక్కులన్ శిఖిశిఖావళీకంఠకా
హాళీధ్వని 'వియోగితామపి న రేషు నారీషు వా
జలాకులఘనే దినే సపది యాన్తి కేకా' యితి
చ్ఛలారిభటితో మనోజరణవేగసంసూచియై

ఇట 'వియోగితా... ....కేకా' యను దానిని దెలిఁగించిన రసభంగము గాన దాని నట్లె యనుకరించి వ్రాసినాఁడు.

ఇతని కవిత్వమందు దోషములును గొన్ని గలవు. కొన్ని పూర్వాంధ్రకవుల యనుకరణములును గలవు. ఒకొక్కచోటఁ దెనుఁగు మూలమున కంటె నొకటి రెండువన్నెలు తక్కువగా నుండుటయుఁ గలదు. స్థాలీపులాకన్యాయమున నొక్కయుదాహరణము.

మూ. శ్లో వాచం నిశమ్య భగవా నథ నారదస్య
ప్రాచేతసః ప్రవచసాం ప్రథమః కవీనామ్
మాధ్యందినాయ నియమాయ మహర్షిసేవ్యాం
పుణ్యా మవాప తమసాం తమసాం నిహన్త్రీమ్.

క. అమరమునివల్కు- పిని సం,భ్రమమున వాల్మీకిసుకవి మాధ్యందినకృ
త్యమొనర్ప నరిగె సురుచిర, తమసారసకుముదవనికిఁ దమసాధునికిన్

ఇట ముని మాధ్యందిననియమునకుఁ దెనుఁగునందలి నదీవిశేషణములకంటె మూల మందలివి మిక్కిలి యుచితములు కథావిషయమునను నొకానొకచో మూలమునకును దెనుఁగునకు భేదము కనఁబడుచున్నది మూలమునఁ గ్రౌంచమిథునములో నొక్క-దానినే బోయ చంపినట్లుండఁగా రెంటిని జంపినట్లు తెనుఁగుననున్నది. కొన్నిలక్షణదోషములును గలవు మొగఱా (ఆ 3.71 మొగఱాయనుట సాధురూపము) ధనువంశము (ధనుర్వంశము) కడానిబెత్తపు (కడానిబెత్తపు) ఇత్యాదులు చూపట్టుచున్నవి 'గండపెండేరముఖపరిష్కా-ర' (3 ఆ 71) యని సమాసగర్భమునఁ దెనుఁగు దుష్టమయ్యును బూర్వశాసనములందుఁ గండపెండెరము మొదలగు రాజచిహ్నాభిధాయకములు సంస్కృతసమాసములందు ఘటితములై యున్నవి. కూఁతుశబ్దమునకుఁ బ్రథమైకవచనమాత్రనియత మగుకువర్ణకము సమాసముననను బహువచనమునను విభక్త్యంతములను గనుపట్టుచున్నది రెండవయాశ్వాసమున 25-వ పద్యమున 'సూళగేరి' యనుపదము మొదట 'సురలగా' రని దిద్దంబడినను బిదపఁ గర్ణాటనిఘంటు పరిశీలనమున నాగవాసమునకు వాచక మగు 'సూళగెరి' యనుపదముగాఁ దెలిసి దిద్దంబడినది

కవి దాక్షిణాత్యుఁడు గాన నొండు రెండుచోటుల ద్రావిడకర్ణాటపదములు పడినవి 'చెలంగె నలుదిక్కు-ల' సనుపృథ్వీవృత్తమునకుఁ గవి తొమ్మిదింట యతిని వేసినాఁడు వసుచరిత్రపీఠికను బ్ర॥ శ్రీ భద్రాద్రిరామశాస్త్రులవారు 13-వ యక్షరమును,శృంగారనైషధవ్యాఖ్యానమున బ్ర॥ వేదము వేంకటరాయశాస్త్రులవారు 14-వ యక్షరమును బృథ్వికి యతిగా వ్రాసిరి పూర్వకవిప్రయోగములందు 12-వ యక్షరము యతిగా నున్నది. కావున దీనినిబట్టి కవి యందుఁ దప్పుపట్టరాదు

ఇక్కడి మూలమున నందందుఁ గల శైలిని శాకమును ననుసరించియే యాయాపట్టులపద్యములను రచించినాఁడు ఇతని కవనమున వ్యర్థపదములును బాదపూరణములును నంతగాఁ గలుగవు స్వతంత్రప్రయోగము చాలవఱకుఁ గలదు రసపోషణము ప్రధానముగా నున్నది కవికి శృంగారరసము మిక్కిలి యభిమతముగా నున్నది. మొత్తమునకు శైలి మధురమై యలంకారబంధురమై యున్నది.

తంజనగరము దేవరాజసుధి,
కట్టి సాంబమూర్తిశాస్త్రి.

గీ. నాంధ్రభాషారచితభారతాదికావ్య, భాగవతముఖ్యవిఖ్యాతబహువిధప్ర
బంధమకరందబృందపుష్పంధయార్య, మతిచతురులు నైనకవిశిఖామణులఁదలఁతు

మ. నిరతంబుం బలుకున్నిటారికి వ్రోకాలిద్దంపుటద్దంబు లై
పరమానందకలావిజృంభణపరీపాకిత్వపాకాంతు లై
సరసోదారకథాసుధారసవిలాసక్షీరవారాసు లై
చిరకీర్తు ల్గనుసత్కవీంద్రుల గుణశ్రీసాంద్రులం గొల్చెదన్. 13

మ. నెల రెణ్ణాళ్లకు నొంపు రొంపుపడెము ల్నిద్రాదరిద్రాణతా
కలితాంధ్రోక్తులఁ గూర్చి యంతియె మదిం గర్వించుదుర్వృత్తు స
త్యలఘుశ్లాఘి దృఢాంధ్రసంస్కృతిసమస్యాపద్యసద్యస్సము
జ్జ్వలసందర్భసమర్థసత్కవుల రచ్చ న్మెచ్చఁగా వచ్చునే. 14

ఉ. ధారణ గద్యసూక్తిమిళితం బగు పద్యము హృద్యవాద్యరే
ఖారమణీయ మైనమృదుగానము రీతి రహించుఁ గాన నా
నారసవత్కవిత్వకలనాచతురాళులు లిచ్చ మెచ్చఁగా
నారసనంబు చంపురచనంబుఁ దినంబుగఁ జేయఁగావు రోన్. 15

— * అ తారిక * —

వ. అని యిష్టదేవతాగురునమస్కారంబును మహాకవిపురస్కారంబును కుకవితిరస్కారంబును సనమస్కారంబుగా నొనర్చి సుధారసమధురదశరథాత్మజకథాసంవిధానబంధురం బగుమహాప్రబంధంబు సందర్భింపం బూని యున్న సమయంబున 16

సీ. సత్యభాషాహరిశ్చంద్రుండు సాహసోన్నతుఁడు శ్రీహరికరుణాకటాక్ష
వీక్షణాలంకారుఁ డిందీవరేక్షణారాజలోచనచకోరచంద్రుఁ డమర
తేజుఁడు సాహిత్యభోజుఁడు దానకర్ణావతారుఁడు మహోహవకిరీటి
యాదిగర్భేశ్వరుం డశ్వరేవంతుండు కిటకపురీచూరకారుఁ డుత్త
గీ. మద్విజాశీర్వచోవర్ధమానసకల, భోగభాగ్యాయురారోగ్యయోగశాలి
కసవరాజన్యమూర్ధన్యుఁడసమవైభవోజ్జ్వలతమంతు కెక్కుఁదానొక్కనాఁడు.

గీ. సరసమై తగునట్టి ప్రసన్నవేంకటేశ్వరస్వామిపద్యము లిపుడు మాకు
వీనులకు విందు సంధిల వినఁగవలయు, ననినఁ జదివితి నార్యులు హర్షమొంద.

శా. వేర్వేఱన్ శివుఁ డంచు విష్ణు వనుచు న్వేల్లంటకావేరిరా
శార్వీనాథకుమారుఁ డౌకసవరా జాత్యాస్యహావృత్తిన్ ధరా
గీర్వాణప్రకరంబు లెంచఁగను భక్తి న్నిన్ బ్రతిష్ఠించెఁగా
కార్వేటీశ ప్రసన్నవేంకటరమాకాంతా మనోవల్లభా! 19

శా. దుర్వాసఃప్రముఖుల్ మునీశ్వరులు నెంతే భక్తిచే నెమ్మది
న్నిర్వాణప్రదుఁ డైన దేవుఁ డని నిన్నే యెంచి భావింపఁగాఁ
దర్వాత న్మది నన్యదైవతచరిత్రం బెంచ మాకేటికిం
గార్వేటీశ ప్రసన్నవేంకటరమాకాంతా మనోవల్లభా! 20

శా. చర్వాద్యావహుతు లాదిగాఁ దగనియజ్ఞంబందు ఋగ్యాజుషా
థర్వోద్గాత్రవచోవిలాసమున నీతత్త్వంబు నిత్యంబు సం
తర్వాఁబల్ నుతియింతు రల్లదెను శాస్త్రగ్రంథసద్యుక్తులం
గార్వేటీశ ప్రసన్నవేంకటరమాకాంతా మనోవల్లభా! 21

క. వారిదగంభీరోక్తుల, నీరతిఁ బ్రసన్నవేంకటేశ్వరునుతియున్
గౌరవమునఁ గావించుచు, ధీరమతిన సభాంతరంబుఁ బొగడెద మఱియున్ 22

చ. పగడపుఁగంబముల్ గరుడపచ్చలబోదెలు అమ్మి కెంపుటా
సొగ సగుచూరుమొగ్గయును చొక్కపునీలపుఁగప్పు బాళువా
జగతియుఁ గ్రొత్తముత్తెములజాలకరాశి సరాజిచలచాల్
జిగిబిగిచెందువాలు పిలసల్లు సభాభవనాంతరంబునన్. 23

సీ. అలమేలుమంగాంతరంగసారసభృంగ లలితుఁ డౌ వేంకటాచలవిభుండు
జానకీముఖపూర్ణచంద్రచకోర మై రాణించు రామచంద్రప్రభుండు
రాధాకుచాద్రిధారాధరాకారుఁ డై భాసిల్లుమదనగోపాలశౌరి
శ్రీరంగనాయికాశృంగారకాసారరాజహంసం బైన రంగపతియుఁ
గీ. చారుచామీకరాధికచాకచక్య, ధూమమాణిక్యధగధగస్ఫురణాభరణ
భాసురవిచిత్రశుభచిత్రపటము లందు, వెలసి కన్నులపండు గావింప మఱియు. 24

ఉ. అందపునర్తనం బభినయంబును మద్దలసద్దు గలిగొ
విందము వేణునాదనవవీనసుధారసధారి వల్లకీ
బృందరవంబుఁ దాళరుల పర్మపురాణము సంపుసొంపు ద
గ్వందితకీర్తి యైనకవిపండితజానసభాంతరంబునన్. 25

* ఈ వేంకటేశ్వరాష్టకములోని మిగిలిన యాఱుపద్యములును పీఠికలో ముద్రింపఁబడును.

★

శ్రీరస్తు

# చంపూరామాయణము.

## ప్రథమాశ్వాసము

— * ఇష్టదేవతాప్రార్థనాదికము * — —

శా. శ్రీవత్సాంకము చాయకై నడిమిటారింప న్మనోవారిజా
తాపిఖ్యాతనిశావిటప్రతిభటుం డై హృత్తిరిం దోఁచుచున్
జీవాత్ముం డనఁ బాల్పుకౌస్తుభముచేఁ జెన్నారు రమాజాని మా
కావేరీప్రభునందనుం గనవరాట్కాంతిగన్ బ్రోవుతన్. 1

ఉ. గుబ్బలికన్యకోచ చెరయుగంబునకున్ సృగాంకుఁడై
నిబ్బరపున్మదం బూనఁగు నెయ్యునఁ బంగరుగట్టువింటవాఁ
డబ్బుర మైననవ్వునఁ బురాసురులం దెగటార్చువాఁడు షా
గిబ్బపటాణిరావుతుఁడు గెల్పునఁగుం గృతిచేరి కేవ్వపుల్. 2

ఉ. నీ వనురాగలీల హవణించు ప్రవాళము కేలిపీణికో
ప్పావా విధ మంచు నెంచుతనసూక్తిచమత్కృతికిన్ దరస్మితం
బావహిలన్ రహించుజవరాలిరిఁ గాంచి పయోజపీఠిఁ గొ
ల్వై వసియించు ధాత కసనావళినేతఁ బరాయుఁ జేయుతన్. 3

సీ. ప్రభవిల్లుఁబద్మసౌభాగ్య మేవిరిఁబోఁడి యభిముఖస్ఫూర్తిఁ జెన్నొందినపుడ
పొగడొందుఁ గుందవిస్ఫురణ మేజవరాలు చిఱునవ్వు కెమ్మోవిఁ జిలికినపుడ
పాటిల్లు నీలసంపత్తి యేవాల్గంటి క్రేగంటిచే నిరీక్షించినపుడ
పల్లవించు ముకుందభావ మేవగలాఁడ యసుగు మందిరమునం దిడినయపుడ

గీ. యాజగన్మాత మకరాకరాత్మజాత, శంఖనందనకచ్ఛపోజ్జ్వలపదాగ్ర
వరమహాపద్మరాగనూపురరుచుల్ రహించఁ గృతినేత గర నర్తించుఁగాత ! 4

ఉ. ఫాణితమాధురిం దెగడుపల్కులయందము నభ్యసింపఁగాఁ
బోణిమి నేగుదెంచుగతిఁ బొల్పగుచక్కెరవింటిదంటనా
బ్రామణిపటాణి వాణి ననురక్తిని దాల్చు మొఱంగుఁబోణి శ
ర్వాణి యొసంగుఁ గాతఁ గసవక్కిలినేత కభీప్సితార్థముల్. 5

చ. నెమిలికి నాట దిద్దువగ నెయ్యపుఁజిల్కకు గౌళమాధురిం
దమి యిడునేర్పు నీకు విదితం బగు నింక వరాళిచాలిగా
క్రమమున రహింపఁ జాలుట గదా! యను దంచు విరించి మెచ్చ హా
సము నునువాతెఱం బొనుపుశారద పోల్పుఁ గృతీంద్రసూక్తులన్ 6
చ అలఘుతమాగమాంతసముదంచిత మాచిగురాకు విఘ్నమం
డలకులశైలఖండన మొనర్చుబలాసురఘాతిహేతి కం
దలదరవిందకాంతిహరణస్ఫురణాభరణంబు నిచ్చలుం
బలితవుగారు మోముదొరపాదయుగంబు శుభంబు లీవుతన్. 7
ఉ. ఇం బడరంగ సద్గతిసమృద్ధినిదానము ధర్మ మేని ధ
ర్మంబు నెఱుంగఁ జేయుమహిమం దగునట్టిది వేద మేని వే
దంబు భరించువారు వసుధాసురు లేని తదీయపాదప
ద్మంబులఁ దక్క నొక్కయెడ మామకమౌళిమదాళి వ్రాలునే. 8
శా. ఆరాధింతు నిరంతరంబు నతులధ్యానప్రసూనంబుచే
ధారావాహికతర్కవాదపటుశబ్దగ్రంథవైజ్ఞానికున్
భారద్వాజసగోత్రు లోకవినుతాపస్తంబసూత్రు న్మహా
ధీరు న్మద్గురు నాగదేవగురునిం దిప్పార్యవర్యాత్మజున్ 9
క శుకభీష్మవిభీషణశౌ,నకశాక్త్యనరాంబరీషనారదుల వసి
ష్ఠ*కయాధుజరుక్మాంగద, బకదాల్భ్యులఁ బుండరీకు వ్యాసుఁ దలంతున్. 10
సీ. కౌరారధార యేఘనునిబాహాదండ మక్షరాక్షసమహావృక్షమునకు
శతకోటి యేమేటిజాగ్రన్నఖాగ్రంబు జంబుమాలిశరీరశైలమునకుఁ
గూటపాకల మేవనాటవీరుబలంబు జృంభమాణనికుంభకుంభిపతికి
నాభీలఫణాధరం బేభవ్యవాలంబు కంపనప్రాణప్రకంపనమున
గీ. కతని శ్రీరామభద్రముద్రాంగుళీయ, దానసంతోషితావనీతనయు ననయు
గోష్పదీకృతవారాశి గుణవిభాసి, జవనభస్వంతు హనుమంతు సన్నుతింతు 11
సీ. మహికర్ణపుటశుక్తిమౌక్తికాకృతిధన్యు, యామునద్వీపాబ్జహేమగర్భుఁ
గాళికాముఖవీటికారసజ్ఞరసజ్ఞు నిజముఖాలోకివాణీవదాన్యు
మాలతీమాధవమేళనాద్భుతశీలు దశకుమారకథాసుధాసముద్రుఁ
బ్రణుతచంద్రాపీడగుణయథార్థితనాము శిశుపాలవధకృతిశ్రీకళత్రు

* హిరణ్యకశిపుభార్య కయాధువు ఆమెకొడుకు ప్రహ్లాదుఁడు

ర్థను దిరు వేంగళార్యకవిరాజసమాశ్రయధన్యచిత్తవ
ర్తను దయఁ బిల్వఁబంపి సముదంచితచాతురిఁ బల్కె నీగతిన్. 30

సీ. చక్రవాళాంకప్రశస్తివిస్ఫురణంబు సాళ్వతిమ్మనృపాలుసమ్ముఖమునఁ
గొలఁకులాయపుఁ దేజిబలురా తనినకీర్తి వీర వేంకటరాయశౌరిసభను
జంఘాలవాతూలచతురలాంఛనరూఢి వెలుగోటి వేంకటవిభునిచెంతఁ
శాకశాసనచిహ్నభాసురప్రభ చెంతవరదేంద్రునాస్థానవసుధయందు
గీ. మంతుకెక్కంగ నేమతిమంతుఁ డమరు, నతఁడు సామాన్యుఁడే సమస్తావనీమ
నీషిగణనీయమధురవాణీవిలాస, హసితభారవి తిరువేంగళార్యసుకవి. 31

ఉ. ఆ త్తిరు వేంగళార్యునియుదారదయాపిలసత్కటాక్షసం
పత్తి నుదీర్ణమైనసుకుమారవచఃప్రతిభావిరూఢి ను
ద్వృత్తరగద్యపద్యచయ మాశుగతి ప్రచురింప నేర్చె నీ
వి త్తఱి మంతు కెక్కితి మహీశులచెంగట వేంకటాచలా! 32

సీ. సందర్భములు లేవె జనసన్నుతానన్యపదసహిష్ణుతకుఁ జొప్పడవు గాక
కావ్యరీతులు లేవె కమనీయజతివాగ్విశేషస్ఫూర్తి దగవు గాక
యుత్తరోక్తులు లేవె యుచితాదిమప్రౌఢకవిసుప్రయోగముల్ గావు గాక
సౌజన్యములు లేవె సకలార్థనికరోపకారసామర్థ్యంబు గనవు గాక
గీ. సమధికాచారభూసురోత్తములు లేరె, జగతి నీరీతి గౌరీశచరణభజన
ధీరనిష్ఠాగరిష్ఠులు గారు గాక, సకలగుణసాంద్ర వేంకటాచలకవీంద్ర! 33

చ. తరణిసమప్రతాపనిధి దామరయక్కనృపాలుసన్నిధిన్
వరకవిగంధసింధురము వచ్చె నటంచు వచించువారిగ
ర్వగఁ గవిరాజకేసరి యటంచుఁ బఠించితి వాశువైఖరిన్
సరసులు మెచ్చ వాఙ్ముఖవిశంకట వేంకటశైలసత్కవీ! 34

ఉ. అంబుజసంభవోపమ సమగ్రమనీష! నిరస్తదోషమై
యిం పడరంగ నీవు రచియింపఁ దొడంగినభవ్యకావ్యర
త్నంబు మదంకితంబుగ నొనర్పు మనల్పయశోవిభానుభా
వం బిల నాచిశాకరదివాకరతారకమై విరాజిలన్ 35

వ. అని సబహుమానంబుగా నుదారఘనసారతాంబూలజాంబూనదాంబరాభర
ణాదు లొసంగినం గైకొని యత్యంతసంతోషతరంగితాంతరంగుండనై కృతి
ముఖంబున కలంకారంబుగాఁ గృతిపతివంశావతార మభివర్ణించెద 36

— • కృతిపతివంశవర్ణనము • —

సీ. సౌగంధికవ్యూహసమ్మోహనాస్త్రంబు నాళీకనికరవైతాళికుండు
కృతకేతరాలాపలతికాలవాలంబు కోకవియోగాబ్ధికుంభసూతి
ప్రథమాద్రిపార్వతీపతిజటాజూటంబు గగనరంగముకుందకౌస్తుభంబు
కాశికాకౌవధూకాశ్మీరతిలకంబు బ్రహ్మాండమండపరత్నదీప
గీ. మఖిలహరిదంతరూఢగాఢాంధకార, గంధసింధురవర్గనిర్గంధనైక
ధీరకంఠీరవేంద్రంబు తేజరిల్లఁ, బ్రాఙ్నగాగ్రక్కి కరుఁడు విభాకరుండు. 37

సీ. నిజతపోనందితాంబుజగర్భుఁ డుద్ధురంగీమానరాజుఁ డిక్ష్వాకునృపతి
శాక్రాకారవాసవసమారోహాస్తశంభులీలుఁడు కకుత్స్థప్రభుండు
సత్యభాషాప్రతిష్ఠాసభాజితగాధిజన్మసంయమి హరిశ్చంద్రవిభుఁడు
గాఢయత్నానీతగంగాతరంగిణీకీర్తిధ్వజుఁడు భగీరథుండు
గీ. విశ్వవిద్యాజి రఘుమేదినీశ్వరుండు, నాదియగురాజు లుదయించి రాదినేంద్రు
సంతతికి భూషణంబులై యంత నందు, శౌరి జనియించె శ్రీరామచంద్రుఁ డనఁగ

సీ. దశరథేశ్వరచిరంతనపుణ్య మెవ్వాని శాంబరీమానుషసంభవంబు
జమదగ్నినందనస్వర్గమార్గనిరోధి తలఁప నెవ్వానికోదండపటిమ
దండకావనతపోధనభాగ్య మెవ్వాని పితృవాక్యపాలనవ్రతచరిత్ర
లంకాపురాంగనాలంకారభరపశ్యతోహరం బెవ్వాని సాహసంబు
గీ. దశముఖావరజాచంద్రతారభూరి, విభవసంధాత యెవ్వాని శుభకటాక్ష
మతఁడు సీతామనోహరుం డనుజసహితుఁ, డమితనుతలీలఁ జిరకాల మవని నేలె

సీ. చూపరియమగుమేల్తాపసి కేదేవ దేవునిపదరజస్స్పర్శ మాము
చిన్నిజాబిలితాల్పుసింగిణేరసదాడి కేస్వామిశుభకరం బిభకరంబు
మున్నీటిపెన్నీటి చెన్నుబన్నమున కేబలశాలిశరకేళి పనటిచూలి
తెలిగంటిఎగతుమన్నెలికంపుటంచగుంపునకు నేవిభుశరాసనము ఘనము
గీ. తాదృశానూనకరుణానిధానమాన, సాభిరాముఁడు భక్తియుక్తాంతరంగ
బుధజనవిలోచనచకోరపూర్ణసోముఁ, డఖిలగుణధాముఁ డగురాముఁ డతిశయిల్లె.

సీ. కొలిచినవారికిఁ గెలనితంగెటిజున్ను నలసినవారికి నిలువనీడ
పేర్కొన్నవారికిఁ బెరటికల్పకశాఖ గణుతించువారికి గాఁడిసురభి
సేవించువారికిఁ జేరువమేరువు భావించువారికిఁ బట్టుఁగొమ్మ
చింతించువారికిఁ జేతిచింతామణి మ్రొక్కినవారికి ముంగిటినిధి

సీ. శబ్దతర్కాదిశాస్త్రప్రసంగములఁ బేర్కొన్నవిద్వాంసు లొక్కవంకఁ
ప్రాకృతమాగధీముఖభాషలఁ గబ్బ మొనరించు కవిరాజు లొక్కవంక
రామభారతకథాప్రస్తావపటిమఁ జెన్నొందు పౌరాణికు లొక్కవంక
గీత ప్రబంధాతిచాతురీవిస్ఫూర్తి గాంచు పురుషోత్తమగాయకు లొక్కవంక

గీ. సుచితమతిమంతు లగుమంత్రు లొక్కవంక
మఱియు సామంతబంధుసమాజవంక
యోధదండాధిపతిముఖ్యు లొక్కవంకఁ
బ్రమదమునఁ గొల్వ నిండోలగమున నుండి 26

ఉ. వందిధురీణుల స్తవవివాదములఁ గన్గొని వేంకటాచలా
ర్యేందుని గుంభితం బగుసుధీడితమద్బిరుదాంకగద్య మా
నందపదాన్యమిత్రతతి వీనులకెక్కఁగ నాప్రభుండు వారు నింపుసొం
పొందఁ బఠించె నట్టి వనజాక్షునకున్ నిర్భరోర్జితన్. 27

బిరుదుగద్యము.—జయజయారంభజృంభమాణగంభీరభేరీనినాదమేదురామోద
కల్యాణశిలితాలయానుసారిభూరిపటానకలోకనారంచితఖచరపురచకోరలోచనాని
చయచారుహాసచంద్రచంద్రికాసికరిముకుళితామందమందారనీకసాకారవింద
సందోహాసదోహాసకారణసముదోద్యమానప్రతాపమార్తాండ! ఐవరిగండ!
సంభోగభోగసాహస్రమండలితకుండలికులాఖండలధరణీమండలభరణపాండిత్యగరి
మసాహాయ్యవిరణప్రవీణబాహాగ్రజాగ్రత్కృపాణకంఠీరవకుమారలుంఠితా
కుంఠపరిపంథవసుంధరారమణగంధశుండాల! గండరబాల! చతుస్సముద్రముద్రి
తాఖండభూమండలసధాగ్రవిభాసమానవిశంకటవాదపటలశంకుప్రకాండమండి
తానూనసానుమాణిక్యరత్నసంభారవిజృంభితశాతకుంభకుంభిసీధరస్తంభశిఖరనా
నట్యమానమానసియకీర్తికీరాంబుజాదభ్రభ్రమద్భ్రామ్యమాణధారాభా
జనయుగవిరాజమానరజనికరహారితుంగ! లోభిరాజకుమారవేశ్యాభుజంగ!
విలాసవతీవితానవిలోచనచకోరికానికరరాకాసుధాకరశిశిరాకారకామసీయక
విశేషనిర్జితనిర్జరసేనాధినాథసవనిధానాధీశనందనపురందరకుమారవిక్రమవసంత
కంతుసౌందర్య! దేవబ్రాహ్మణప్రతిష్ఠాపనాచార్య! దుర్వారవేగలీలాపరా
భూతజాలమన్యవతురంగసంచరోచమానదేవమణిరోచమానతత్త్వాద్యశావర్తిరక్తి
నీయురఘుంపాఘుజాఘుళిపిఖురళిభ-జళిగతిచతురసింధుగాంధారకాంభోజసంభవ
సముంచిత పంచభద్రప్రముఖసైంధవధురంధరసమారోహనైపుణసపత్నీకృతన

కులరేవంత ! గజపతిసప్తాంగహరణబిరుదభాస్వంత ! శచీకాంతదిశాకృశోదరీముఖదరీదృశ్యమానకాశ్మీరతిలకాయమానవాసరాధీశతరుణకిరణప్రసారవికస దరవిందమకరందబిందు మధురిమధురీణ నిరవద్యహృద్య గద్యపద్య భాసురమహాభారతభాగవతరామాయణాదిపుణ్యకథానిరంతరావధారణాలగద్భగవదమలగుణశంకాసమంకురనిదానవిశదాష్టమాత్రీకవిశిష్టకర్ణశష్కులీయుగళపర్యంతవిశ్రాన్తవిశాలనయనతామరసమందిరనందదిందిరాచరణలాక్షారసప్రేక్షావహాతరంగితాపాంగశోణరేఖామయూఖసంచారిధారేయకృపాకటాక్షరక్షితసంస్కృతాంధ్రకవిరాయకురుకుకురుకౌశకరూశకోసలకళింగబంగాళచోళగౌళమాళవమగధమద్రమళయాళదహాళపాండ్యపాంచాలపల్లవనేపాలముఖ్యభూపాలశేఖరాస్థానప్రసిద్ధపారకపటలపాపర్యమానమానితాత్మీయబిరుదావళప్రహేళికారగడభోగావళీదండకశతకతారావళీచతుర్భద్రికోదాహరణచక్రవాళాదిచాటుప్రబంధబంధురలతాంతకంతుకసతాంతకవితాశాంతిసౌరభ ! కావేరీవల్లభ ! యుబ్బరాత్యబబ్బరిబాహా ! ధరణీవరాహా ! పంచఘంటానాదమేదినీమీసరగండ ! మోహనమురారి ! సాహిత్తిమల్ల ! చాణూరమల్ల ! చాళుక్యనారాయణాంక ! నిశ్శంకదుర్గాధినాథ ! కళ్యాణపురవరాధీశ్వర కటారిసాళ్వ మాకరాజవీరరాఘవరాజతనూజతిర్వేంగళనాథరాజకులపాలికాతిలక దేవళాంబాగర్భశుక్తిముక్తాఫల బొమ్మభూపాల సాధ్వీలలామ రాగమాంబాచిరంతన సుకృతపరిపాక శ్రీస్వరూప చిన్నకృష్ణాజీమామనోహర ! బాసదప్పవరగండాంక భాస్వరవీరానేకపనీకాశ ప్రచండగండక్షురిద్ధారాధారాసముద్దండవేదండప్రకాండోపరిసమారోపితబిరుదకేతనశిఖానిర్ఘాతజీమూతసముదయాదభ్రగర్భనిర్గళదనర్గళవిమలకరికానికాయమాయావిలసదాత్మీయవిజయప్రయాణవీక్షణక్షణోత్సుకబుభుక్షుపురచకోరేక్షణాగణవికీర్యమాణారారాజదాచారలాజాసంభార ! కటకపురిచూరకార ! శ్రీవేంకటాద్రిపతివందన ! కావేరిరాజవరనందన ! సల్లలితరసవిరాజగీర్ధన్య ! వెల్లంటికసవరాజమూర్ధన్య ! విజయీభవ ! దిగ్విజయీభవ ! 28

వ. అని యనితరసాధారణానవద్యపదహృద్యనిజబిరుదగద్యపఠనపరిశీలితపారిషద్యశ్రవణానందు లగువందిజనులకు నభీష్టవస్తువు లొసంగి యుంత. 29

చ. నను హరిణాంకమౌళికరుణాసముపాత్తరసప్రసాదవ
ద్ఘనతరసంస్కృతాంధ్రకవితాధను నాదిమ వేదివంశవ

గీ. రాజమాత్రుండె హైమధరాధరాధి, రాజకన్యాంతరంగసారంగవికస
దమలకమలాభిరామనామాక్షరుండు, రామచంద్రుండు త్రైలోక్యరక్షకుండు.

క. శరణాగతులకు నెల్లను, వరదుం డగురామభద్రువంశమునందుం
గరికాళచోళభూపతి, కరుణానిధి సంభవించెఁ గలియుగవేళన్. 42

మ. హరిదశ్వప్రతిమప్రతాపవిమతాహంకారహుంకారి యై
కరికాళక్షితిపాలవంశమున విఖ్యాతప్రభావుండు సిం
గరిరాజేంద్రుఁడు సంభవించె దశదిక్కాంతాధరాభృత్ప్రయో
ధరముక్తామణిహారధోరణిసముద్యత్కీర్తి నిస్తంద్రుఁ డై 43

మ. చరణాంభోరుహబంధురాయితరిపుక్ష్మాపాలుఁ డై ధారణీ
శ్వరచూడామణి సింగరిప్రభునకున్ జన్మించె శ్రీరంగరా
జరవిందాప్తకుమారసారమణితారాధీశకల్పద్రుమ
చరకాశాంబుజకామధేనుశిబిరాజభ్రాజదాదాన్యుఁ డై. 44

క. శ్రీరంగనాముఖాబ్జుఁడు, శ్రీరంగనృపాలసుతుఁడు సింగరిరా జా
జీరంగరంగదరినృప, సారంగమృగేంద్రుఁ డనఁగ జగతి న్వెలసెన్. 45

క. తనయులు సింగరిభూభృ, త్తనయులు కావేరిరాజదాసరిరాజుల్
వినయులు వొగడొందిరి భువి, ననయులు సతతంబుఁ దలఁక నడరిరి క్షితిపుల్.

శా. శ్రీవెల్లంటికులాబ్ధికౌస్తుభమణిక్షేమంకరాకారుఁ డౌ
కావేరీంద్రున కుద్భవిల్లిరి సుతుల్ కాత్యాయనీవల్లభ
గ్రీవాక్ష్వేళకళంకపంకహరసత్కీర్తుల్ భుజోదారతే
జోవిస్ఫారులు సింగరీశకసవక్షోణీపతుల్ విశ్రుతుల్. 47

క. అలలితయశోవైభవ, శాలులలో నగ్రజుండు చంద్రముఖిపాం
చాలుఁడు సింగరిధరణీ, పాలుఁడు పొగడొందె రిపువిఫాలుం డనఁగన్. 48

శా. ఆరూఢస్మయవారణాధిపతిసప్తాంగాపహారక్రియా
ధీరాగ్రేసరుఁ డైనసింగరిధరిత్రీనేత కుజ్జృంభిత
క్షీరాంభోధికి యామినీకరునిమాడ్కిం గల్గెఁ బుత్త్రుండు కా
వేరిక్ష్మారమణీకళత్రుఁడు జగద్విఖ్యాతచారిత్రుఁ డై. 49

సీ. కలలోన నైన నవ్వుల కైన ననృతంబు వచియింప వెఱచు నెవ్వానిజిహ్వ
యొంతసందడి నైన నిల నన్యకాంతల వీక్షింప నళుకు నేవిభునిచూపు

శర ణాన్న నపరాధశత మరాతికి నైన మన్నించు నేమహామహానిమనసు
కోటి యిచ్చెద నన్నఁ గొండీనిమాట యాకర్ణింప దేధన్యకర్ణయుగళి
గీ. యతఁడు పొగడొందు నీతిమార్గానుసారి, విబుధభరణాధికారి నేవిరముదారి
కటకపురిచూరకారవిఖ్యాతబిరుద, రమ్యగుణహారి కావేరిరాజశౌరి 50
క. అంతిపలివంశజలధిమ్ము, గాంతకళం గోనమాంబ నంబుదపాణిన్
నంకీర్తితవిక్రమగరు, డాంకుఁడు కావేరినృపతి యర్థి వరించెన్. 51
శా. కాకుత్స్థోపమసత్యవాక్యనిధి యాకావేరిరా జంచిత
శ్రీకోనాంబికయందు నందనులఁ గాంచెన్ బాహుశౌర్యప్రభా
పాకారాతికుమారునిం గనవభూపాలాగ్రణిన్ సింగరీ
లాకాంతుం దిరువేంగళేంద్రుఁ బెరుమాళ్రాజన్యమూర్ధన్యునిన్ 52
క. అం దగ్రజుండు కవిబుధ, మందారుఁడు కనవరాజు మంతునకెక్కెం
గందళితామందసితా, బృందహితాలాపమాధురీధుర్యుం డై 53
సీ. చండాభియాతివేదండతండమదంబు ఖండించుమృగరాజు కనవరాజు
కమనీయసౌందర్యగాంభీర్యచాతుర్యకలియుగనలరాజు కనవరాజు
నిఖలరాజన్యవర్ణితమైన యభిమానగరిమచే రారాజు కనవరాజు
కర్ణాటకవిరాజగణనీయవితరణఖ్యాతిచే శిబిరాజు కనవరాజు
గీ. ధైర్యమున కద్రిరాజు విద్యలకుభోజ,రాజు వెల్లంటికావేరిరాజగర్భ
కలశజలరాశి నుదయించి కందులేని, కళల నింపొందురేరాజు కనవరాజు 54
ఉ. నీతివనీకుఠారులు వినీతివిదూరులు శాల్మలీక్ష్మా
జాతనిభు ల్విశాలగుడశైలసమాఖ్యు లజాగళ స్తన
ఖ్యాతివహు ల్పహీపహతకాగ్రణు లెందఱు లేరు! తద్గుణ
వ్రాతము లెంతురా! కనవరాజధరాధిపు నమ్ముఖమ్మునన్ 55
ఉ. వైరివిఘాలుఁ డై నకనవక్షితిపాలుఁడు వార్ధిమేఖలా
భారధురంధరత్వమునఁ బ్రౌఢవరోచన నుసురూపతా
స్ఫారత నెన్న సాటి యగు బంగరుగట్టుకమానుపాదుపా
నాటికిఁ బద్మసంభవునినాటికి ఫాలవిలోచనాటికిన్. 56
క. శ్రీమంతుఁడు చరణానత, సామంతుఁడు కనవరాజు సాటి యగుం దే
జోమహిమను భోగంబున, గాములదొరకు నిర్మానగాములదొరకున్. 57

క. ఆరాజుకూర్మితమ్ముఁడు, రేరాజు కళావిలాసరేఖం గలిమిన్
రారాజు సింగరేంద్రుఁడు, గీరాజువచోనిరూఢిఁ గీర్తింపంగన్. 58

ఉ. ఖ్యాతమృగవ్యకౌతుకవిహారుఁడు సింగరిరాజు సంభ్రమా
న్వీతబలోద్ధతి న్వనుల నీలవరాహముల న్వధింపఁగా
భీతమనస్కుఁడై కలిమిబిత్తరినెయ్యుఁ డహాహా! మహోన్నత
శ్వేతవరాహరూపమును జేకొనియెం గడు నద్భుతంబుగన్ 59

క. ఘనుఁ డాసింగరిభూపతి, కనుజుఁడు తిరువేంగళేంద్రుఁ డసమానయశో
ధనుఁడు ధనంజయసదృశుఁడు, తనరారు నరాతిరాజదర్పాపహుఁడై. 60

మ. సభలన్ వాసవదారకైశికచకాశన్మాల్యమందారసౌ
రభసంభారవిజృంభమాణకవితారంభాతిగంభీరతా
విభవప్రౌఢిమ నెంతు రెంతయుఁ గవుల్ వెల్లంటికాహరిభూ
విభుతి ర్వేంగళనాథరాజనృపతిన్ విశ్రాణనశ్రీనిధిన్. 61

చ. భటకవిగాయకార్థిజనబాంధవకైరవపర్వశర్వరీ
విటుఁ డననుల్లసిల్లు తిరువేంగళనాథునిసోదరుండు వేం
కటపెరుమాళ్లరాజు నలకంతువసంతజయంతజిద్వశం
కటతనుకాంతినందితజగజ్జనలోచనుఁడై విరాజిలున్ 62

చ. సురవరదంతిదంతములచొప్పున ధాతముఖంబులుం బలెన్
సరసిరుహాక్షుబాహువులచాడ్పున వార్ధులమాడ్కి లోకపా
లురకరణిన్ రణాంగణవిలూనరిపు ల్లసవక్షమాపురం
దరముఖు లైనభూవరులు నల్వురు మంతున కెక్కి రెంతయున్. 63

క. ఆనలుగురురాజులలో, భానునిభుఁడు కసవరాజు భాసిలె నెంతే
నానారిపుసేనాతటి, నీనాయకమంథమేదినీధరభుజుఁడై 64

క. ధృతిఁ గసవశౌరి విభవో, న్నతసాళువబొమ్మరాజనందినిఁ గమలా
సతి కైన యనఁదగుసద్గుణ, వతిఁ జనకృష్ణాజిమ న్వివాహం బయ్యెన్. 65

సీ. తనదుపుట్టినయిల్లు తగఁ బాలువొంగినచందాన వెలయించునిందువదన
తనదుమెట్టినయిల్లు తామరతంపమై పొగడొందఁ జేయునంభోజపాణి
మహనీయతరసర్వమంగళాభిఖ్యమై ధాత్రి సొం పెసఁగుసద్గోత్రజాత
సంగీతసాహిత్యసకలవిద్యాప్రౌఢిమహిమంబు దెలిసినమంజువాణి

గీ. కరము రాణించు సౌజన్యగరిమధన్య, పరమకల్యాణి కసవభూపాలురాణి
ఆశ్రితత్రాణవిలసత్కృపావలంబ, సద్గుణకదంబ చిన్నకృష్ణాజిమాంబ 66

క. ఆచినకృష్ణాజిమ ల, క్ష్మీచంద్రాననవిధాన సేవింపఁ గృపా
రోచిష్ణుఁడు కసవప్రభుఁ, డాచక్రాయుధునికరణి నమరుఁ ధరణిన్ 67

— * షష్ఠ్యంతములు * —

క. ఈదృక్కల్యాణగుణా, మోదితలోకునకు భువనమోహనకుశల
స్వాదూక్తివిపాకునకు మ, హీదేవాగ్రాంతభజనహేవాకునకున్. 68

క. గండరబాలాంకున కు, ద్దండభుజాబలనవీనతాలాంకునకున్
ఖండితరిపుజాలునకుం, బండితకవిరాజరాజిపరిపాలునకున్. 69

క. రాజగ్రామణికిం బద, రాజీవప్రణతఃముఖరాజన్యగజో
ద్వేజనసృణికిం గోనాం, బాజరరసవీనశుక్తిమౌక్తికమణికిన్ 70

క. ఆరామసత్రసౌరా, గారసరఃప్రముఖధర్మకర్మవిసర్మా
గారూఢకీర్తినిధికిన్, ధీరస్తుతిమధురసాహితీసేవధికిన్. 71

క. శ్రీలప్రాభవనిధికిం, దోళప్పాచార్యచరణతోయజసేవా
శీలప్రాదుర్భూతవి, శాలప్రారంభధైర్యసారాంబుధికిన్ 72

క. కాశ్యపగోత్రోద్భవున క, వశ్యయమయూఖలేఖవసుధాజసుధా
పశ్యాళికమాళిధునీ. దేశ్యయశోహారవైశదీవిభవునకున్ 73

క. మంథానాచలధృతికిన్, సంధాభృగుపతికి శౌరిచరణాంబుజపు
ష్పంధయశుభచిత్తునకున్, బాంధవరక్షామిళత్కృపాయత్తునకున్. 74

క. ఆకాశీతలసేతు, ప్రాకటశరణాగతాభిరక్షణబిరుద
శ్రీకానేరిన్నృపాంబుధి, రాకాచంద్రునకుఁ గసవరాజేంద్రునకున్. 75

వ. అభ్యుదయపరంపరాభివృద్ధిగా నాయొనర్పంబూనిన చంపూరామాయణం బను
మహాప్రబంధంబునకుఁ గథాక్రమం బెట్టి దనిన. 76

— * కథాప్రారంభము * —

క. అమరమునిపల్కు విని సం, భ్రమమున వాల్మీకిసుకవి మాధ్యందినకృ
త్యమొనర్ప నరిగె సురుచిర, తమసారసకుముదవనికిఁ దమసాధునికిన్ 77

చ. అరిగి తదీయపావనతటావని నొక్కెడఁ దుంటవింటబల్
దొరవిరితూపువాఁడిమికిఁ దోఁచు కిరాతశరాహతివ్యథం
బొరలి తపించుక్రౌంచయుగముం గని లోఁ గృపపుట్టి మౌని శో
కరునిముఖాంబుజంబున నొకానొకభారతి దోఁచె నీగతిన్. 78

శ్లో. మా నిషాద ప్రతిష్ఠాం త్వ మగమ శ్శాశ్వతీ స్సమాః
యత్క్రౌంచమిథునా దేక మవధీః కామమోహితం 79

చ. అని శపియించి మౌనివిభుఁ డక్కట! యెుకొండుఁ బోక తీర్థసే
వన కిపు డేటికి న్నదికి వచ్చితి వచ్చిన నేమి క్రౌంచల
న్వనచరుఁ డేయ నేమిటికి వాఁ డిటు లేసిన నేయుఁగాక నేఁ
గన లెదఁ బూని వానిఁ గొఱగానిగతిం బడఁదిట్టనేటికిన్. 80

మ. అని చింతించుచు వాయలూరుతనయుం డాత్మీయపుణ్యాశ్రమం
బునకుం బొచ్చినయంతలోనఁ బలుకుంబూఁబోఁడి దేహాక్కడి
కున్నఁ డెక్కున్ల ల్పచరించు వైఖరులు గిన్లో లేనిచందంబునం
జనుదెంచెం జతురాస్యుఁ డంచతేజికున్నాప్రమాణీదిరాఁకించుచున్ 81

క. చనుదెంచి విరించి తపో, ధనువలసినపర్యఁ గాంచి త్రైలోక్యవ్యా
పనిజేంద్రజాలభుజగా, ధిబర్హ్మీభూతికృతి యాటెం డెట్లనియెన్ 82

మ. నుతపుంజల్పులకోల్పి సత్యజగతి న్నాలోన్న చందంబునం
బుడమి న్నల్లడ నాత్మవృత్తగతులన్ భూషింప నూహించి ని
ల్పడగావించె భవద్రసజ్ఞ యి నింకం దీనిచేఁ బ్రొద్దువం
గడపున్నాదొర వేలుపున్నడవడిం గబ్బంబు గావింపుమా. 83

చ. అని యవనిప్రభవోద్భవుని కానతియిచ్చి యలంఘ్యవర్ణలే
ఖనకరుఁ డేగునంతఁ జెలికత్తియ లై రఘురాముకీర్తివ
ర్తన లనవద్యపద్యతనుధారిణి దన్ముదుశయ్యకొయ్యనో
య్యనఁ గదియించినం బలుకుటంగన ముంగల నై చెలంగఁగన్ 84

సీ. అలరుఁబొట్టము విచ్చినట్లు కస్తురివీణె గోసినరీతిఁ గుంకుమము రాశి
పోసినరేవఁ గప్పురము సిరంబు గుప్పినలీల మేళవించిననిపంచిఁ
బలికించిన తెఱంగున లతాంగిబిగిచన్నవఁ గవుంగిలించినపగిదిఁ జంద
నాచలగంధవాహం బెదురొన్న చందంబున నమృతపానంబుమాడ్కి

గీ. బుధకవుల కింపు జనియింప మధుమనోజ్ఞ, రత్నఖనిదర్శి బ్రహ్మర్షి రచనసలిపె
శ్రవణలేఖనపరనకృజ్జఘనాఘ, హరణపారాయణంబు రామాయణంబు. 85

క. భవ్యపదశ్రావ్యముఁ ద,త్కావ్యముఁ గుశలవుల కతఁడు గఱపిన భువన
స్తవ్యులు వా రవి వనవా, స్తవ్యులకడఁ బాడి మెచ్చు సలిపిరి మదికిన్. 86

చ. మునివటువేషధారు లతిమోహనశీలురు వా రయోధ్యకుం
జని యొకనాఁడు నాగరకసన్నిధి రామచరిత్ర మింపుసొం
పున నెనయించుగానలఁ దముం గనుఁగోఁ గొలువుండి పిల్వఁ బం
పిన రఘువీరుఁ జేరి వినిపింపఁ దొడంగిరి గీతిఁ దత్కృతిన్. 87

సీ. మాటలజవరాలిమగనికి నామభేదంబు లేకటకంబుధరణీసురులు
బలుజాళువాకట్టుపిలుకాసికిఁ బటాంతరంబు లేనగరంబురాజమణులు
నిధు లింటనుండుమన్నీనికి నపరావతారంబు లేపేటియూరుజనులు
హాలముఖాత్తశీల హర్మ్యాగ్రజునకుఁ బర్యాయంబు లేవురియంఘ్రిభవులు

గీ. వెలయు నది సారవాజగంధిలసమీర, వికసితారామవాటికావిహరమాణ
కీరకలకంఠకలకలోద్గీతబిరుద, రతివధూజాని సాకేతరాజధాని. 88

ఉ. ఆపుర మేలు మానవకులార్ణవపూర్ణశశాంకుఁ డుగ్రబా
ణాపహృతాశరోత్కరగిళాంతరలోహితజాలతైలసం
దీపితదోఃప్రతాపమయదీపశిఖాపతితాహితశత్రుగో
త్రాపతిజాతకైతవపతంగుఁడు పఙ్క్తిరథాంగుఁ డున్నతిన్. 89

సీ. తనశౌర్యశిఖి కుల్కి వినువీధి కెగఁబ్రాఁకుభానునందు పతంగతానుభూతి
తనసైన్యధాటిచే వనులకేగువిరోధిసతులపల్కులయందు శౌకరీతి
తన కేలుబడి దైనధరలో నిరవుకొన్నవారలాయువునందు వర్షిభూమ
తనరాజధానిలోఁ దనరుభూమినిలింపవరులయందు నవార్తవైభవంబు

గీ. తనధృతిఁ జలించుకులధరాధరములందు, గైరికభరంబుతనసోయగంబుఁ జూచు
మదవతులయందు కంటకాభ్యుదయ మొదవ, ధారణి నిరీతిగా నేలె దశరథుండు.

శా. సప్తద్వీపయుతావనిన్ బహుసమాసాహస్ర మిట్లేలియున్
నప్తల్ పౌత్రులు పుత్రులుం గలుగఁ బుణ్యం బేమియున్ లేమికిం
బ్రాప్తస్వాంతదురంతచింతఁ బరితాపం బొందువాఁ డొక్కనాఁ
డాప్తామాత్యులతోడ మంతనమునం దాభూవరుం డిట్లనున్. 91

సీ. కలిమిలోయ్యలి మెలంగనిమురారియురంబు చిన్నివెన్నెల లేనిశివునిశిరము
కలకంఠనికరంబు నెలకొని లేమావి యంచలపడువు డాయనికొలంకు
పారిజాతము వసింపనినిలింపవనంబు వినుమిన్న గానుపింపనిదినంబు
ప్రామిన్కుఁ దెగఁ భజింపని విప్రునెమ్మోము తలఁకుము త్తియము వర్తిలనిశుక్తి

గీ. సంతతికి దవ్వగుజనుండు సరియుగాన, నెంతధనమున్నఁగులకాంత లెందఱున్నఁ
గాంతి పచరింప నోఁచరుగా మదీయ, సదన మనపత్య మగుట నోసచివులార.

మ. భువనాలంకరణంబు సంస్మృతిసుధాపాథోనిధానక్షపా
ధవబింబోదయ మాశయాంచితచింతాభారఘోరాంధకా
రవిభాతాగమనంబు ప్రాక్తనజనిప్రాప్తైకపుణ్యాతిరే
కవిపాకంబు తనూభవుండె కద లోకశ్రేణి కూహింపఁగన్ 93

చ. అలికము రావిరేక మృదులాంఘ్రులగజ్జెలుఁ గంధరంబునం
దలిపులిగోరు సందెజిగితాయెతు వీనులచిన్నిమద్దికా
యలు నిడువాలుఁగన్గొనలయంజనరేఖలు ముద్దుగుల్క ముం
గలఁ జరియించుబాలకునిఁ గన్గొనుభాగ్యము లెన్నఁ డబ్బునో! 94

గీ. కనకమయకింకిణులు లోకెంత గల్లురనఁగ, దాదికరపల్లవము లూఁగి తప్పటడుగు
లల్లనల్లన మణిమందిరాంగణంబు, లం దిడుకుమారుఁ డెపుడొకో కన్విందుసేయు

చ. అనిమిషలోకనాయకుని కైనఁ జరాచరసృష్టికర్త కై
నను భువనత్రయాభరణనైపుణి గోపినమేటి కైన నె
త్తిని బెనువాఁడికన్ను గలదేవున కైనను శక్య మౌనె నం
దనుఁ డనుకల్మి నెంతటిధనంబులు గల్గియు సంతరింపఁగన్ 96

సీ. చిన్నినెన్నుదుటిపైఁ జిందులుద్రొక్కెడు నీలములైనయలకజాలములతోడ
ననిమిత్తహాసితమోహనచంద్రచంద్రికల్ నిగిడించుముద్దునెమ్మోముతోడ
నక్షరోచ్చారణం బవ్యక్తమై యుండఁ బలుకండ మొలికెడుపలుకులతోడఁ
గుందనంపుమెఱుంగుటందెగ్రమ్మోఁత చెలంగు బుడిబుడిమురిపంపునడుపుతోడఁ

గీ. దనదుమ్రోలమెలంగెడుతనయునెత్తి, కొని తొడలమీఁద నిడుకొనికురులుదువ్వి
శిరసు మూర్కొనుసుకృతి చేసినతపంబు సలుపలే నైతినేమొ ధీసచివులార!

గీ. అనుచు ననపత్యతాదురత్యయనిదాఘ, తాపమునఁగుందుచునదుడెందమ్ము నెమ్మి
కఠినవాంభోదగర్జయో యనఁగఁ జెవుల, పండువొనరించుగంభీరఫణితి మీఱ.

సీ నదినీటిలోఁ బిభాండకుతేజ మాని జింకమిటారి గన్న శేఖరితశృంగుఁ
డున్నచో వర్షింప నుర్వీధరాళిచే వరము గైకొన్నపావనచరిత్రుఁ
డిగురాకుఁబోఁడుల నేనుఁగుఁదలతొమ్ము మునులంచు నెంచినముగ్ధహృదయుఁ
డంగవగ్రహానిగ్రహం బోలిగా శాంతయనుకాంతఁ బెండ్లియాడినఘనుండు

గీ. ఋషి యొకఁడొనర్చు పుత్రకామేష్టివలన, నందనులు నీకుఁ గలుగనున్నారటంచు
ము న్నలసనత్కుమారుచే విన్నకథను, మంత్రుఁ డెఱిఁగింప ముదమంది మహిపుఁ డంత.

వ. శాంతాకుటుంబియుం దనకు సంబంధియు నగు నంబుజోదరపదాంభోజరోలంబాంతరంగు ఋష్యశృంగు రావించి యవ్విరించిచంచదాగమప్రపంచపారగుం డుపద్రష్టగా వసిష్ఠవామదేవాధిష్ఠితం బగు వాజిమేధంబు సరయూధునీరోధంబున నిర్నిరోధంబుగా నిర్వర్తించి పుత్రీయ యగు నిష్టిక్రియ కుపక్రమించు తఱి నశేషభువనశోషణప్రవీణరావణప్రతాపరేఖానిదాఘవారణంబున కాదికారణంబును నభంగశార్ఙ్గచక్రచాపాభిరామంబును నకూపారవరకుమారికాచిరవిఫాలితాలలామంబును నఖిలతాపసవ్రాతచేతశ్చాతకోపరివికీర్యమాణనిరవధికృపారసజలౌఘంబును నసుకృష్ణమేఘంబు నూతనాతసీగుచ్ఛసచ్ఛాయ నిజతనుఃప్రభాపూరంబునఁ గలశపాగావారంబు నభినవకువలయాకారంబు గావించు తావునకుం బోవ నూహించి మణివిపంచిపాణి వాణి వదనంబునం(1) బొసఁగుసరసునిం బురస్కరించుకొని నడఁటి యొందొరులం గడచి ముందఱ.

శా. నారీనూతనపంచబాణ! కవితానైపుణ్యపారీణ! కా
వేరీత్స్నావరగర్భసింధురమణావిఖ్యాతరాకానిశా
తారాకాంత! దిగంతవైరిముఖపద్మస్తోమహేమంత! చిం
తారత్నప్రతిమానదానగరిమత్రాతాఖిలార్థివ్రజా! 101

క. భారతభాగవతకథా, నారాయణదేవదివ్యనామశ్రవణా
నారతసుకృతైకపరి, ష్కారభ్రాజిష్ణుకర్ణ! కలియుగకర్ణా! 102

స్రగ్విణి. వీరచూడామణీ! విశ్రుతౌజోవ్భృతా, శారణీ! భూరిభోగామరగ్రామణీ!
సూరవంశాగ్రణీ! సుస్థిరోదారదో, స్సారసామీరణీ! శబ్దవిద్యాఫణీ! 103

గద్యము. ఇది శ్రీమదుమామహేశ్వరవరప్రసాదసమాసాదిత సరసకవితావిలాస వాసిష్ఠవంశకీర్తిప్రతిష్ఠాసంపాదక ఋగ్వేదికవితిర్వేంగళార్యకలశరత్నాకరసుధాకర జగద్విఖ్యాతకవిరాజకంఠీరవబిరుదాంక వేంకటాచలపతిప్రణీతం బైన చంపూరామాయణం బను మహాప్రబంధంబునందుఁ బ్రథమాశ్వాసము

---

(1) వేణి పదాంకంబునం-మాతృక.

శ్రీరస్తు

# చంపూరామాయణము.

## ద్వితీయాశ్వాసము.

క. శ్రీజనకధీర బొమ్మ, త్సోజనపతిగర్భశుక్తిమౌక్తిక చినకృ
ష్ణాబిమదేవీమానస, రాజీవమరాళ! కనకగాజన్నృపాలా! 1

మ. అమరు ల్గాంచి రవేలకేళి జలమత్త్యస్త్రీసమాలింగన
ప్రమదాపాది పయోవినోది ఘనగర్జానీతవేలావన
ద్రుమమయూరీనటనావలోకపరయాదోరాజదారేక్షణ
భ్రమకృద్వల్గనమీనధోరణి సుధాపాథోనిధిగ్రామణిన్. 2

సీ. పాథోదసమితికిఁ బానీయశాలిక ఫణిరాజశాయికిఁ బడుకటిల్లు
మనుముద్దరాలికి మగఁడాలమొలనూలు కలవానిచెలికాని కలఁడుదోఁట
మింటికాపరులకు మృష్టాన్నసత్త్రంబు సకలదివ్యవదాన్యజన్మభూమి
మఘవగజాంతసంపద కాదికారణం బఖిలాచలేశున కనుఁగుటల్లుఁ
గీ. డార్యతోఁ బుట్టుగట్టురాయలపతత్ర, యుగళికిఁ దనుత్ర మెవ్వఁ డయ్యుదధిఁ గాంచి
నీలవర్ణుండు నిద్దుర మేలుకాంచి, యున్న వేళ విచారించి యుత్సహించి. 3

మ కలశాబ్ధిం దెలిదీవి నైందవశిలాగారంబులో ముత్యపుం
దళుకుందిన్నియమీఁదఁ గల్పసుమనస్తల్పోపరిం జిల్వరా
యలమై సిద్ధపుగద్దెపీఁటపయి నధ్యాసీనుఁడై యెల్లజీ
వుల కన్గ్రోవల నబ్జపత్త్రముల బారుల్ దీర్చు భద్రాకృతిన్. 4

సీ. రోహణాచలశృంగమోహనాకృతిఁ జూకాటం బగుమణికిరీటంబువానిఁ
దొగలకు నెత్తమ్మితెగలకు దాంపత్య మాయితం బొనుకన్నుదోయివాని
మొసలిపోగులనిగ్గుటాసపరిసాముకూటములైనచెక్కుటద్దములవానిఁ
గలుములొయ్యారియుయ్యెలపచ్చగోలుసుతీరగునురస్స్థలివైజయంతివాని
గీ. నంబుదతటిన్నిభశుభాంబరంబువానిఁ, గమలజాండంబునకు నాల్గుకాళ్లమంచ
పంబినభుజావిజృంభణంబైనవాని, హరిఁ గని నుతించి రిట్లని యమరు లపుడు

— • దేవతలు విష్ణుని స్తుతించుట. • —

కవిరాజవిరాజితము. జయ మదవారణఖేదనివారణసంభ్రమకారణ చక్రధరా!
జయ ఖగచారణగీత! మహారణసాహసధారణబాహుభరా!
జయ భవతారణ! గంధసమీరణసాదివిదారణ దివ్యశరా!
జయ రవికైరణ శక్త్యవధీరణ సత్త్వరచారణ కాంతిఝరా!

లయగ్రాహి.

శ్రీకర విభాకరసుధాకరవిలోకన స్వలోకపతినాకసదనీకసుతలాక
శ్లోకవిభవాకర నృపాకలనచాకసదశోకసుమకోకనదభాకలవిలోకా!
ఆకమలినీకమనమాకుముదినీకమిత్ర మేకుశలమాకలయధాకితవివేకా
పాకరిపుతోకసఖమాకురవిపాకముఖకేకిశిఖికాకలితమాకుటలటీకా! 7

ఫాలభుజఖేలన కరాళశిఖిలాలన విలోలనరపాలక విఫాలకరవాల
వ్యాళముఖకేళిసఖకేళివహశూలి పరిపాలితమమీలలిత బాలిజభజావే
హాలహలనీలగళఫాలతలలోలదతివేలశిఖికీలతతిఖేలదరిఖేలా
కీలితవిభీలవారిధీలుళితదళీలకుజపాలయజపాలయజనాలయ కృపాళూ. 8

చ అనిమిషవృత్తి నంబునిధి నాశరజైత్రతఁ దెచ్చినట్టిప్రా
మినుకులు నల్వకిచ్చుటకు మెచ్చిరిగా యతిలోకవర్తనుం
డని జను లెల్ల నిన్ను, జనకార్జిత మైనసువర్ణసంపదల్
తనయులఁ జేరు టేమి యరుదా! మురదానవభేదకోవిదా! 9

చ. కలిమిపడంతిగుబ్బకవగబ్బితనంబు భుజాంతరంబునన్
జలనిధిమేఖలారమణిచన్గవగట్టితనంబు మూఁపున
న్నలకొనియుండుమోపరివి నీ వగుటన్ భవదీయకేవలా
చలవహనక్రియాచణత సన్నుతిసేయఁగనేటి కచ్యుతా! 10

మ మకరాంకార్ణవమగ్నభావకలనం బాటిల్లుకంపంబు కం
టకలీలాకబళీకృతం బయినమేనం బూనుభూదేవిఁ బా
యక శృంగారము దార్చినట్టి భవదీయస్తబ్ధరోమాకృతి
ప్రకటాకారము ప్రోచు మమ్ము నవినారంభప్రియంభావుకా! 11

చ. కులిశధరాదినిర్జరులకున్ వసపోనిహిరణ్యదైత్యు పం
పులు రనదాడి గాంచుఫలము ల్విదళింప నయస్ఫురన్నఖా

వలి మెఱయించుచు న్వాడలవా బలుగంబమునందు నంటిపం
డ్రొలుచుట కుక్కుగో ళ్లనుజనో క్కి నిజంబుగ దంభ కేసరీ. 12

ఉ. దానవనాథచంద్రుఁడు పదత్రయమాత్రపయోధిమేఖలా
దానజలంబు నీకరముఁ దార్చియుఁ దార్పకమున్న పద్మజాం
డానఘబాహ్యవారి చరణాగ్రనఖాహతి జాఱి పాఱి యే
త్రై నెగడంగఁ జిత్రకృతి నాకృతిఁ బెంచి తలిరవామనా! 13

మ. దనుజాధీశ్వరుఁ బట్టి కట్టినభవత్త్రైవిక్రమాకార మొ
క్కనదిం గాంచుట వింత నాఁగ రిపురక్తవ్రాతసంజాతపం
చనదాకల్పక మైనతావకభృగుస్వామిాభవద్రూప మొ
క్కనికి న్నన్నుతి సేయ శక్యమె జగత్కల్యాణసంధాయకా! 14

గీ. మనుకులీనత రామనామమున మదన, జన్మహిమ దుష్టనరపాలశిక్షణమున
భావిచతురవతారవైభవము దెలుపు, పరశుధారేయపాణికి శరణు నీకు 15

మ భృతశుద్ధాంతభుజాంతరాయ నిజనాభీపల్వలాంభోరుహా
దితలోకత్రయకారిణాయ బలిదైతేయప్రతాపాతపా
వృతివర్షాగమవాసరాయ నలినశ్రీజైత్రనేత్రాయ ధ
న్యతమస్వాంతసరోజినీదినకృతే నారాయణా యోన్నమః. 16

క. అనుబుధనుతి సుఖతశ్రుతి, యును సుప్పయు నఖరయుక్తయుఁ బరోజ్జ్వలయుఁ
జనపాపహారిణియు నై, తనయవతారములగతి ముదం బొదవింపన్. 17

మ. వనజాక్షుం డనియె న్నిజస్తవనరావంబుల్ దిశాపాటిఁ బ
ర్వ నతు ల్పెక్కు లొనర్చి లేచి యెదుటన్ వర్తిల్లుగీర్వాణులన్
నునుఁగెందమ్ముల కన్నుదమ్ము లగుకన్నుందోయిచాయల్ పయిం
దనుకం జూచి తదీయమానసము లానందంబు నందించుచున్. 18

మ. హరికి న్నేమమె భద్రమే శిఖికిఁ గళ్యాణంబె మార్తాండికిం!
బరిణామంబె పలాశికిం గుశలమే పాథోనిధిస్వామికిన్!
హరిణారోహకనామయంబె సుఖమే యక్షావళీనేత కా
మరభూమిాధరధన్వికిం బ్రమదమే మాంగళ్యమే! ధాతకున్! 19

మ. చెలువంబే వినువీటినీటరులకున్ జేజేలకున్ లెస్సయే
దళితాఖిలప్రభావరీచరచమూదంభంబె దంభోళికా

• ఈపై స్తుతిపద్యములలోఁ గొన్నియర్థసందేహములున్నవి మాతృకలోనున్నట్లే ముద్రించితిమి

శిల మూహాధిక దేవతాగురుమనీషాళీలితోపాయర
క్షులచే నయ్యమరావతీపురికి యోగక్షేమ మాశ్చర్యమే ! 20

ఉ. నా విని దేవ నిన్ను మది నమ్మినవారలకు న్విపద్గతుల్
రావు గదయ్య ! నీవిజయలాంఛన మోర్వఁగలేని దుష్టస
త్త్వావలి కింతె కాక యటు లయ్యు వినం దగుఁ బిన్నవిన్నపం
బోవనజాక్ష ! మామనవి యొక్కటి యున్నది చిత్తగింపుమా 21

చ. బలువిడి నాలకింపు బుధపాళికలంక దలంక వార్ధిలోఁ
గల దొకలంక లంక యనఁగా నొకదానవరాజధాని యు
జ్జ్వలతరమందిరప్రకరసంఘటితాంబుజరాగరత్నక
దళరుచి ఘ న్వెలుంగు దినదర్శితదీపదశన్ భజింపఁగన్ 22

ఉ. సానువనన్మణీగణలసన్నగరీతిక సాలధూర్వహాం
భానగరీవతంసము దశాననుఁ డేలు దిశాధినాయకా
నూనయశోనిశాధిపతనుగ్రసనాగ్రహసైంహికేయజ
హ్వానటనప్రదర్శనచణాయతబాహులతాకృపాణుఁ డై. 23

మ. భువికి న్మింటికి మంట పుట్టెడుతపంబు ల్వేఁడు గావించి వే
ల్పువజీరు ల్వడయంగఁ జాలనివరంబు ల్పెక్కు లిక్కంజసం
భవుచేఁ గాంచి నిజాజ్ఞలోన మెలఁగ న్సమ్ము న్నియోగించి యీ
భువనక్రోడములోన దండుగయు జంపుం జెల్ల వర్తిల్లెడున్. 24

సీ. చేరఁబోయిన నేమినేరమో యనుచు నందనవనీస్థలి దాఁకి తలఁపరాదు
కావలిబుసుత లెక్కడఁ జూతురో యని * (సురలగారును) దేతి చూడరాదు
మనసైన నొకపారి తనుఁదానె బయకాని మునిఁ బిల్చి పాడించుకొనఁగరాదు
సరి దిక్పతులయిండ్ల కరుగు వేళల నైన నిక్కుపీనులజక్కి నెక్కరాదు

గీ. పగలు రేలును శాల స్త్రీభటు లొనర్ప, దుడుకుచే వేల్పుమన్నీని కొడుకుఁగుజ్జ
కక్కటక్కట ! పూనశక్యంబె వజ్రధరున కిటువంటియంబేదజోరతనంబు. 25

చ. మెఱుఁగుఁగడానిదద్దడపుమెట్టుపయిన్ దశకంధరుండు కొం
దఱు చిగురాకుఁబోఁడు లిరుదారుల రా నడ దూలియాను న
త్తఱిఁ జలిమాన్పుపాటిజిగిఁ దాల్చి యినుం డపరాధశంకచేఁ
జాఱుమొదనంబుఁ జూపవెఱచుం గరచుంబితదిఙ్ముఖాబ్జుఁ డై. 26

* సూళిగరికి - మాత్సా.

మ. జలకంబింటికి రావణుండు మృగయాశ్రాంతిం బ్రవేశించుచోఁ
జలువం జోతి తదంతరస్ఫటికపాంచాలీకరోద్యన్నిజో
పలకుంభీశతనీలశీతలజలప్రాచుర్యుఁ డై వేల్పురా
యలకున్ లేనితదీయవింశతినిరీక్షానుగ్రహం బందెనున్. 27

లయగ్రాహి.

నందనములోని హరిచందనముఖద్రుమములం దశముఖుండు నిజమందిరవనీవా
టిం దిరముకొల్పఁ జెఱలం దగిలి యున్నసురసుందరులుకంజడిసెకం దొడరుజాళ్వా
బిందియలవారిలహరిం దడుపఁ దోఁచుననటం దనరుపాదు లనఁ గందగినయావే
ల్పుందరులరాలు విరులం దోరఁగనీనిగతులం దిరుగుగంధవహబృందము ముకుందా!

సీ. అజనమాఖ్యకు మేఁక యలవడ్డకై వడి నాహితుండికు నరేంద్రాఖ్య వీఁక
వావి లింద్రాణినా వర్తిల్లుహవణిక నసుర పుణ్యజనాహ్వయంబుదారి
మద్దికింద్రద్రునామము చెల్లువడువునఁ గవిసంజ్ఞ జలపక్షిగనినజాడ
గుడనగప్రథ తాలిగుట్ట చెందినయోజ స్వర్ణారిని గళాదుఁ డన్నమాడ్కి
గీ. హుతవహాభిఖ్య రూఢి యన్మతి ఘటింప, గార్హపత్యాది యగుపావకత్రయంబు
వంటలక్కతనంబె రావణునియింట, జరిపెను ఘనాఘనఘనాభ జలజనాభ! 29

సీ. కడవాజారంబుచావడి కెదుర్కొను వజ్రికై దండ గొని వచ్చుగరిమ మెల్ల
నొసువుజవ్వనిపోఁకముడి కాసపడుపెద్దసరిగద్దె నుండుపెద్దఱికె మెల్ల
సనకాదులకు లేనిచనవుతోఁ జెలిదీవిదోరచెంగట మెలంగుమురిపె మెల్లఁ
దళుకుగిబ్బపటాణిబలురాతుకనుసన్న మణిపీఠి నుండుసన్మాన మెల్ల
గీ. బోనిడి విపంచి గొని కాళిమానదండి, కచ్చురలవెంటఁ దిరుగఁ బాలైతి ననివి
చారపడు నౌర! నర్తనాగారకృతవి,హారదశకంఠవశవృత్తి నారదుండు. 30

క. కమలావల్లభ! విను మ, య్యమరారిం గినుకఁ జెనకు నతనికి మఘవ
ప్రముఖులలోవె తాకడీ, జముఁ డొక్కఁడు దక్క వెఱచు శరణం బొసఁగన్

శా. వాగ్దేవీపతిచే నరేతరజనావధ్యత్వముం గన్న యా
ప్రాగ్దేవాగ్రణి మెట్టతామరకు నారణ్యద్విపంబుం బలెన్
దిగ్దంతావళదంతకుంతపటలోదీర్ణవ్రణాంకావళీ
ప్రాగ్ధౌరంధరుఁ డై జగత్రయికి నిర్బంధావహుం డయ్యెడిన్. 32

వ. మఱియు నురుయుగావసాదకరవీరవరవినోదమేదినీధరధురంధరోద్ధరణసాహసప్ర
సిద్ధబాహామహాబల విహారణాసీతనిరధికరణకాందిశీక సుప్రతీక పుండరీక వా

మన కుముద సార్వభౌమ పుష్పదంతాంజనై రావణుం డగురావణుం డనార
తారచితభువనవిద్రావణుం డై తోడరి గరుడఖచరకిన్నరకింపురుషసిద్ధ సాధ్య
విద్యాధరమరుచ్చారణప్రధాను లగునేము తావకీను లనెడుబహుమానంబు
మాని యాత్మసీనయాతుధానసేనావితానంబువలనఁ బలాయమానులం గా
వించిన విమాను లనువస్మదభిధానం బపగతార్థ సంధానంబుగా ధరణ్యంతరం
బున శరణ్యుండు నీవే తక్క వే ఱొక్కండు లేమి సామియామిన్యధిపసా
మీచీన్యవన్నఖముఖపరిస్ఫురణంబులు, సరీసృపవిరోధికరసరసిజోదరాభరణం
బులు, నకృత్రిమముక్తికాంతాసీమంతసిందూరకందళవిమోహాహవ బహుగు
ణారుణిమాభరణంబులు నపారసంసారనీరపారావారతరణకరణంబులు, ననంకు
రత్కళంక మునిమనఃపంకేరుహాలంకరణంబులు నగుభవదీయదివ్యచరణంబు లే
శరణంబు లని వచ్చితి మనువియచ్చరులయుచ్చైస్స్ఫురత్తరంబు లగువాగ్విస్త
రంబు లాకర్ణించి యంచితస్వకీయపదసత్కృత్ప్రపన్నవిపన్నదైన్యభయవిమో
చనుం డగు నప్పుండరీకలోచనుండు. 33

క. పలికెన్ హరినీలాచల, కలితశరచ్చంద్రచంద్రికాధవళం బై
మెలఁగ వోవ్వలయ సుధాసారలసన్మృదుమాధురీధురంధరఫణితిన్. 34

మ. దుడుకు ల్మీయెడ నిన్ని సల్పెదుపలాదుం గై దువ్రుం బంపి యి
ప్పుడె దండించుట దొడ్డు గా దయినచోఁ బొల్పొవు నీయంచత
త్తడి రావూత్తునిమాటచెల్లుబడి, చింతల్ దక్కుఁడిం కయ్యెడుం
గొడుకుం గోరి యజించుపఙ్క్తిరథుకోర్కుల్మనోవాంఛలున్. 35

ఉ. రాచవజీరుఁ డితఁ డన రాక్షసలోకమహాతిరేకశి
క్షాచణచాపదీక్షుఁ గాని శాంతు జగన్నుతి నంచు లోచనా
గోచరుఁ డైనయచ్యుతునకు న్నతిఁ జేయుచు వేలుపుల్ సుధా
వీచిమదంతరాళ మటు వెల్వడి యొక్కెడ నిల్వ నల్వయున్. 36

మ. త్రిదశాగ్రేసరులార! నీరధికుమారిం జానకిం దోసపా
టొదవం ధారుణి నుద్భవించుటకు నుద్యోగింపుఁ డయ్యప్సరో
మదిరాక్షీమణులందుఁ డాదృశజనిం బాటించియున్ మీకుఁ ద
ప్పదు నాకీశత వాయునే జనులకుం బ్రాగ్భావనావైఖరుల్. 37

క. దంభోళిసహస్రమహా, దంభాపహదేహపరుషతావహుఁ డస్మ
జ్జృంభోదితుఁ డొకభల్లుకజంభారి విజృంభి యయ్యె జాంబవదాఖ్యన్. 38

చ. అని నియమించుధాతవలు కంబుధరాగమనాభ్రగర్జతో
నెనయఁగ రామవాహిని మహిం బొడసూపకమున్న రాక్షసేం
ద్రమనిసితకీర్తిహంసి వెఱతోఁ బఱచెం, దమ రున్నచోట్లకుం
జనిరి సురల్, విరించియు నిజం బగురావు భజించె నంతటన్. 39

క. ప్రాజాపత్యాఖ్యాయుతుఁ, డాజన్నమునందు వహుతవహావిష్కృతుఁడై
భూజానికి నమృతరస, భ్రాజిత మగుహేమపాత్రఁ బాయస మొసఁగెన్. 40

క. ఒసఁగినఁ గైకొని సంతస, మొసఁగ సదస్యులు ఫలించె నృప నీసుకృతం
బు సమస్తం బని పలుకన్, ముసిముసిలేనగవు తనదుమోమునఁ దొలఁకన్. 41

ఉ. కోకనదప్రియాన్వయుఁడు కోసలరాజసుతాలలామకుం
గైకకుఁ బ్రేమతోఁ జెఱిసగం బమృతాన్నము పంచి యిచ్చినం
జేకొని వారు భూవరునిచిత్త మెఱింగి సుమిత్రకు న్నవ
ర్ణాకృతిజైత్రగాత్రకు నిజాంశములం దిడి రర్ధ మర్ధమున్. 42

గీ. అవభృథస్నాన మైనయనంతరమున, వశగతమనోరథుం డగుదశరథుండు
వారల మానుల వీడ్కొల్పి మరలె రత్న, కీలితనికేతమునకు సాకేతమునకు 43

గీ. అంతఁ గతిపయదినముల కానృపాలు,మదవతులయందు వింతగా నొదవెఁ బత్త్రి—
వదనదోషావిభూషావివాసనావి, చక్షణము లైనదౌహృదలక్షణములు 44

చ. జడిమ వహించునెన్నడలు సన్నఁదనం బెడలించు గొంచెపు
న్నడుములుఁ దెల్లబంగరువున ల్వగుచెక్కులుఁ బెక్కుదోయపు
దొడవులబరువ్వ లోర్వనితనూలత లూడనిఁబాడు మువ్వభుల్
బడిబడినిద్ర లూరుపుటలంతలుఁ గాంతల కొప్పె నయ్యెడన్. 45

సీ. శివచాపవిదళనస్పృహ చెల్లునే చెల్వ కది కన్యామలరూపమదము గాక
కుహనామృగజయాశ గొలుపునే జవరాలి కది నేత్రయుగముసోయగము గాక
శరధిబంధనచింత శక్యమే విరిఁబోఁడి కది జంఘలవిలాసపదవి గాక
యసురదుర్గజిగీష వసమే కృశోదరి కది గబ్బిగుబ్బలయుదుటు గాక

గీ. యనఁగ గోసలరాజన్యతనయమదికి, గోచరం బయ్యె నిజగర్భకుమారవిహార
దంబురుహనేత్ర శుభచరిత్రానుసరణ,చతురబలవత్తరోద్యోగ సముదయంబు. 46

క. పరమాణుతఁ గృశతం దగు, వరవర్ణినియుదర మపుడు వటపత్రశయుం
డిరవుకొనం దొలుతటిగతి, హరిపదబహుపాద్దళాభ మై తగె నంతన్. 47

చ. రవి యజమునుం, గుజుండు మకరంబు, తులన్ దినరాజసూనుఁడుం
గవి తిమి నొందఁ గెంద గురుకర్కటలగ్నమునందు శుద్ధపు
న్నవమిఁ బునర్వసూన్ బుధదినంబున నొక్కవెలుంగు కోసలో
ద్భవజఠరారణిం బొడవుదాల్చెఁ బలాశసమిద్ధిదక్షు వై. 48

మ. దివిజప్రాణసమీరణగ్రహితశక్తిగ్రీవమాయాభుజం
గవిభంగప్రద మైనపూనిక విహంగస్యందనుం డీగతిన్
రవివంశంబు నలంకరించెఁ దన శ్రీరామాభిధానంబు స
త్కవినందర్భములం దవంధ్య మగుసౌగంధ్యంబు సంధిల్లఁగన్. 49

క. ధరణీవరునియనుంగుం, దరుణీమణి కమితతనయుఁడు తనయుఁడు పొడమెం
జరణాంభోరుహానతసం, భరణప్రారంభరతుఁడు భరతుఁ డనంగన్. 50

క. మిత్రకులజలధిమణులు సు, మిత్రకు నుదయించి రప్రమేయతరశ్రీ
వృత్రఘ్ను లైన లక్ష్మణ, శత్రుఘ్ను లమిత్రనగరసత్రఘ్ను లనన్ 51

చ. విరచితజాతకర్మ లభివృద్ధులు నై యలరారి మౌళ్లనం
తర ముపనీతు లై చదువునం బలుసాదనలం బ్రవీణు లై
కరితురగాధిరోహముల గద్దఱు లై విలువిద్దెలందు నే
ర్పరు లయి చాతురంగరణరంగసమర్థులు నైరి ధారణిన్. 52

సీ. పుంవ్యక్తు లైలోకపుపురుషార్థములరీతిఁ దనువు లై కొన్న వేదములపగిది
నయనగోచరము లైనయుపాయములకీవి నరు లైన జలనిధానములకరణి
సుఖదర్శనతఁ గన్నశిఖిశృంగములభంగి ప్రభు లైన ధాతృవక్త్రములభాతి
నడవడి గలదివ్యనాగదంతములట్లు బాహుజు లగుశౌరిబాహులక్రియ

గీ. ధర్మముఖ్యత నిత్యసత్యత నయాను
స్మృతి గభీరిమ శుచిభవోన్నతియు వాఙ్మ
ఖాకృతిఁ బలాశవ్యాప్తియుఁ బంచాయుధాతి
విలసనముఁ బూని వెలసి రన్నలువు రంత. 53

చ. నలినహితాన్వయేశుఁ డొకనాఁ డినుఁ డిందిరయుండ్లబీగము
ద్రలు కరకుంచికావిఘటితం బొనరింపక మున్న గాయతా
వళి నులిగిలి మేలుకని వచ్చి యహస్ముఖనిత్యకృత్యము
ల్సలిపి మణీమయాభరణజాలవిడంబితరోహణాద్రి యై. 54

చ. చరణములందుఁ బావ లోకజవ్వని పూనుపఁ జామరంబు లి
ద్దఱు మరుచిక్కుటారు లిరుదారులయం దిడ నొక్కపాటలా
ధర కయిదండ యీయఁగ మదావళమంథరుఁ డై మరుత్సభా
గురు వగుఁ గొల్వుకూటమునకుం జనుదెంచి తదంతరంబునన్. 55

మ. వలిపంపుం దెరమాటులం దిరుగు జాళ్వామేలికీల్బొమ్మలం
దెలనాడుల్ విరిచందువా మొకరిలేఁ దేంట్లార్భటుల్ వేత్రహ
స్తులు సామంతులు గొల్వ దెల్పుబలుసద్దుల్ చామరగ్రాహిణీ
వలయారావము వందిమాగధులకై వారంబు తోరంబుగన్. 56

ఉ. మన్నెకొమాళ్లు రాదొరలు మంత్రులు మిత్రులు రాయబార్లు వి
ద్వన్నివహంబులుం గవులు వైణికులు న్నటులుం భజింపఁగాఁ
బున్నమచందురుండు పోడుపు న్నలచక్కి వసించియున్న చా
య న్నవరత్నపీఠిఁ గొలువై బలువైభవ మొప్ప నున్నెడన్. 57

— • దశరథునొద్దకు విశ్వామిత్రుఁడు వచ్చుట • —

సీ. కడజాతితేనియాగము నిర్వహించిన యఘటనఘటనావిహారహారి
సృష్టికిఁ బ్రతిసృష్టి చేసి వాసికి నెక్కు భారతీసహచరప్రతిభటుండు
మేనకాలావణ్యమానసాధీనుఁ డై పరమహంసతఁగన్న వరతపస్వి
తనరాచదొరపుట్టువు నిరాకరించి బ్రహ్మర్షి యై మెఱయుమహామహుండు

గీ. వచ్చె భువనోచ్చయాద్భుతావహనశీల, పాలితజటాలబాలవాక్ప్రముదితాది
తేయధౌరేయుఁ డల్లగాధేయుఁ డాతి, థేయుఁ డై మించు నైందుమతేయుకడకు.

శా. కావ్యప్రాకృతసూత్రబోధనలరేఖన్ సర్గభేదంబు వ
ర్ణవ్యత్యాసము గల్గి సోమసుతుఁ డైనాఁ డంచు సాహిత్యవా
స్తవ్యుల్ శాబ్దికు లధ్వరుల్ తను మదిం దర్కింప సాత్మాన్మనీ
శవ్యంజార్కుఁ డపోలె వచ్చుకుశవంశస్వామి నీక్షించుచున్. 59

ఉ. లేచి కరాంబుజాతముకుళీకృతియు న్నతియున్ ఘటిల్ల మా
యాచతురక్షపాచరభయానకజన్యవిహారకాతర
ద్యోచరవీరపాలకగథుం డగుపఙ్క్తిరథుం డొనర్చు పూ
జాచరణంబుచే ముదితుఁ డై యతఁ డామహినేత కిట్లనున్. 60

సీ. చిప్పకూఁకటితోడి శిరసునం దిడినట్టి జిగిమట్టికుళ్లాయ సొగసుమీఱ
వాఁరుమంజిముత్యాలయొంటులచకచకల్ తళుకుఁజెక్కులదండఁ దాండవింప

గోణముపైని రింగులువారఁ గట్టిన వలిపెదుప్పటి కటిస్థలి రహింప
నడుమకెంగేల నెక్కిడిన విల్ కుడిచేత నొకటిరెండులకోరు లొఱపు నెఱపఁ
గీ. గవదొనలు బూని వెంట లక్ష్మణుఁడు నడువ
రామభద్రుండు నావెంట రా నియోగ
మునఁగితివయేని రాకాసిదొనఁగు మాని
యవభృథస్నాత నగుదు నోయధిప యనుడు. 61

— * రాముని విశ్వామిత్రునితోఁ బంపుటకు దశరథుఁడు విచారించుట. * —

క. ములుకులు గాఁడినగతి ముని, పలుకులు వీనులకుఁ దోఁప భయసంగతి మూ
ర్ఛిలి తనకుఁ దాన తెప్పిఱి, తలపోఁతకుఁ జొచ్చె నిట్లు దశరథుఁ డాత్మన్ 62
గీ. వెడలవసి నాటి నెద గొడ్డువీఁగికన్న, రాము నెడఁబాపునది నిష్ఠురంపుఁబలుకుఁ
జెలుకు తనవంటి పెనుదంటచేతఁగాని, మఘము నాచిన్నిపాపఁడే మనుచువాఁడు.
ఉ. అక్కట! దిక్కటాహభయదార్భటిఁ బర్వెడు సోఁకుటెక్కటీ
లెక్కడ! కాకపక్షధరుఁ డీనిసు వెక్కడ! వారితోడ వీఁ
డెక్కటిపోరికిం దొడరు టెక్కడ! యెక్కడి సంగతంబు లీ
యొక్కలపుంబ్రసంగములు మోసముఁ దెచ్చుదురూహలే కదా! 64
సీ. బాలామణులజోలపాటలా నైశాటవాహినీఝాటకోలాహలములు
గరిడిసాధనలా సగర్వపూర్వసుపర్వగహనసంగరరంగవిహరణములు
చెండుగోరింపులా కండూలభుజదండచండదానవశిరఃఖండనములు
పెన్నుద్దికోమకులపెనఁగులా పలలాశనద్వంద్వబంధురానందనములు
గీ. చెల్లఁబో చూచిచూచి నిశ్శితనీచ, రప్రభులతోడిగోడవ కీరాచపుడమి
వేలుపుతుటారి తాపసివెంట నరుగు, మనుచు నీరాము నేరీతిఁ బనుచువాఁడ.
చ. అని యెడఁద న్విచారపడునాదొరతోడ వసిష్ఠుఁ డిట్లనున్
జనవర! కౌశికుం డనఁగ నల్పకు జోడితఁ డిత్తఱిం దపో
ధన ముడివోనిపూనిక వితాన మొనర్పఁ గడంగినాఁడు నీ
మనుకులకీర్తికామినికి మైకసిగందనిచాయ సంధిలన్. 66
చ. అనిమిషరాజసంపదల కర్హుఁడు గోత్రపవారుండు నెల్లమే
దిని భరియింప నోపునతిధీరుఁడు మానవసింహుఁడున్ జగ
జ్జననుతవిక్రమోన్నతుఁడు శాత్రవరాజహరుండు నైన నీ
తనయుఁడు పూనుకొన్న నొకతాపసిజన్నముఁ గావ నోపఁడే! 67

క. నీరాముని లక్ష్మణుతో, నీరాముని వెంటఁ బనుపు మింక నితనిచే
నీరజనీచర యగు ధర, నీరజహితవంశ చింత నీ కేమిటికిన్ 68

— • దశరథుఁడు రామలక్ష్మణుల విశ్వామిత్రునితోఁ బంపుట • —

గీ. అనివసిష్ఠుఁ డుపల్కువాక్యములవలనఁ, దనయుమహిమంబునిజమని తలఁచెన్నృపుఁడు
విశ్వసింతురె ? భూపతుల్ వింతవార, లెంత వారైనఁ దమపురోహితుని గాక.

క. యోగవిధేయుం డెవ్వఁడు, యోగీంద్రుల కతఁడు గురునియోగవిధేయుం
డై గాధేయుని వెనుకొనె, యాగపరిత్రాణమునకు ననుజాన్వితుఁ డై. 70

ఉ. పైనముచేసి తండ్రి వనుపం బెనుపంతముతో డ ని ట్లయో
ధ్యానగరంబు వెల్వడి పదాంకపవిత్రితమార్గు లై రిత
న్మౌనికృపానుభావభజమానబలాతిబలాభిధానవి
ద్యానిరవద్యబోధవిజితశ్రము లై మహిపాలబాలకుల్. 71

చ. వడి గొరవంకబారు లిరువంకల బాఱఁ జెలరేఁగి చిల్కత
త్తడి దుమికించుకొంచు జడదాలుపు వేలుపుకంటిమంటలోఁ
బడి వెడవిల్తుఁ డంగ మెడఁబాసిన మోసపుటెంకి యాటచేఁ
బడసిన యంగసంజ్ఞ నిల భాసిలు దేశ మతిక్రమించుచున్ 72

చ. అలకకెలంకునం దొలఁకు నాటకొలంకుననుండి వచ్చు గం
ధిలనలినీమిళద్రథపథిన్ సరయూనది దాఁటి వృత్రని
ర్దళనసముద్భవత్రిదశరాడఘనాశనప్రకాశముల్
మలదకరూశముల్ గడచి మార్గమునం జనుచుండువారికిన్. 73

సీ. యక్షాన్వయసుకేతుకుక్షివారిధిఁ దోఁచు కాలకూటమువంటికలువకంటి
దివివెలయాలి కై రెగు నన్నదమ్ములం దగ్రజు కా ల్ద్రొక్కినట్టిజాత
మాయచే జగ మెంచు మారీచుఁ దనియెడు పాతకుఁ గనినట్టిపాపజాతి
వనధి గ్రోలినవానికినుకచేఁ దనయుండు తానును బొలదిండి లైనదుండి

గీ. యాత్మసాక్షాత్కరితచరాచరాత్మయత్ప్ర
యత్నకృతకృత్యమృత్యుదుస్త్యజకృతాంత
నగరశృంగాటకశయాగ్రనర్తితోగ్ర
నిఖలఖేటక తాటక నిలిచె నెదుట. 74

క. ఆదారుణ నీదారి న, రాదకులోత్పాతసంధ్య యనఁ దగు రుధిర
శ్రీదారుణఁ గని ఘృణి యగు, నాదశరథసుతునిఁ జూచి యతివరుఁ డనియెన్.

సీ. వనిఁ ద్రోయఁడే చంద్రవతిఁ గూఁతు రనక యుద్ధతి నాచికేతుమాతామహుండు
పినతల్లి యనక నిర్భేదింపఁడా మున్ను దితిసింహుగర్భంబు శతమఖుండు
ప్రియకాంత యనక దుల్పింపఁడా రేణుకాతరుణియాదల జమదగ్నిమౌని
బ్రాహ్మణి యని గణింపక తెంపుతోఁ బట్టి చంపఁడా భృగురాణిఁ జక్రపాణి
గీ. నడతదప్పినయప్పుడె కెడపఁజెల్లు, బుధవితతి నైన యతి నైనఁ బాలఁతి నైన
దయదలఁప నీకునిటువంటి భయదబలత, మనుకుటిలశీల యబలయె మనుకులేశ.

ఉ. నా విని యాపినీతరిపునాముఁడు రాముఁడు కర్ణపాళియం
దావిబుధారి నారి గుణమంటెయు నంటకమున్న టంక్రియా
రావమునన్ ధనుర్గుణము రక్కసినొంచుట కెచ్చరింప ర
క్షోవిసరాంగశోణితముఁ గ్రోలి మెఱుంగనికోల యేయుడున్. 77

— • తాటకను రాముఁడు వధించుట • —

క. ప్రాణాహుతిగొనె నాశిత, బాణావలి యాతుధానభామినిపంచ
ప్రాణముల రావణాదిమ, కోణపసముదయము బుత్తిగొనుటకు మొదలన్. 78

క. తాటక నీగతి శరహతి, గీటడఁచి నిశాతఝూంటకీర్తికవాట
జ్యాటంకృతి యగురఘుపతి, యాటోపముఁ జూచి పొంగి రమరులు నింగిన్.

క. అంతటఁ గౌశికుఁడు కృశా, శ్వాంతికభృత జృంభకాది శస్త్రనికాయం
బంతేవాసికి రామున, కెంతే వాసిగ నొసంగె నింద్రుని యాజ్ఞన్ 80

ఉ. కౌశికుఁ డస్త్రదేశికుఁ డొకానొకదేశము సత్యలోకనీ
కాశముఁ జూపి యోరిపువిఖండన కంటివె నైగమాంతవా
గీశరణీభవన్మునిమణీఖని నీవని నాశ్రమేందిరా
నాశకళాపటుండు కుహనావటుఁ డున్నజనైకపావనిన్. 81

చ. క్షితి నుదయంబుఁ జెంది బలిగీమునకున్ వడి వేరువాత్ర యు
న్నత మగురూపుఁ బూని గగనస్థలి లోఁగొని యచ్చటం గరు
ప్రతతి చెలంగు లోకపరిరక్షకభిక్షుకచర్యఁ గన్న యా
మతకరిపొట్టిదిట్టనుహిమంబు విడంబ మొనర్చు నైవడిన్. 82

— • విశ్వామిత్రుఁడు యజ్ఞమునకుఁ బ్రారంభించుట • —

వ. అని యుత్తలంగునం దరంగితామందమందాకినీవికచకనకారవిందమకరంద
నిష్యందమధురిమానర్ఘ్యంబును, సచిరసచిత్రప్రచురతరమార్గదైర్ఘ్యంబును,

నగునిజాలాపసరణిం దరణికులపావనుల వీనులకు విందు సంధించుచు మదాంధ సింధురపురంధ్రీకర్ణాంచలచలనసంచారితసమీరణానివార్యమాణ పంచాననద్వ్య ణుకమధ్యాశ్రమం బగుసిద్ధాశ్రమంబునకు నేగి యాగాధినందనుండు యాగం బునకు నుద్యోగం బొనర్చి యున్న సమయంబున నంభోజినీకుటుంబబింబ గోచరుం డగు హిమాచలకుమారికాసహచరశిరోభూషణం బైనయోషధీ రమణుకతన భీతిలుచు వెలువడిన తద్గళాంతరాళవసదరాళతరికరాళహాలాహ లంబు పోలికఁ ద్రిలోకీవిక్షోభకారియగు రక్షోబలారికి నగారంబైన తనదు నేరంబు పరిహరింప దాశరథియై యున్న వెన్నునకు విన్నపంబు సేయింపఁ దదీయవాశకర్త యగువికర్తనుసమీపంబునకు యామునానుబంధంబునం జేరఁబోవులవణవారాశితీరున నఖండపటుకళాధూర్వహుండై పర్వశర్వరింగూడి క్రీడించుజాడ కేతేఁను నాతోడివేడుకకు రాఁ డని యుపశమంబుతో హరిపదో పాంతసీమాసమాసన్న యగునమాయామినివిధంబున నంబరైకదేశంబునం ద్రిశంకుండు నివసించుటం జేసి నానాఁటికిఁ బ్రబలు నీచవాటిక నతిస్ఫూర్తి వర్తిల్లు దివాకీర్తిబృందంబుచందంబున దశస్యందననందనాగ్రణి మహోగ్రచాప ప్రతాపకీలికీలాకలాపంబున నకూపారకుమారవిహారదమరారివీరవరశరీరపటలం బులం బుటంబు లిడుట కంభోరుహాకుమారుం డనునయస్కారుండు సంఘ టించిన యింగాలసంఘంబుభంగి బంగరుగట్టుపట్టు కాఱడవి నిర్గమించు సౌవర్గవాహినిజలావగాహంబునకు వచ్చు నుచ్చైశ్శ్రవోవనస్తంబేరమకదంబ కంబు డంబున, నిలింపసంపత్కలమపారంపరుల కింపు సొంపు సంపాదించు రాత్రించరవధూటికాకోటికన్నీటియలజల్లు కాదికారణం బై, కౌశికారాధ నీయచిత్రభానుప్రభానిరోధకం బైనఘోరాధరనికాయంబుసోయగంబున మహా బిలంబునం దుండియు మఱుద్గ్రసనలాలసం బై తోఁచు మేచకాస్తోకదర్వీకరా నీకంబువీఁక, నాకసంబున భయానకం బగుపలాదలోకంబు నాలోకించి కించి త్తైన ధైర్యంబు లేక యాకులం బైన యాజకసమూహంబు లితరేతరంబు ని ట్లని గణియింపం దొడంగె. 83

చ. తపసులపాలిమృత్యువులు దైత్యులు కిరిల నున్నవాళ్లకుం
దప మని చేయఁ గూడునొ వ్రతం బని పట్టఁగ శక్యమో వితా
ఋవు డిది యేటియత్నము వహించె వివేకవిహీనుఁ డై నయా
న్వపముని యంచుఁ గౌశికు నయుం గడు నేరము లెంచువారలున్. 84

ఉ. హత్యకు రోయఁ జూతురె దురాత్మకులై చరియించురాక్షస
వ్రాత్యులు వీరివంక నగురట్లకుఁ దిట్లకుఁ బెట్ల కోర్చునా
ద్గత్యవిశేష మెక్కడిది తాపసిబక్కల కింక మీర లా
ఘాత్యము చూప భూపతులు గారు చనుం డని పల్కువారలున్. 85

మ. అరణుల్ పాత్రము లగ్ను లాస్తరణముల్ హవ్యంబులున్ నేఁటితో
డ రసాభాసత దోఁప దీక్ష కడముట్టన్ నోఁచెఁగా మాని ప
ఙ్క్తిరథుం డప్పుడె బాలుఁ డితఁ డని సందేహింపఁడా యారకే
యరుదే నేటికిఁ జేఁతగానిపని కీయైక్ష్వాకుఁ డన్వారలున్. 86

మ. మన మధ్వర్యులమై కనం దగినసామ్రాజ్యంబు లేమున్న వీ
యనయజ్ఞంబున కేల వచ్చితిమి లెస్సాయెం గదా కూలిపో
యినయౌద్గాత్రము చాలు చాలు నిఁక హౌత్రత్వం బటంచుం బలా
యనపారాయణులైన ఋత్విజులు నై రవ్చో మఘాగంతుకుల్ 87

సీ. కేల నున్మూలించి గిరిశృంగములు పూఁచి కాచినతరులపై వైచివైచి
కన్నుల మిణుఁగురుల్ గ్రమ్మ నాశ్రమభూమి నెల్ల గ్రొన్నెత్తురు చల్లిచల్లి
వడి ఖేచరుల నేలఁ బడ నీడ్చి సిగలూడ్చి కరములు పెడకేలు గట్టికట్టి
యట్టహాసము చేసి హస్తఘట్టనలతో నటునిటు పాతరలాడియాడి
గీ. నిండిరి నిశాటు లెడము లేకుండ మింట, వింట లే దిట్టిదుడుకు సీవింట నమ్ము
మనుపవే రామ యభిరామ యనుచు మౌను, లార్తి నెఱిఁగింప లేనగ వంకరింప.

మ. విలు కేలం గొని రామభద్రుఁడు రణోర్విం దమ్ముఁడుం దాను బె
క్కులకోఁకు ల్నిగిడించి రక్కసులముక్కుల్ చెక్కులుం గాళ్లు పి
క్కలురమ్ముల్ కరము ల్శిరమ్ములును బ్రక్కల్ డొక్కలుం జక్కు చ
క్కులు గావింప నిలింపు లెక్కు డని రక్షోదండపాండిత్యమున్. 89

గీ. కలితవర్ణాంతరుండై నగాధిసూను
సహచరత నేమొకో నిజక్షత్త్రజాతి
కయినపిప్పలదండ మూనియుఁ బలాశ
దండకరుఁ డయ్యె నపుడు మార్తాండకులుఁడు. 90

శా. మారీచక్షణదాచరుం డపుడు రామస్వామితోఁ బోరికై
యారంభించి తదీయమారుతశరవ్యాపారతూలీకృతా

కాకుం డై స్మృతి దప్పి యుప్పకడలిం గాఁపయ్యె వార్ధీశ కాం
తారత్నంబులు నీటిపాప యనుచుం దన్బట్టి యాడింపఁగన్. 91

క. ఆహేళికులుం డనిమిష, భావాళిహిమకిరణరాహుబాహు సుబాహుల్
వాహరివాహగేహ, ప్రాహుణికుం జేసె ననలబాణప్రౌఢిన్ 92

మ. విదితస్నేహము, సాధువంశము, గుణాన్వితంబు, సత్పక్షముల్
హృదయగ్రాహిఫలంబు నై యొలయు నయ్యిక్ష్వాకురాట్ప్రేరిత
ప్రదరోత్తంసము వెంట నంటి చనియెన్ రాత్రించరప్రాణప
త్ని దయం బాయఁగలేనిమానవతిరీతిన్ రక్తభావాప్త యై 93

చ. నిజమఘుపూర్తి దోఁప రజనీచరహారిణియై కకుత్స్థత
ల్లజుని వరించి యున్న జయలక్ష్మికి నొక్కసపత్నిఁ గూర్ప గా
ధిజమునిచంద్రుఁ డంతట విదేహమహీపరిణీపురోన్ముఖ
ప్రజనము చేకొనెం గృతము వర్ణవిపర్యయచర్యఁ డెంచునే 94

చ. ముని రఘురాముతో నరిగి ముందట శోణతటానుబంధి చం
దనవనవాటి నాఁటిపయనంబు వసించి పయోధిరాజది
గ్వనజముఖవినోదమణికందుకతన్ రవి చెంద సాంధ్యవం
దనముఖకృత్యము ల్నడిపి తజ్జ్ఞులగోష్ఠి మెలంగె నయ్యెడన్ 95

క. ఈజనపదమున కధిపతి, యేజనపతియో మునీంద్ర యిది కృతయుగవ
ద్భ్రాజిత మని వెఱఁగందెడు, నాజితనూభవునితోడ యతివరుఁ డనియెన్. 96

సీ. పౌరాభిమతచిత్ర బలసాంబుఁడు కుశాంబుఁ డనఁగఁ గౌశాంబికి నధిపుఁ డొకఁడు
నరశరీరసరోజనాభుఁడు కుశనాభుఁ డన మహోదయమున కినుఁ డొకండు
దోశ్శక్తిశరజుఁ డాధూర్తరజుఁ డన ధర్మారణ్యపురికి నధ్యక్షుఁ డొకఁడు
నవవిభావసుఁడు వసుం డనఁగ గిరివ్రజరాజధానికి రా జొకండు

గీ. నైన వైధత్రకుశరాజసూనులందు, వసువు పాలించుదేశ మీవసుధయందు
రల్లకుశనాభుఁడు ఘృతాచివల్లఁ గనియె, నతను సైన్యాయుతంబుఁ గన్యాశతంబు.

ఉ. కిన్నెర మీటి వీణెఁ బలికించియుఁ దంబుఱ బూని రక్తిగాఁ
దిన్నని పాట పాడియును దేశియు మార్గము నింపు సొంపు నిం
పన్నటియించియుం దివిరి మద్దెల వాచియుఁ బ్రొద్దుపోక యా
కన్నెలు కేళికావని నొకానొకనాఁడు మెలంగి రయ్యెడన్. 98

చ. కరువలి వారిమేనులును గానులుఁ గీల్జడలుం దొడల్ ల్నడల్
తఱులుఁ గురుల్ మరుల్గొలుపఁ దానిపు డెక్కడ నంతరించెనో
శరశత మైదుకై దువ్వులజంత యటంచు విరాళి గ్రొగ్గి డ
గ్గఱులయు రాచకూఁతురుల గాలికి గీలికి సోఁక శక్యమా. 99

చ. చులుకఁదనంబుఁ గోడిగముఁ జూపకు మోపవమాన మానినీ
తిలకములం గవుంగిటికిఁ దీసెద విట్టి విచార మాజడా
త్ముల దని పల్కఁగా డ్వులుకతో విడఁబోండ్లయొడల్లు వంపు దిం
పులుగొనరాని పెందెవులుఁ బూంచె; నిశాంతముఁ జెంది రింతులుఁ. 100

చ. తనయులవాతచేష్టఁ గని తత్ప్రతికార మొనర్పఁ జాళినం
దనుఁ డగుబ్రహ్మదత్తునకుఁ దండ్రి యొసంగినఁ గన్యకామణుల్
నునుజిగిసాన దేఱిన మనోజులకోరుల మించి రద్దిరా!
మునిసుతుఁ జెట్టవట్టుశుభమూర్తుల కెక్కడిగాలిసోఁకుడుల్. 101

మ. కుశనాభుం డల సౌమదేయున కనుంగుంగూఁతులం బెండ్లి స
ల్పి శుభాన్నత్యముఁ గన్నపిమ్మట జగత్ప్రేంఖోలికావ ర్తికీ
ర్తిశరచ్చంద్రసుధాపయోధి యగుగాధిం గాంచె నస్మద్గురుం
గుశనంజ్ఞుం డగుమత్పితామహుకృపం గోదండవిద్యానిధిఁ ? 102

గీ. అనుచు నిజవంశకథఁ జెల్పు నతనియుక్తి
రక్తిగనుచాయఁ గెంజాయ ప్రాచిడాయ
దినముఖవిధేయములు దీర్చి మనుకులీనుఁ
డనుజుఁడును దాను మునివెంట నవలఁ గదలి. 103

సీ. భవఫాలదృగ్వృతప్రవహత్తదీయకిరీటకోటిసుధాంశురేఖ యనఁగ
శైలాధిపాలానమూలకీలితసింధుగజరాజరజతశృంఖల యనంగ
నపవర్గమార్గసౌధారోహణాధారహీరమయాధిరోహిణి యనంగ
నతివేలసుకృతపటూహూతి హేతుశారదవారివాహధోరణి యనంగఁ

గీ. గమలకువలయకల్హారకుముదసాధు, సీధుమాధుర్యమేదురక్షీరమై భ
గీరథునిపాలి సౌకశృంగిణి యనంగ, నెంచు గంగాతరంగిణిఁ గాంచె నెదుట. 104

శా. హస్తాంభోదనిరస్తయాచనకధారాటచ్ఛటాదైన్యసా
ధ్వస్తిక్షీరగవీవదాన్యదినరాజామ్నాయమూర్ధన్య వి

---

† ఇందలి వ్రాఁతతప్పులు సంస్కృతరామాయణచంపువు ననుసరించి సవరింపఁబడినవి.

ధ్వస్తారాతినృపాలసైన్య! యమ్మపావాణీపదాధ్వన్య! ధీ
రస్తోమ స్తవనీయజన్యగరిమప్రాధాన్యయోధాగ్రణీ! 105

క. కంధరవాహానసింధుర, సైంధవచందనసుగంధ సౌగంధికినీ
బంధుసుసింధురశరమరు, దంధఃపరిపంథిబంధురాయతకీర్తీ! 106

మానిని పాటవసంగితురంగభటోద్భటబంధురగంధగజేంద్రఘటా!
హాటకకూటధురీణపులీనమహాత్తరమాత్తరిపుక్షితిభృ
ద్ఘోటవిపాటనశాతవిహార! నిశాటవిరోధికటాక్షనిరా
ఘాటకృపారసపూరసమేధితగాఢనిరూఢనిజాభ్యుదయా! 107

గద్యము. ఇది శ్రీమదుమామహేశ్వరవరప్రసాదసమాసాదితసరసకవితావిలాసవా
సిష్ఠవంశకీర్తిప్రతిష్ఠాసంపాదక ఋగ్వేదికవి తిరువేంగళార్యకలశరత్నాకర
సుధాకర జగద్విఖ్యాత కవిరాజకంఠీరవబిరుదాంక వేంకటాచలపతి
ప్రణీతం బైనచంపూరామాయణం బనుమహాప్రబంధంబునందు,

ద్వితీయాశ్వాసము

---

శ్రీరస్తు

# చం పూ రా మా య ణ ము.

---

## తృతీయాశ్వాసము.

క. శ్రీనందనసౌందర్య బుధానందనసూక్తిధుర్య యరినృపసేనా
మానమదేభనఖాయుధ, కోనమదేవీకుమార గుణమణిహారా! 1

— * విశ్వామిత్రుఁడు రామునకు గంగావతరణం బెఱిఁగించుట * —

మ. కని యయ్యేటి తెఱం గెఱుంగుటకు నైక్ష్వాకుండు గాంక్షించినం
గొనియాడం దలకెక్కు టెక్కులది పేర్కో శక్తుఁడా యిట్టిగం
గ నొక్కండైన వచింతుఁ గొంత యనుచున్ గాధేయుఁ డాలోకపా
వని క్రీవి న్నొకమం దొడంగెఁ దదనుధ్యానాయమానార్భటిన్ 2

చ. చలిమల మున్ను మేనతనుజాతయనందగు మేనికొక్క చ
న్నులవలినిక్కునుం గల మనోరమఁ జేకొని కాంచె దానియం
దలికచలున్ రథాంగకుచ లంబుచరాయతనేత్ర లబ్జవ
క్త్రలు నగుముద్దుఁగూఁతులను గంగయు గౌరి యనంగ నిర్వురన్. 3

గీ. వారిలో వారిలోలకల్హారకమల, వసరటద్భృంగ గంగఁ జేకొనిరి సురలు
మారువిమతారిచికటారి గౌరియనెడు, హరాంతకారి వరించె నయ్యంతకారి. 4

మ. గిరిజం గూడి శివుం డనేకయుగముల్ గ్రీడింపఁ దత్తేజ ము
ర్వర దాల్పన్ ధర యోర్వలేమి గని గీర్వాణుల్ శిఖిం బూన్పఁ జే
సిరి గర్భచ్యుతియుంచు సంతతి నిజస్త్రీలందు లేకుండ ని
ర్జరకోటిన్ బహుభార్య గాఁగ ధరణిన్ శాపించె నద్దేవియున్ 5

మ. పడవాలున్ ఘటియింపుమంచు దివిజుల్ ప్రార్థింప నవ్వహ్నియుం
దొడుకుం దత్తడిజోదు తేజము సుధాంధోవాహినీవారిని
ల్పుడు నయ్యేఱు వడంకుమెట్టకడ జెల్లుం దార్ప నాజెల్లునం
బొడమెన్ దైవతమొక్కఁ డిత్తిగలమోముల్ కృత్తికల్ మెచ్చఁగన్. 6

ఉ. అట్టి హితావహున్ గుహు మహామహుఁ దా దళవాయిపట్టముం
గట్టికొనంగఁ బట్టి భయకారకతారకవీరకాహళీ

ధట్టరవస్రుతిన్ శెవరు దాడి దొఱంగి నిజామరావతీ
పట్టణమేల నోఁచెఁ బవిపాణి యపారరమాధురీణుఁ డై. 7

సీ. తొలకరితతియాటవులుఁగుఁదేజీరౌతు నడుగుకోదుమిపక్కపడగవాని
నలువపాగాబాటయులవరించినమేటి రాకాసిముక్కుఁక డాకవాని
తెలిగంటిరాచకూఁతురిఁ గైకొనినజాణఁ గొమరు మన్నెతికంపుఁగొమరువాని
జాళువానెత్తమ్మిసరిదాల్చునీటరి మలచెంచురాచూలివలపువాని
గీ. మేలుబలువాలుతోడికెంగేలువాని, వేలుపులచాలుఁ గృపఁ జాల నేలువాని
మణ్ముఖుని బేసుకొన్న నీచరిత విన్న, నొదవునయ్య తదీయసాయుజ్యపదవి 8

చ. విరిసరి వేనలిం, గళభువి న్మణివల్లరి, యంఘ్రి వజ్రపు
న్సరిపణినాఁ ద్రిలోకి యనుచానకుఁ దానొకనీటు వెట్టు నం
బరతటినీవతంస మిది పావకమూర్తి గతిం ద్రిధాపరి
స్ఫురణముఁ బూనుకొన్నవిధము న్వివరించెద నీకు రాఘవా. 9

క. పొగడొందె మును దయాంచ, ద్దృగళుఁడు భుజదండపరిణాకృతభరణామిళ
జ్జగదండమహీనగరుఁడు, సగరుఁ డనం జక్రవర్తి సాకేతమునన్. 10

చ తరణికులేంద్రుఁ డాతఁడు విదర్భజఁ గేశిని వైనతేయసో
దరి సుమతిన్ వివాహమయి తత్సుతులందు సమాశితవ్రతా
చరణవరప్రదాయి భృగుసత్కృపచే నసమంజసంజ్ఞతో
నలువదివేవురొక్కరగు నాత్మజులం గనియెన్ మహారాజులన్. 11

క. అసమంజసచరితుం డని, యసమంజసమాఖ్యు వెడల నడిచి పురిన్ వ
ష్టిసహస్రకుమారులు గొ,ల్వ సహస్రకరప్రతాపవారితరిపుఁ డై. 12

మ సగరుం డంతట వాజిమేధమఖదీక్షం బూని యాగోచితం
బగు తేజి న్విడిపింప నాహరి నహల్యాజారుఁ డింద్రుండు చౌ
ర్యగతిన్ దాఁచె నిశాచరుం డగుచు జారత్వంబు వర్తిల్లుచోఁ
దగుచోరత్వముఁ జేరె నంచుఁ దను విద్వాంసు ల్మదిన్ రోయఁగన్. 13

చ. హరి నరయన్ గురుం డనుప నత్తఱి సాగరు లుర్వి రోసి వే
సరి ధర ద్రవ్వి త్రవ్వి బలిసద్మగు లై హరిబుద్ధి దక్కి చి
క్కర మునిము చ్చటంచు గమకింపులచేఁ గపిలుం గెరల్చి త
ద్గురుతరకోపదీపమునకున్ శలభాకృతిఁ జెంది రందఱున్. 14

క. తనయులు దడయుట కధిపతి, మనుమనిఁ బనుచుటయు నతఁడు మహీబిలపదవిం
జని నిగుడైన పితృవ్యులఁ, గని వారిం దనుప వారిఁ గాంక్షించు నెడన్. 15

క. చదలేటినీటఁ దడుపక, కొద లేటికిఁ దీఱు సగరకొమరుల కని ప్రే
మ దివంతచరుఁడు గరుడుఁడు, మదివంత యడంప నంశుమంతుండంతన్ 16

చ. కపిలు సహాశ్వపార్శ్వగతులఁ గన్గొని జన్నపుఁదేజియంచు వి
న్నప మొనరించి వానికరుణన్ హయముం గొని తెచ్చి యిచ్చినన్
నృపుఁడు తనూజమన్యువు భరించియు మన్యుసమాప్తిఁ గాంచి ది
వ్యపదవి కర్హుఁ డయ్యె నతివార్ధక మొందియు నిర్జరోన్నతిన్. 17

క. అసమంజసుతుం డంతట, వసుమతిఁ బెక్కేండ్లు పూని వలిమలకడఁ దా
పసియై తిరిగియు సురనది, వసుధకుఁ దేనోపఁ డయ్యె వానిసుతుండున్ 18

గీ. తండ్రిక్రియఁ బోనలదిలీపతనయుఁ డగు భ
గీరథుండు గోకర్ణంబుఁ జేరి సలుపు
తపమునకు మెచ్చి యిలఁ దూఱు తనదు వేగ
మాఁగఁ గొనఁజూచు నుగ్రుపై నాగ్రహించి 19

సీ. తోఁగతేని పరివార మగు తారసంఘంబు శంఖరింఖన్మణిసరణిఁ జూప
జవనీతహరిదంతజలధరవ్రాతంబు కూలశైవలజాలలీలఁ దోఁప
సుడివడి తిరిగెడు సురవిమానశ్రేణు లెడనెడఁ బడవలవడువుఁ దెలుప
భిదురాసి తమ నెఱదు వెదకింపఁ జౌదంతి డిండీరఖండపాండితి భజింప

గీ. గగన మేకోదకీభూత మగుట నబ్జ, హితుఁడు దిఙ్మోహము వహింప నతని తేరి
హరులఁ దరఁగలవెల్లిఁ బోనాఁపలేని, తహతహ ననూరుఁ డాత్మలోఁ దల్లడిల్ల.

మ. సురఁగన్నవ్వు ముఖాబ్జమం దొదవ నన్నుం జూసి పోనీక శం
కరుఁ డే యాఁగెడువాఁడు చూతమనుచుం గల్లోలవాచాలతన్
సురకల్లోలిని కేలిసీరమణహృజ్జూటీజటారుద్ధ మై
గతికిం బట్టిన మంచుబొట్టు కరణిం గన్పట్టెఁ జిత్రంబుగన్. 21

క. పృథుకేందుమౌళి సురనదిఁ, బృథివికి రానీక యడ్డువెట్టుటయు భగీ
రథుఁ డాత్మ నపూర్ణమనో, రథుఁ డై నుతియించె ధరణిరథు నీకరణిన్. 22

సీ. కుసుమవాటియు మహానసము నై పొసఁగు నేదేవదేవునకును దేరివలువ
చూపులు రూపులు నై పొల్పుమీఱు నేపరమపూరుషునకు బండికండ్లు

లాయంబుఁ గంచంబు నై యుల్లసిల్లు నేదాటవేల్పునకును గంటసరము
లీలాబ్జ మంపములిక్కయు నై చెలంగు నేయసమవైభవునకు నొసలికన్ను
గీ. నతని జితకంతు నతులబాహాప్రతాప, దూరతోవార్యమాణసింధూరసింధు
రాశరకళత్ర సీమంతు నంఘ్రిమహతక్ర్ర, తాంతు వామార్ధశుద్ధాంతు నభినుతింతు
మ జయ మృత్యుంజయ! వాసరాత్యయవియచ్చారీవినోదప్రియా!
జయ గంగాధర! మేదినీధరధనుర్జ్యాకర్షణోద్యత్కరా!
జయ గౌరీధవ! సారసోద్భవరమాజానీప్రణీత స్తవా!
జయ విశ్వాధిక! దారుకావనమునిశ్యామాప్రియంభావుకా! 24

వ. అని యిట్లు నిజకపర్దనిర్దయరుద్ధసిద్ధవాహినీమహీతలావతారకారణ నైపుణంబుఁ
జూపునాదిలీపభూపాలతనయు నాత్మీయచిత్రచారిత్రబహువిధోచ్చారణంబునకు
మెచ్చి వైయచ్చరపరంపరాకిరీటకోటిమణిఝూటపాటలమరీచి మాలికారచితనీ
రాజనోపచారచారుచరణరాజీవుండును, కైవల్యవితరణానుకూలకరుణారసార్ద్ర
భావుండును, శిఖండిపదమార్గణవ్యగ్రశాబరీ మరాళగమనరోధికాదంబినీడంబ
రవిడంబికాకోలకాళిమాళికమృగమదానులేపన మనోహరగ్రీవుండును, వినోద
మేదినీధరాయమాణరాజతగ్రావుండును, నఖండస్వీయంవ్యక్తసూక్తిశీలితానేక
భావమోహాకప్రకాశితానన్యదేవసామాన్య దివ్యప్రభావుండును, నభంగురస్వీ
యసంగరోపకరణతాసమంచితప్రపంచ దురహంకరణవంచనాచుంచుకించిదవ
దాతహాసితమాత్రసర్వాపిత పురత్రితయపూర్వదేవుండును, నగుమహాదేవుం
డు దను నవని కవతరించుట కనుమతించుటయుఁ బంచశరపంచశాఖామండలి
తపుండ్రకోదండదండంబునం దుండి చిటిలిపడు బటువుకట్టాణిముత్తియంపుఁ
బూసకరణి ధరణిజనపాతకప్రతతి కుత్పాతహేతు వై గగనపదంబు దిగి పడిన
మిక్కుటంపుఁదోఁకచుక్క తేఁకువ మరకతంపుటుప్పరిగకోణిగదప్పి యుఱుకుబ
కదారిపారువామిటారిలీరునఁ గుమారనారాచధారావిదారితధరాధరపివరసరణి
నిర్గమించు రాయంచమించుఁబోఁడి పోఁడిమి హిమాద్రిమంజులనికుంజంబు
నిష్క్రమించు పంచాననప్రమదకోమరున నమరపురవనాంతరాళతంతన్యమాణ
నిష్క్రాంతిమైన చౌదంతియొప్పిదంబున నంబరగవీలలామంబు పొదుగునం
బరిస్రుతం బగునురుక్షీరపూరంబుడంబున నాదేవదేవుపాటలజటాజూటంబు
వెలువడి చిలువచెలువ చెలువలర, దంష్ట్రికలసెకలం దొలంగించు బలుచలువఁ
బరివసతి నెలకొన, నలకమరాపతి పీఁపుచిప్పఁ దాఁకి యుప్పరం బెగసి జగదండక

ర్వరంబునఁ గుంటువడి మగుడు వేగం బడరఁ బుడమికి డిగి నలుగడల వెల్లిపఱసి పెల్లగిలుచుం జాలుకొని యిద్దరులు నేరుపము నుద్దఁడి నేలఁబడి వెడలి పులియ దుగుతపసికొడుకు వెనుకొనెడు పాలకడలి వడువున, వసంతసమయంబు నను సరించు కుసుమసముదయసమృద్ధిపగిది, విశదపక్షానుశీలనాలక్షితవినోద యగు కౌముదీసమితిరీతిఁ, గృత్తికాషట్కంబు ననువర్తించు కార్తికనిశాచక్రవర్తిమూర్తి లాగునఁ, బరమభాగవతుననుగతికి హత్తు సత్త్వగుణసంపద విధంబున, వదాన్యమూర్ధన్యునకు ననుకూల యగుకీర్తి శాలికపోలిక, భగీరథురథంబు వెంట నంటి పంటవలంతికంటసరి సరవి మీఱి నీహారగిరికుమారి భాగీరథీప్రథాసమాకలిత యై యనేకనగరఖేటకర్వటీగ్రామటీకోటులం దాఁటి జహ్నుమునిసవనవాటిపై నాటోపగరిమ నెఱపం గోపించి పుక్కిటఁ జిక్కంబట్టి యెట్టకేలకుఁ గరుణపుట్టి యాజటివరుండు కర్ణపుటి విడువఁ గనువడిం గదలి జాహ్నవీసమాహ్వయంబు మెఱయ నరిగి సాగరులపయిం బఱవ నయ్యేటి వరవ నమ్మేటియఱువదివేవురునరేంద్రనందనులు సంక్రందనపురంబుఁ జెంది రంత భవదీయవంశకర్త యగు సగరప్రణప్త సంతర్పితపితామహగురుప్రసాదాసాదిత ప్రాజ్యసామ్రాజ్యవైభవుం డై యుండె. పుండరీకలోచనా! సమీచీన యూపాస్తోమకీర్ణకుల విజయవైజయంతి యన నీసురస్రవంతి మెఱయుచున్నది. మఱియు నీవియన్నది జగన్నుతాపదాను లగుభవత్కులీను లఖిలజలనిధిమేఖలావలయభారంబు భరియించుటం జేసి నిర్భరుం డయ్యు దుర్భరపురావసుంధరాభరణధౌరంధరీలక్ష్యమాణ యగు బుభుక్షం బోనిడ వడంకు మెట్టకడఁ దోఁకవెట్టుకొని గట్టుచట్టుపల మట్టుపెట్టుదిట్టదెస మొగంబుగాఁ జాఁగి నిగిడి వేయుపడగలకొలందిఁ బూర్వపారావార లహరీ జలకణాసారధోరణీవిసారణపరాయణసమీరణకిశోరపారణాకుతూహలి యగునాదికుండలియన సహస్రధావిజృంభమాణప్రవాహాగాహితపయోరాశి యై కాననయ్యె నవలోకింపుము. 25

మ. అని మందాకిని భూమికిం దిగినచర్యం జెప్పి యాలోకపా
వని వారిం గొనియాడి యావలికిఁ బోవ న్ముందటన్ శోధకే
తనధూతశ్రమహంస మొక్కనగరోత్తంసంబు నీక్షించి యె
వ్వని దివ్వె యని రామచంద్రుఁ డనుగన్ వాచంయముం డిట్లనున్. 26

సీ. అఖిలమోహిని యైనహరిమాయచే వఱ్ఱి యమృతాపహృతి నేగునసురవరులఁ
దగటార్పఁ గుపిత యైదితి మహేంద్రుఁ దునుము నగుపుత్త్రుఁ బడయ వేఁడఁగ మరీచి

పనుపునఁ దపము సల్ప నగారి కై తవంబునఁ బరిచర్య సల్పుచు వినీతుఁ
డై యుండి యొక్కనాఁ డంఘ్రి నెన్నెఱులంట నశుచియై కూర్కు-నయ్యాలివకుట్టిఁ
గీ. కూఁతి గర్భంబుఁ బవి నేము తునుకలుగ నొ, నర్ప నవి సప్తమారుతినాఁ జెలంగె
నాశరులతల్లి వసియించు నప్పు డిప్పు, రము గుశీప్లవమను కాన రవికులీన 27
క పాడమెుగ సుకృతి యలంబస, యెడ నొకఁడు విశాలుఁ డనఁగ నిక్ష్వాకునకుం
గొడు కతనిపేరి దఘమున, కెడయాదు విశాల యయ్యె నిది రఘువీరా! 28
చ సుమతిన్నృపాలుఁ డేలుపురిఁ జూత మనం జని ముప్పొ రాఘరా
రమణునపర్య గై కొని పురందరుఁ డేడఁదారి నారిపైఁ
దమి గతశోకుఁడై పిదపఁ దాల్చె నజాండభరంబు నట్టిగా
తమజటి యున్నయాశ్రమపదంబు కుఱాగటత్రోవఁ బోవఁగన్ 29
క. పాషాణ మొకటి రఘుకుల, భూషామణి పదపరాగము లు పైసోఁకన్
యోషాతిలకం బగుచుం దు, రాషాదరవిందగంధిరహిఁ జూపట్టెన్. 30
మ మనువంశేంద్రుపదాబ్జరేణువు పయిం బాఱంగ నెమ్మోము కౌ
ను నెఱుల్ పొక్కిలి పాణిపాదములు కన్నుల్ పుష్కరచ్ఛాయ మ
య్యె నయారే యనఁ బక్ష్మవాసనలు మేనెల్లం గన న్మోఁచియుం
జనుగోయి న్వ్రీడదయ్యె శైలగరిమస్వాభావ్య మయ్యెంతయున్. 31
గీ. అరిది యనఁగఁజెల్లదె రజోగుణమె ఖేద, మునకు మోదమునకు మూలమగుట
రజమువలన వికృతి భజియించినయహల్య, ప్రకృతిఁదాల్చె రామపదరజమున 32
సీ. తనచంచలతవాయ దని తపంబొనరించు తొలకరిమెఱుఁగొ యీతలిరుఁబోఁడి
హరసాంధ్యకృతిధాటి ధరికు జాఱినసుధాకరరేఖయో మెు యీకంబుకంఠి
వసుమతి తనపేరువాసింపఁ గన్న పైఁడిసలాకయో మెు యీబిసరుహాక్షి
తనచెలికాని కాముని కనంగుఁ డొసంగిన కృపాణి యో మెు యీవలిదపాణి
గీ. యనఁదగు నహల్యయాతిథ్యమునకు నలరి
కౌశికుఁడు రాఘవులతోడఁ గదలి యంత
జనకమఘవాటి కరుగఁ బూజన మొనర్చి
యినకులునితో శతానందుఁ డిట్టులనియె. 33

— * రామలక్ష్మణులకు శతానందుఁడు గాధేయవృత్తాంతము చెప్పుట * —

శా. కన్యాకుబ్జపురి న్వసించునపు డీగాధేయుఁ డక్షౌహిణీ
సైన్యంబుం గొని యొక్కనాఁడు మృగయాజాతాశయానందుఁ డై

వన్యంబుం గ్రుమ్మరఁ దోఁచు ఘర్మ మడఁగన్ వాసిష్ఠుసద్మంబునం
దన్యూనామరధేనుకల్పితతదీయాతిథ్యసంతుష్టుఁ డై. 34

ఉ. ఆపసి రాచయింట వసియించుటకుం దగుఁగాక దక్కునే
తాపసి కంచుఁ దద్గవికతం బగునుద్ధతిఁ బట్టఁ జేసి ధా
త్రీపబలంబు బ్రహ్మబలధిక్కృత మౌట యెఱింగి చాపముల్
రోపముఁ బాఱవైచి మునిరూపముఁ దాల్చి తత్క్షణంబునన్. 35

చ. తప మొనరించునత్తఱిఁ బతంగకులాబ్ధిశశాంకుఁ డాశయ
వ్యపగతశత్రుశంకుఁ డగునట్టి త్రిశంకుఁడు బొందితోడ ది
వ్యపదవికై వసిష్ఠు విడనాడి తదాత్మజులన్ దురుక్తిచేఁ
గుపితులఁ జేసి శాపము దగుల్పడి తన్ శరణంబు సొచ్చినన్ 36

ఉ. మాలతికంబు సూడక సమస్తబుధుల్ తనుఁ గూర్చి వచ్చిన
వ్వేళ వసిష్ఠసూను లొడవెం గద రాజకయాజకుండు చం
డాలపు సోమయాజి కని నవ్విన వారి యవాచ్యజాతులై
కూల శపించి వేలుపులు కుంభినికిన్ దిగవింపఁ గోపుఁ డై. 37

చ. దివికిఁ ద్రిశంకుఁ బంపుటయు దేవవిభుండు తదీయకశ్మల
ప్లవవతివేషముం గని యిలం బడద్రొబ్బ నభంబునందు న
య్యవనిపు నుండఁబంచి భువనాంతరకల్పన మంత నజ్ఞసం
భవకృతసాంత్వవాదుఁ డయి మాని తపోభరితాంతరాయతన్. 38

క. పశ్చిమదిక్కున కరిగి వి, పశ్చిదపశ్చిముఁ డితండు బహువర్షము లం
దాశ్చర్యకృతాస్తోకత, పశ్చర్య వహించె భూనభశ్చరనుతుఁ డై 39

మ. నరమేధంబున కంబరీషుఁ డడుగం దన్ దల్లిదండ్రుల్ ధనా
తురులై యమ్మినం బశూకరణభీతుం డై శునశ్శేపుఁ డీ
కరుణాబ్ధిన్ శరణంబు వేఁడ నతనిన్ గాథాయుగప్రీణితా
మరుఁ గావించి భజించె నిట్టి త్రిజగన్మాన్యుండు సామాన్యుఁడే. 40

క. వెండియుఁ బడమటిచాయని, తం డుగ్రతఁ బూనుకొన్న తపముఁ జెఱుప నా
ఖండలుఁ డలసుమనఃకో, దండుని వేదండ మైన తనుఁ బనుచుటయున్ 41

క. మేనక మానివిరక్తి భ, యానక రతిరాజరణజయానకనిభసిం
జానక నత్రసనూపుర, యానకళానుగతగాంగిహంసాంగన యై. 42

సీ. మించుతోడ రమించుమేఘంబు కైవడి వ్రేలుకొప్పొకనీటు గీలుకొలుప
మరుపతాక వహించుమకరచిహ్నము రేఖ సోఁగకన్గవ బెళుకు సొగసుచూపఁ
బంపుగురే దాల్పు నింపుజాబిలిరీతి మొగము లేనగవుతో ముద్దుగులుక
నెలదీవఁ దళుకొత్తు నలరుగుత్తులక్రివి బటువుగుబ్బలు నేత్రపర్వ మొసఁగ
గీ. మహికి దిగివచ్చి తనయాశ్రమంబుకెలన, మెలఁగ నావేల్పుజవరాలివలకుఁ దగిలి
యలఘుకళలకు నిధిగాన నతనుశాస్త్ర, దేశికుం డయ్యె నప్పుడు కౌశికుండు 43
మ. నునుఁగెమ్మోవి జపానుబంధ మణఁపన్ నూగారు సామీరణా
దనచర్యన్ గలిపింపఁ గౌను హరిచింతం బోనిడం గోకపా
లనదృష్టిం జనుదోయి మాన్పఁ జిరకాలం బీఘనుం డావిలా
సినితోఁ గూడి మెలంగి యంతట నుదీచి న్యోగియై యున్నెడన్. 44
సీ. వేలుపుదొరవీటి వేశవాటిమిటారిమిన్నల కిదిగదా మేలుబంతి
హయమేధముఖయాగయజనశీలురఫలాకలనల కిదిగదా కల్పలతిక
పవిచేత వసపోనిదివిజేంద్రరిపుతపోవితతికి నిదిగదా వేఱువిత్తు
జగమెల్ల గెలువఁ గెంజిగురుటాకుజిరావజీరున కిదిగదా జీవగఱ్ఱ
గీ. యనక కినుక శిఖాకృతి దనుకఁ దిట్టె నమరపతి పంపఁ దనదుడెందము గలంప
వచ్చురుచిరోరురంభ యౌవనవిజృంభ, మానసంరంభ రంభ నిమ్మౌని వరుఁడు
క. తదనంతర మీతఁడు పూ,ర్వదిగంతరమున నిరంతరశ్వాసనిరో
ధదురంతతపోవిభవ్య, త్రిదివుం డయి విలయతరణితేజఁగున మెఱయన్. 46
శా. బ్రాహ్మీవల్లభుఁడు న్వసిష్ఠుఁడు నిలింపశ్రేణియు న్నీవహో
బ్రహ్మర్షిప్రవరుండ వంచుఁ దను సంభావింప లోకోత్తర
బ్రాహ్మణ్యైకశరణ్యమంత్రజుషియన్ ప్రఖ్యాతి వర్తిల్లె నీ
బ్రహ్మజ్ఞానధురీణుఁ డంచు గణుతింపన్ మౌని సంప్రీతుఁడై 47
క. రాతిరి యచ్చట నుండి వి,భాతం బగుటయు నొసంగెఁ బ్రామినుకులప్రో
గై తమ్ములకనుఁ గైతగు, జోతికి నర్ఘ్యంబు దర్భసుమగర్భముగన్. 48
క. శ్రీరామలక్ష్మణులు సం,ధ్యారచితప్రణతులై నిజానుగతిన్ రా
వారికి జనకపురాలం,కారము వివరింపఁ దొడఁగెఁ గౌశికుఁ డెలమిన్. 49

— * శ్రీరామునకు విశ్వామిత్రుఁడు మిథిలావృత్తాంతము చెప్పుట * —

మ. కిరిధారేయునికోఱ హీరఖచితక్రీడాద్రి, మున్నీరు చ
ల్వ రహింబాయనిచీర, మేరుగిరి జాళ్వాపీఁట, మిన్నేఱు బి

త్తరపుణ హారము గాఁ జెలంగుధర సీతారత్నముం గాంచఁ దాఁ
బురటి ల్లైనపురీమతల్లి మిథిలం బోలంగఁ బ్రో లున్నదే! 50

మ. శివకోదండవిఖండనంబు సలుపన్ సీతానురక్తిన్ విదే
హావిభుం డున్నపురంబు డాయఁగల సీయత్నంబు చింతించి తా
భవచాపం బగుభీతి నిన్ను నతిచేఁ బ్రార్థింప నున్నట్టి మే
రుపురీతిం గనుపట్టె వప్ర మిచటన్ రోధోఽంతరవ్యాప్తమై 51

చ. జగతికిఁ గూఁతు రై కలిమిజవ్వని జానకి యన్నమాఖ్య ని
న్నగర వసించి యున్నకతనం బెడఁబాయనికూర్మి కాశయం
బగపడఁ జుట్టఁబెట్టు కలశాంబుధికైవడిఁ జూడ నొప్పె నిం
దగడిత పుండరీకకుముదావలిధాళధళీయుతాంబువై. 52

చ. ఇప్పురి గొప్పయుప్పరిగ లిక్కువ చెక్కువహించు మించులై
యొప్పులకుప్పు లుండ విడనొల్లని నల్లని మబ్బులోయనం
దెప్పలఁదేలుఁ దన్ముఖవనేరుహసౌరభవారిరాశి నె
ల్లప్పుడు దూర*ఖేచరవనాగతసాంద్రమదాళిమాలికల్. 53

మ. మినుకుంబైఁడిమెఱుంగుమేడ లిచట న్నిన్నందియుండం గనుం
గొని యాదిత్యులు రత్నసానువులు పెక్కుల్ దోఁచె నౌరయ్య! ప్రా
క్కనకక్ష్మాధరంబు శంకరుఁడు విల్గా వంచిన న్వంచుఁగా
క నికేతఁబులు మాకు లేవె యనుచు న్గర్వింతు రత్యున్నతిన్. 54

చ హారిహయనీలకీలితమహత్తరగోపురకాంతిధోరణిన్
దరణి భ్రమించి నీకుఁ దగునా యమునా వెడనుల్లఁ జెంద నా
గరుఁ బెడఁబాసి వచ్చుటకుఁ గారణ మేమి యనం దదీయమా
ఖరికి నగు న్సరీతతి పతాపక నిప్పటిమింటిచాయలన్ 55

క. పరిమిళితాగరుధూప, స్ఫురణం బై యిచట ధరణిసుత రతనపుటు
ప్పరిగ గగనారవిందము, సురభియనుట నిజ మొనర్చు సురతతిమదికిన్ 56

శా. ఋగ్వేదార్ణవకర్ణధారులు, యజుశ్శ్రీవల్లభుల్, సామస
మ్యగ్వైదుష్యనిధుల్, భృతద్వివిధమీమాంసారిరంసుల్, శ్రవో
దృగ్వాణీ పరిణేత, లక్షణచణోక్తివ్యాపకుల్, సాహితీ
భృగ్వంశంబులు, జాణ లన్నికళలం దీప్రోలి విప్రోత్తముల్ 57

* ఖేచరవనము = నందనవనము

ఉ. ఈవికిఁ జాల దర్ణవమహీస్థలి, * పోరికిఁ జాల దీత్రిలో
కీవరవీరలోక, ముకుకీర్తి వసించుట కిమ్ము కాదు రా
జీవభవాండ, మిన్నగరిఁ జెన్నగు రాచకొమాళ్ల కన్నదో
నావశమా గణింప రఘునందన వారిగుణప్రభావముల్ 58

గీ. ఒకరొకరి యింటిముందటి యుదిరిపసిఁడి, మేరువంతేసి రాసులై మెఱయుననఁగఁ
దెల్ల బేగడకొండ యాస్తి యగునలకు, బేరుఁ జెనయాని యీవీటిబేరులకును.

ఉ. ఏరులసంఖ్యఁ జెప్పటకు నెవ్వరికి న్వసపోనిదారిఁ గా
శ్రీరథరిత్రిఁ బైరులు సమృద్ధి వహింపఁగఁజేసి గోగణా
ధారత రాజశేఖరవతంసములై సయిదోడు గంగకు
న్వేరికిఁ బోల్పఁ జెల్లు నన విష్ణుపదోద్భవు లుందు రిచ్చటన్ 60

మ. వినువీథిం జనువప్పు డిప్పగముఁగో వేతండతండంబు చె
క్కున నెక్కొన్నమదంబు లంబుజవిపక్షుం జెంద పెంపొందికం
దనుపేరం దనరారుఁ గాని భువనఖ్యాతావదాతాంశుసాం
ద్రునకుం జంద్రునకుం గళంక మను టెందుం జెప్పఁగా నొప్పునే 61

మ. చరణాబ్జంబులు సాది కుర్విఁ గదియం జాఁగు న్నయప్రౌఢిఁ జి
త్రరుతేజీలను మించుఁ దిన్ననడన్ ధాటిం బరీక్షించుచో
శరధుల్ దాఁటి చివుక్కున న్మరలు వాజానేయరత్నంబు లి
ప్పరి నారట్ట కరూశ బాహ్లిక శక ప్రోద్భూతభావోన్నతిన్ 62

మ. కొఱఁతం జెందనిచందురుం డసుగునం గూర్మాకృతిం జొప్పడం
దరిత్రాడై తొలుకారుమించు లమరన్ సౌందర్యమాధాత్రచేఁ
జెఱకున్నింగిణిజోదు చైత్రయుతుఁడై శృంగారసారాంబుధిం
దరువం గల్గిన వేల్పుచెల్వ లిచట న్వర్తిల్లువారాంగనల్ 63

ఉ. చిత్తరుచిత్తరుల్ నడభజించి రనన్ జిగినీలి కాసె ద
ట్టొత్తెడు పాత్రకత్తియల కొజ్జతికంబు వహించి కోహళుం
దత్తిలు నైనఁగా దనెడునైపుణి మార్గవిధంబు దేశియుం
జిత్తము కేలఁ బూని వినిపింపఁగ నోపుదు రిందు నట్టువల్. 64

ఉ. సంగరభోజి కాస్తి యగు జంత్రము, గాత్రమునందు రక్తిచూ
పం గొఱగాఁడు, చాలఁ దలపావని రాగము విస్తరింప, నెం

---

* పోరికినాలమి—అని మూ.

చం గోదుకుంబ గాశ్వతరసంజ్ఞలకుఁ శ్రుతిదప్పనంచు వీఁ
కం గయిక్రోరు ముజ్జగముగాణల నిచ్చటి గాయకోత్తముల్. 65

క. ఊలు ముత్తెమినట్లు భరముం, దరిలీపుమిటారిపలుకుదారి నయంబు
న్మెఱయింపనేర్తు రిప్పురి, నెఱమద్దెలకాండ్రు వాద్యనినదప్రౌఢిన్ 66

ఉ. చక్కెరమోవి కాటు, దమసానులచీరలవల్లెవాటు, లేఁ
జెక్కుల గోటిసీటు, మెయిఁ జెల్వగు కీల్జడవాటు, నార్జవుం
జెక్కుఘటింపఁ గుంకుమపటీరకురంగమదాదివాసనల్
సొక్కులిడ న్నడ స్వీటులు సోలుదు రిచ్చటవేశవాటులన్. 67

చ. పలుతెలినిగ్గు మొల్లగమి, బాహులు చంపకమాలిక, ల్మోగా
బులు వికచారవిందములు పొన్నలు నాభులు, వాలుఁగన్ను లు
త్పలములు నై చెలంగ బహుతం గనుపట్టు వసంతలక్ష్మి ల
ట్లలరుల జట్టిగొందురు విటాళియ మిచ్చటిపుష్పలావికల్. 68

చ. మొగముల తమ్మివాసనకు మూఁగెడు తేఁటులఁ దోలు కేలి కై
చిగురులమేపరు ల్గదియఁ, జిల్కలు పల్కులఁ జేరఁ గీరముల్
బెగడఁగ, మించు నందె రవలిం గలహంసలు రా, ససైన్యమై
తగుమరుమించుచుఁ బోణి కెనదాలుతు రిచ్చటిశాలిపాలికల్ 69

క. జనకుఁడు నిమివంశయశో, జనకుఁడు నిజకీర్తివిజితశారదఘనతే
జనకుఁడు పటుబోధనిరం, జనకుఁడు పాలించు దీని సరిసాస్థానిన్. 70

మ. మొగలిం గేదఁగి రేకు, వంశకుహాళి నృత్యంబు, చక్రాతిలో
* మొగఱాల, శ్రకనఁటిన్ మిటారి కపురంపుంబల్కు, గారాకుఁ దీ
వగమి న్లేఁజిగు రుద్భవిల్లునటు లీవై దేవాయాగక్రియా
జగతిం బాల యొకర్తు సీత యనుసంజ్ఞం గల్గి వర్ధిల్లఁగన్. 71

మ. కటి దోడ్డై కననాటఁ, గన్గవకటాక్షశ్రీలగర్వంబు చూ
పులఁ జన్నుల్ మొనసేసి యుంట, బగడం బుగ దార్కొన న్మోవి పూ
నుటఁ, దారుణ్యపు బందుక ట్టగుట మేనుం దీవకుం జెప్ప కె
చ్చటికో పోయె మిటారి బాల్య మసమాస్త్రప్రాప్త దౌర్బల్యమై. 72

* మఁగిఱా యనుటకు మొగిఱాయని ప్రయోగించెను.

చ గొనబుటొయారిచెన్నె అులు కొప్పున కందుట చూచి వానికి
న్ననలకుఁ దాము రాఁగలుగునంటు గణించి నిజోపమానమో
జన మొనగూర్ప వేఁడుటయుఁ జంపక మిందుకు సమ్మతింపమిం
గనకలతాంతవాటిపయిఁ గంటు వహింపఁగఁబోలుఁ దుమ్మెదల్. 73

క. విరితేనెమేపరులకున్, హరినీలపునరుల కిరుల కజ్జాక్షికురుల్
గురు లై వెడవిలుతుని బెడ, గుఱులై తగ నెమ్మిపురుల కొక దాఁపరులై 74

ఉ. నీ విఁకఁ బాల ముంచినను నీళ్లను ముంచిన మే లటంచు మా
లావిరిఁబోణికన్నుఁగవ కాశ్రితవృత్తి వహించి తత్కటా
క్షావళికాంతిపూర మమరాపగ యై యమునాస్రవంతి యై
తావుకొన న్భజించె నమృతప్రభవావిమిషత్వసంపదన్ 74

క. శ్రీలగువీనులనంగతి, నాళీకత బెనుకు కలికినయనమ్ములపై
వ్రాలినమదాళిమాలిక, పోలికఁ దారకల సొలపుపొలుపు వహించెన్. 75

శా. ఆవామేక్షణనాసఁ బోలుట కనర్హం బౌటనో మిక్కిలి
న్నావుంబువ్వుఘనంబు దాళనిగతిం దోఁచె, న్మహీమండలిం
దావమ్మై న్సరసాళి గర్వ్యరుచికి న్సంపంగి, వంశంబు ము
క్తావాసం బగుచున్ విరక్తయతిచిహ్నం బమ్యె నూహింపఁగన్ 76

గీ. నెలనెలకు భానుమండలిఁ గలయుఁ జంద్ర
బింబ మందురుగా కిందుబింబమందు
నరుణబింబంబు గలయునే యరు దనంగ
మొగమున కొసంగు నొకకెంపు ముదితమోవి. 77



చ హారమకుటావతంస మగునర్ధసుధాకరుఁ డష్టమీనిశా
కరుఁ డెదిరించి లొ చ్చగుట గానఁబడంగ నపాంగమాలికా
పరిచితకాళిమ న్నిటలపాలికపై నిడి మోయఁబోలు నీ
సరణి నన న్బొమ ల్మెఱయు జవ్వనికి న్నెలవంక బాగునన్. 78

క చిత్తజుఁ డను దొమ్మరి లా, గెత్తి వడిం దూఁటి చనఁగ నిడినకడానీ *
బెత్తపువలయములో యన, బిత్తరితాటంకయుగము బెడఁ గై తోఁచెన్. 79

గీ. చిగురువిలుతుపగతుఁ డగునుగ్రునకు శేఖ, రత్వ మొందు తనకొఱంత దీఱ
నర్ధచంద్రుఁ డలిక మై తోఁచెనేమొ యా, మదనజనని యైనమానవతికి 80

* " కడానీ " యని దీర్ఘమెట్లు వచ్చెనో.

మ. కలువ ల్మ్రింకెన కుందచంపకములుం గందోయి కెమ్మోవియుం
బలుచా ల్నాసయు నాఁటఁ దమ్మి తలఁచుం బద్మాస్యమో మెల్ల నా
బలఁగం బంచు, మృగాంకుఁ డట్ల పొగడుం బల్కు ల్సుధల్ చిన్నవె
న్నెల లేనవ్వు కపోలముల్ కళలు నై నిచ్చల్ ప్రకాశించుటన్. 81

మ. సహజశ్రీహరిణాంకపంకరుహముల్ సౌందర్యదాయాప్తి
స్పృహచే దర్పణబింబదంభమునఁ దన్ జేరం గృపం గారవిం
చి హసాక్షిద్యుతిఁ జంపకం బిడి భృతజ్యేష్ఠత్వముం దమ్ముల
గ్రహియుం బూన్పఁగఁబోలు బాలమొగ మారాజారవిందంబులన్. 82

క. సంకుమదంబు వహించియు, సంకుమదం బణఁచు నౌర సతికంధర మీ
నాంకావహజయకాహళ, శంకావహమ్మగు వినాదచతురిమయుతమై 83

మ. కులుకుల్ నేర్చెను పైఁట మీటుకొని రేఁగుంబండ్లు పూగీఫలం
బులు మాలూరశలాటువు ల్లికుచము ల్పూబంతులుం దమ్మిమొ
గ్గలు తాళంబులు నారికేళములు చక్రంబుల్ నునుం బైఁడికుం
డలునుం గొండలు నై చెలంగెఁ గుచము ల్నానాఁటికిన్ బోఁటికిన్. 84

చ. జనకునిపట్టిగట్టిజిగిచన్గవ సామజకుంభదంభనో
దనగరిమ గ్రహించు టరుదా ? కరిదారణకారిమైనయా
కనకగిరీంద్రధన్వివరకార్ముకముం దునియించుప్రాయపుం
ఘనతవహించి యున్న దనఁగా నిఁక భానుకులాధినాయకా 85

చ. నడు మతిసూక్ష్మమైనకతనన్ రతినర్మసఖుండు సిబ్బెపుం
బాడ నునుగబ్బిగుబ్బకవఁ బుట్టెడు రాయిడి కావలగ్నముం
జడియఁగనీక యానికయొసంగిన నీలశిలాకపోలికం
బడఁతుకరోమరాజి కనుపండువు నిచ్చు జనంబు చూడ్కికిన్ 86

చ. ఘనుఁడు గదా విధాత సతికా నణుమాత్రమునన్ ఘటించినాఁ
డని చరణాబ్జరేణుపరమాణువుచే మునిసార్వభౌమ గే
హినితనువల్లి యెల్లసృజియించిన నీమొదుటన్నుతింపఁ బో
యినభవదీయచిత్తమున కేగతి వింతయగున్ రఘూద్వహా. 87

గీ. కౌనుసోయగంబు గగనంబు నుతియింప, ననుచుఁ గన్న పిన్నజనులు దలఁపఁ
దనకుఁ దానె తోఁచె వనితపాలికి మ్మహాబిలప్రసిద్ధి యద్భుతముగ. 88

చ గురుకుచబాహువల్లరులకుం దమపాలిటిపుణ్యవాసన
న్నరులుగ నోచినార మని చంపకమాలిక లుండఁ బంకసం
కరములు తమ్మితూఁడు లురుకాండబలంబువహించి బల్మొనన్
సిరిఁ బచరింపఁ దత్తనువు చిల్లులు వోవఁగ నాడరే జనుల్. 89

సీ వేణీబంధమయూరవిందబంధుకుమారికాసమాకలితసైకత మనంగఁ
దారుణ్యహిమకరార్ధకిరీటశుద్ధాంతవిహారణోచితమణిద్వీప మనఁగ
రతిమన్మథవివాహరచనామహోత్సవప్రకటితకనకవేదిక యనంగ
హారిశారాసదురాసదాధిరోపణపణగ్రహమనోరధరధాంగం బనంగ
గీ. భృతసుధాకారమేదినీకృతి జుగుప్సి, తాశయుకు శేశయుభవప్రయత్నగౌర
వస్ఫురత్తైజసక్షోణివలయు మనఁగ, బాలిక పిఱుందు కన్నులపండు వయ్యె. 90

చ అతిశయరూపరీతి కరభాలికిఁ జొప్పడఁబోదు హస్తినీ
పతులకరంబులు న్మలినభావము దోఁచు ననంటి కంబముల్
గతమృదు శీతరాకృతులు గాన మనోజ్ఞతయు న్సువర్ణజి
ద్ద్యుతియు మృదుత్వముం గలతెలోదరియూరుల కెవ్వి పోలికల్ 91

చ తలిరుకటారికాని బలుదంటదొనల్ వెనువెంట నంటు ను
జ్జ్వలశరశాలిసార మొదవ న్మకరాంకము లూని హేమకా
హళగరిమన్ జగత్త్రయజయంబు వహింపఁగఁ జేయునట్టి యి
జ్జలరుహపత్రనేత్రమృదుజంఘికల న్నుతియింప శక్యమే. 92

క కంజనయనాశిరోమణి, కిం జరణయుగంబు సొబగు కెంజిగు రగుటన్
సంజాతకోరకంబు ల, నం జితతారకములైన నఖములు మెఱయున్. 93

సీ. రాజీవచర్యాధుర్యకుఁ బాల్పడినఁ గాక ఘనకూర్మరేఖ చేకొనినఁ గాక
వసుమతీభరణాలాలసత కోపినఁ గాక మతకరిహరిదారి మనినఁ గాక
దళితారి విక్రమోద్ధతిఁ జెలంగినఁ గాక రాజహారితకు నేర్పడినఁ గాక
మణివితానాయోధ్యమహిమఁ జెందినఁ గాక కోటేసుపెక్కు నెక్కొనినఁ గాక
గీ. శ్రీఘనోన్నతి కలికిమై చెలువు నెఱపి, కాక చెలి పాదయుగళి మీఁగాళ్లు పిఱుఁదు
నెన్నడుము చన్నుఁగవ మోము చిన్నిమోవి, నాస వేనలి యొకని కెన్నంగఁదరమె.

క. ఈపగిది న్నవయావన, మై పరఁగఁ దనూజపెండ్లి కాజనకుఁడు ధా
త్రీపముదాక్షేపణమగు, చాపారోపణము పణము సలిపెఁ గుమారా 95

క. అని యీగతి మునితిలకుఁడు, దనవిలుతునిఁ జిలుకుటమ్ము నాటినచందం
బున డెందంబున సీతా, వనితామణి గిలుకొనఁగ వర్ణించుటయున్ 96

క. ధరణికుమారీకుచభర, పరిరంభముగోరు రామభద్రుని మదికిన్
మరువిల్లు మేరువయ్యెన్, హరువిల్లు నమేరు వయ్యె నతివైచిత్రిన్ 97

వ. ఇత్తెఱుఁగునం దత్తపస్వికీర్తితం బగునమ్మత్తకాశినీరత్నంబు శంభుచాపాధిరోపణప్రయత్నంబు చిత్తంబున హత్తింప నక్షత్రవర్తనాయత్తతల నత్తమిలు వృత్తంబుల నిమిత్తంబువలన సత్రపోఢాత్ములై యుత్తమక్షత్రియకుమారు లగు విభాకరనిశాకరుల గివి, దేవతావిగ్రహపరిగ్రహాభావ భావనావిలకుమారీలతో దరికాముఖరపామరధరామరానీకదుర్వివేకం బపాకరించుటకు భూచరులలో చనంబులకు గోచరించిన యనింద్యసౌందర్యసాంద్రులగు నింద్రోపేంద్రులచందంబున, నిజాపకారకారణశుచిస్ఫురణ కయనం బగుభవత్తృతీయనయనంబు లీలఁ, గలహవేళాకుపితశైలాధిపదుహితృచరణకిసలయ విలసితాలక్తరసవ్యతికరానువేలముకుళితం బొనర్చియుఁ బెచ్చుపెరుఁగుమచ్చరంబు లిచ్చలం బాయక తదీయకోదండదండంబు ధరణీమండలంబునం దుండుట యెఱింగి ఖండించుటకుఁ బంతగించుకొని యేతెంచిన లతాంతశరవసంతులకరణిఁ, దెఱగంటి కలువకంటు లెటువంటి యొప్పులకుప్పలైన దెప్పపాటు వాటిల్లక చూపుటారపులం దరిదిద్దోఁప దని తత్పరివారపారిప్లవేక్షణాకటాక్ష వీక్షణప్రేక్షణీయు లగుటనై జగతి నవతరించిన జయంతనలకూబరులహావణిక, మహీంభర త్రణగ్రాహీకృతమహానీలశకలబృందంబు లగు చికురబంధంబులును, సౌగంధికవనీశాంధవస్తనంధయకుటిలతాచపేటీపాటవనిరాఘాటంబు లగులలాటంబులును, జాంబూనదరసవిలిఖితశ్రీలకు సవర్ణంబు లగుకర్ణంబులును, ధనుర్లతల వంపుదింపులకుఁ దెచ్చుకోమరుగల కనుబొమలును, గమలదళవిదళనావహచరిత్రంబు లగునేత్రంబులును, నపత్రాకృతిభరితచాంపేయకళిక లగునాళికలును, ముకురనికరాపిధానకరవైశద్యవిశాలంబు లగుకపోలంబులును, బింబఫలకదంబకమదంబున నతనుఘోటధాటినుద్ఘాటించు కావులకుఁ దావు లగుమోవులును, నవీనకుందకోరకతపశ్చారకారకోదంతంబు లగుదంతంబులును, ననౌపమ్యావాహానానుకూలహిబుకంబు లగు చిబుకంబులును, పర్వదినశర్వరీమాత్రపరిపాలితాఖండమండలపయోరుహాభియాతిస్మయావలోకనస్మితోన్ముఖంబు లగుముఖంబులును, శంఖసంఘాధికదరత్వ సంపాదన ధురంధరంబు లగుకంధరంబు

లును, సమదవేతండశుండావితానచాంచల్య దానసన్నాహం లగుబాహులును, జగదభయవితరణశరాసనాకర్షణపురస్సరణసంజనిత కీర్తిపుంజమంజిమవిశంకాకారి హీరకంకణాలంకృతప్రశస్తంబు లగుహస్తంబులును, విపులతరకవాటవిఘటనాతిదక్షంబు లగువక్షంబులును, సింహాసంహననత్వయాథార్థ్య బోధావధాను లగుకౌనులును, జలభ్రమిమావిభ్రమప్రదాయిగంభీరిమాభిశోభి లగునాభులును, నంతరీపంబుల నకూపారంబుల ముంపఁజాలు నతివర్తులాకృతిఘనంబు లగుజఘనంబులును, సకలభువనజలజనయనామానవప్రవిర్భేదనప్రోద్యమాన శిలికేలిసీరమణపాణికీలితగదాయుధానుకారచారువు లగునూరువులును, సంతతస్పర్ధాధురీణతూణీరజాతానీతశరసంఘ లగుజంఘలును, నభినవప్రవాళమ్ముల నధ్యుషితసాలమ్ములుగావించు చంచదారుణ్యశరణమ్ము లగుచరణమ్ములును, మెఱయ సదయగమనంబులతో యాగభాగంబులకుఁగా మున్ననుశ్రుతచ్యవనజటిలధారేయు లగునాశ్వినేయు లన గాధేయు వెంబడి నడచు నభిరామలక్ష్మణు లగురామలక్ష్మణు లాత్మీయరామణీయకనిరీక్షణ క్షణత్వరాసమారుహ్యమాణకాంచనప్రాసాదమంచోపరిప్రవేశ పౌరకాంతోదరీనికాయదృక్కోణరుచిగణవిసార్యమాణదరవికసదుత్పలపలాశవర్గం బగురాజమార్గంబు నంక్షితలకలితహలకులిశకలశతామరసచామరపతాకాతపత్రాదిరేఖాంకంబుల నలంకరించునవసరంబున 98

— • రాముఁడు శివునివిల్లు విఱుచుట • —

సీ. ఘనరేఖతో ఘనాఘనరేఖ చెలి గాఁగ మెఱుఁగుఁజామనిచాయమేనివాని
రాజీవపత్రేందిరాజీవదాయి గ దోయి నాఁ జనుకన్నుదోయివాని
రాకాకమాసోదరాకారసౌందర్య మోముచక్కనిముద్దుమోమువాని
యుగలీల నిభహస్తయుగలీలలితరీతి కేలికయగు కేళికేలివాని

గీ. దరముచెలువంబుఁ దఱుముకంధరమువాని, నరరి నురరీకరించు పేరురమువాని
రాము సౌమిత్రిమైత్ర్యభిరాముఁ జూచి, పౌరులు భజించి రక్షిసాఫల్య మపుడు.

మ. పొలయల్క న్మడిగొన్నభూమిజనతద్భ్రూవల్లి చే మారచా
పలతాటంకృతి దోఁప రాముఁ డది సైఁపం జాలియో శూలిబ
ల్విలు మోపెట్టి తదీయ భంగసమయావిఖ్యాతనాదార్తిదై
త్యులఁ దార్ప న్మునివెంట నేగ నిమిషంశోత్తంసునాస్థానికిన్. 100

గీ. ఏగి తనరాక విని మున్న యెదురుకొన్న, జనకువినపర్య గన్న యామునులమిన్న
కన్నుసన్నఁ దదానీతకార్ముకం బు, తంను గీలించె డాకేల బెండులీల. 101

మ (1) ధనువంశం బది విష్ణువంశ మగునాధానుష్కధౌరేయుచే
మనువంశంబుగలిగ్ గుణోన్నతి వహింప న్నొంచి యంత న్విదే
హనరేంద్రాత్మజమానసంబుక్రియ వేగాకృష్టమై లేఖలో
కనికాయాద్భుతమదంబు కైవడి విభగ్నం బయ్యెఁ జిత్రంబుగన్. 102

సీ. ప్రతిపక్షవిక్షోభశితపక్షవిక్షోభకరుణాంబుదకదంబగర్జ యనఁగ
భుజమందిరాసాది విజయేందిరాదాన సమయపుణ్యాహఘోషం బనంగ
మహీకుమారీకరగ్రహణసంఘటిత మాంగళికసంగీతవాఖరి యనంగ
నాసురాన్వయజిగీషాసముద్యతమహాప్రస్థాన భేరికార్భటి యనంగఁ

గీ. చండకరవంశమండనోద్దండబాహు, దండకృతమండలీకార ఖండితేందు
ఖండకోటీరకోదండకాండరవ మ,జాండభాండంబు గుమ్మని నిండికొనియె 103

క. జనకుం డంతట రఘుపతి,కిని సీతకుఁ బెండ్లి సలుపఁ గృతనిశ్చయుఁ డై
తనుఁ బిల్వఁబంప మిథిలకుఁ జనుదెంచెం బఙ్క్తిరథుఁడు సమనోరథుఁ డై 104

సీ. కననోఁచుతిలక మెవ్వనికీర్తి నప్సరస్తోమసంగీతగోష్ఠీముఖంబు
తలిదండ్రు లనుబంధములకుఁ బాలయ్యె నెవ్వానిచేఁ బరతత్త్వ మైనవేల్పు
మరియె రాజన్వతి యనఁగ నెవ్వనివంక మున్నీటిమొలనూలి ముద్దరాలు
దురమునం దరిజాతదుర్దశ విడుచు నెవ్వని కేతుదశ చూచి వజ్రపాణి

గీ. అట్టియజుపట్టి కెదురుగా నరిగి పురికిఁ, దోడుకొని తెచ్చి రతనపుదొడ్డనగరి
కటి విడిది చేసి తలఁప శక్యంబు గాని, యులుప వట్టించి నిమివంశతిలకుఁ డంత.

మ అనుజుం డైనకుశధ్వజుఁ జితసుధన్వావాప్తి సాంకాశ్యప
ట్టనరాజుం బిలిపించి యాఘనుఁడు తోడ్కొని రా నయోధ్యాధినే
తనికేతంబున కేగి యున్నయెడ మార్తాండాన్వయాచార్యుఁ డి
ట్లను బాంధవ్యకథానుబంధమధురవ్యాహారధౌరంధరిన్. 106

మ మను విక్ష్వాకు భగీరథుండు రఘువు న్మాంధాతయు న్మున్నుగాఁ
గ ననేకు ల్గలరే కదా రవికులఖ్యాతుల్ నృపుల్ తత్ప్రసి
ద్ధి నవీనోన్నతిఁ దాల్చు పఙ్క్తిరథుఁ డుద్దివ్యోపకృద్ధన్విక
న్నుతశ్లాఘ్యులు రాముఁడున్ భరతుఁడున్ సౌమిత్రులున్ భూవరా. 107

---

(1) ధనుర్వంశమనుట యపప్రయోగము.

ఉ. ఈవనజాతబంధుకులుఁ డీనిమివంశ్యునితోడి బాంధవ
శ్రీవచరింపఁ జూచుట శచీధవుఁ డీశుఁడు వీయమందిన
ట్లై వెలయించు నింకఁ గన నానగభేదనశక్తి రామునం
దావహిలు న్మహీదుహితయుం దగు నింద్రజయానుకూల్యముల్ 108

ఉ వింట గుణంబు గూర్చి రఘువీరుఁడు పంటవలంతి గన్నవా
ల్గంటిఁ బరిగ్రహించుక్రియ లక్ష్మణుఁడు న్నిజకీర్తిసంపద
న్వేంటికి సద్గుణాప్తి యొదవించుటఁ జేసి వరించుఁగాక నీ
యింటనుమించుమించుమహిపియించు నిభోర్మిళ నూర్మిళ న్నృపా. 109

క. భరతుఁడు శత్రుఘ్నుండును, వరియింతురు భవదనుజభవల మృదులవచ
స్సురభిలకాండవి మాండవి, ధరణీశ్రుతకీర్తి యనఁగఁ దగుశ్రుతకీర్తిన్. 110

— * శ్రీరామలక్ష్మణభరతశత్రుఘ్నులవివాహసన్నాహము * —

గీ. అని వసిష్ఠుఁడు తనయోపయామలగ్న, నిర్ణయ మొనర్ప సాకేతనేతవిడిది
వెడలి నిజగేహమున కేగి వీడలంక, రింప మిథిలేశ్వరుండు సాటింప నపుడు. 111

చ అలికిరి కస్తురిన్ గృహము లన్నియుఁ గుడ్యము లెల్లఁ గుంకుమం
బులు గొని పూసి రెల్లకడ ముగ్గులు వెట్టిరి క్రొత్తముత్తియం
బుల మఱి వీథివీథులను బూన్చిరి పచ్చలతోరణంబు లి
చ్చెలువునఁ బట్టనంబుఁ గయిసేసిరి పౌరు లనేకవైఖరిన్. 112

చ తొగచెలితాలిజోలి హిమతోయముఁజిల్కఁ గిరీటిపచ్చతా
నిగనిగ లల్క ముత్తియపువిగ్గులు ముగ్గులు వెట్ట దట్టపుం
బగడపుఁజాయ జాజు నినుపం గనుపట్టు విదేహరాజు హా
న్నగరునకుం బరిష్కరణనాటిక లేటికి మాటిమాటికిన్. 113

— * మంగళస్నానవర్ణనము * —

వ. అనంతరం బంతరంగసంగతానందుం డగుశతానందుండు పరిణయోచితా
భ్యుదయకాలికకరణీయంబు లాచరించి పంచశరవీరసంచాలిత సువర్ణపాంచా
లికల పోలికల మేలికలం గీలుకొను జనకజాదిబాలికలం గైసేయుం డనినఁ
దదీయాలిక లగువిధుకలాలికలు లాలికలగుచుఁ దొలుదొలుత జగతీకుమారిం
గూరిమిం జేరి రయ్యెడ. 114

సీ. సిరసంటె జవ్వాజిచే నొక్క మృదుపాణి జలకమారిచె నొక్క జలదవేణి
తడియొత్తె జిలుగుపావడచే నొకమిటారి కట్టె నంశుక మొక్క కంబుకంఠి
ననదండ నిమ్మకీల్జడను జుట్టె నొకబోటి దిద్దెఁ జిత్రక మొక్క ముద్దుగుమ్మ
యలఁదె గంధము నొక్క హరిచందనామోద తొడిగెఁగంచుళి నొక్క పడఁతిమిన్న
గీ. తీర్చెఁ గాటుక నొక్క యిందీవరాక్షి
మెత్తె లత్తుక యొక్క చాంపేయగంధి
పూన్చె మణిభూషణము లొక్క పువ్వుఁబోఁడి
చూపె ముకురంబు సతి కొక్క సొబగులాఁడి 115

క. సతు లట్లూర్మిళ మొదలగు, లతకూనల కతులమంగళస్నానాలం
కృతు లొనరిచి హిమభూభృ, త్పతిసుతకడ నిలిపి రంత దశరథునగరన్. 116

మ. అలివేణు ల్రఘుసూను మాంగళికపీఠాసీనుఁ గావించి ము
న్నలికంబందు శుభాక్షతంబు లిడి కల్యాణీజను ల్శోభనం
బులు వాడ న్సిగఁ జుట్టియున్న తళుకుంబోండ్లామెతు ల్విడ్చి కుం
తలము ల్దువ్వి తలంటి రింపుగులుక న్సంపంగి తైలంబునన్. 117

గీ. మలయజోద్వర్తన మొనర్చి మరకతంపుఁ, గొప్పెరల వాసనజలంబుఁ గుందనంపు
బిందియలఁగొందఱిందీయనిందుముఖులు, జలకమార్చిరి మనువంశతిలకమునకు.

సీ. కలువరాజిగిమిన్న చలువ దువ్వలువచేఁ దడి యొత్తి రధికసౌందర్యనిధికి
వలిపె హొన్నంచుదోవతియు సౌవర్ణాంబరముఁ గట్ట నొసఁగిరి రాఘవునకు
పసవంపుఁ గిరవాదివిరిసరుల్ చికురబంధమున నిండఁ జుట్టిరి దాశరథికి
ఘనసారహిమవారికలితకుంకుమపంక మలఁదిరి తరణివంశాబ్ధిమణికి
గీ. మకరకుండలకేయూరమకుటహార, కాంచికాదామకటకోర్మికానికాయ
గండపెండార*ముఖపరిష్కారనివహ, ముదితలు ఘటించి రఖిలదేవోత్తమునకు.

మ కలకంఠీమణు లీగతి న్రఘుపతిం గైసేసి యారీతి మాం
గలికాభ్యంజనమజ్జనాచరణలం గైసేయఁ బాటీరపం
కలతాంతాభరణానుకారితచలత్కల్పావనీజాతరీ
తులఁ గావించిరి లక్ష్మణున్ భరతు శత్రుఘ్నున్ బ్రమోదంబునన్. 120

చ. పరికరచారులీలఁ గనుపట్టెడు పెండ్లికొమాళ్ల కంబుధీ
శ్వరుసతి యింద్రురాణియు నివాళిక నెత్తు పసిండి వెండిప

* గండపెండారము ఈ తెనుఁగుపదము సంస్కృతసమాసమధ్యమున నిముడ్చఁబడినది. దీని సాధుత్వము చింత్యము.

క్షీరముల రేఖఁ దత్సమయలేఖవిరోధివిదారిదోర్యుగ
స్ఫురదరిపాంచజన్యముల పోల్కిఁ రవీందులు దోఁచి రంతటన్. 121

సీ. పంచధానిరవద్యభద్రవాద్యవితాన మానందముఖరాబ్ధి ననుకరింపఁ
గరదీపికాకోటి ఘనతరతారకాపటలీవిలాసమ్ము పరిభవింపఁ
బాదచారినరాధిపకిరీటసందోహ మబ్జకోరకభావ మభినయింప
మౌక్తికచ్ఛత్రచామరదామరచ్ఛాయ కౌముదీరేఖ వైఖరిఁ ఘటింప
గీ. గురుకవిబుధానుసరణి సోదరులు దెలుప, నక్కినగజంబు గగనంబు నెక్కు గొలువ
నయనపర్వదరుచిసాంద్రుఁ డయిన రాము, చంద్రుఁ డాగి వచ్చె జనకుహాజారమునకు.

చ. ఇనకులుఁ డాహజారమున నేనుఁగు డిగ్గి యనుంగు మంత్రిసూ
నుని కయిదండ గైకొని తను న్నిమివంశవరుం డెదుర్కొనన్
మినుకుటొయారిపాదుకలు మెట్టి నివాళి మిటారు లెత్త శో
భనపువితర్దిఁ జెంది మధుపర్కము నంది వసించు నయ్యెడన్ 123

ఉ. మేను తళుక్కు రంచుఁ దొలుమించు నడం జనుదోయి రాయిడిం
గా నసియాడ నందియలు గల్లనఁ గీల్జడ పార్ష్ణిరంగసీ
మానటియై రహింపఁ దెరమాటునకున్ మరుదంతి నీటునన్
జానకి వచ్చె నెచ్చెలులు సందడిఁ గ్రమ్మ నొయారి నెన్నడన్. 124

క. శతపత్రహితాన్వయువి, శ్రుతునకు "నారాయణస్వరూపవరాయ
ప్రతిపాదయామి తే" యని, సుత జనకుఁడు దారవోసె సూనృతసూక్తిన్. 125

గీ. రతియు మదనుండుఁ బ్రణయవిగ్రహముఁ బూని
యుత్పలపయోజశరము లొండొరులమీఁద
నేయుక్రియ జానకీరాఘవేశు లప్పు
డిరువు రొనరించి రన్యోన్య వీక్షణములు. 126

మ. తనక్రేఁగంట, రహించు తుంటవిలుతుం దండించె నేయుగ్రుఁ, డా
యనవిల్ ద్రుంచితి వెంత జోద వనుచున్ హర్షించి వైదేహి రా
మున కచ్చోఁ దలఁబ్రాల్ నెపంబు దొలఁక న్ముక్తాభిషేకం బొన
ర్చె నుదంచద్ధ్వనిఁ గంకణంబులు ప్రశంసింపం గృతజ్ఞత్వమున్. 127

క. అంగజశంఖజయశ్రీ, కిం గట్టుదుఁ బట్ట మనెడు క్రియ నాసీతా
శృంగారిణికంఠంబున, మంగళసూత్రంబు గట్టె మనుకులుఁ డెలమిన్. 128

గీ. కడలికట్టువనికి గరిడిసాదనవీధి, కిది యటంచుఁ దజ్ఞు లెంచుకొనఁగ
జనకరాజకన్యయును రామభద్రుండుఁ, గట్టి రథికమైత్రిఁ గంకణములు. 129

చ. తెలిగనుదోయి చెందొగలతీరుగఁ దాంతవతంసితాసితో
త్పల యగుహోమధూమ్య పయిఁ బర్వ ఘనంబున నత్తమిల్లు న
త్తొలుకరిమించు మించునలతొయ్యలి దోయిట నుంచి నించులా
జలు వడగండ్లు గాఁగ శిఖావళితో నటింపఁగన్. 130

చ. తనకులకర్తమిత్ర మగుతామరచెల్వు హరించుకొన్న క్రము
చ్చున కతిరోహితత్వ మిటు చొప్పమనే యని పట్టుకొన్నపో
ల్కిని మిథిలాధినాథసుత కేల్నిజపాణిఁ బరిగ్రహించె న
య్యినకులసార్వభౌముఁడు సమృద్ధతరప్రణయాభిరాముఁడై. 131

మ. నగము న్మన్నుగఁ దన్నిఁ గ్రొన్ననలు ఘ్రాణంజేయునీయంఘ్రి దా
య గరీయం బగుత్రాయి తా నలరుటే యాశ్చర్య మంచు న్నఖుల్
పొగడ న్సిగ్గు వహించు భూమిజపదంబు న్రాఘువుం డంటి గో
ళ్లగుమిం బువ్వగమిన్ భజింప నవెక్కట్టించె హస్తంబునన్. 132

క. మింటం దోఁచునరుంధతి, యింట న్మెలఁగెడు పురోధ కిల్లాలఁట క
న్గొంటిమి తత్సతి నున్నతి, గంటి మనుట యెంత వింత కాకుత్స్థులకున్. 133

గీ. అమరనగకోటి నైనఁ బర్యాప్త మాధ, నాంబర వితీర్ణికా వివాహంబునం ద
నంతకల్యాణగుణహేతు వైన రాము, సన్నిధిమహోత్సవం బట్లు సాగెఁ గాక.

ఆ. లక్ష్మణు లగునూర్మిళాలక్ష్మణులలోభ, రతులు మాండవీభరతులు నఘవి
జఘ్నులు శ్రుతకీర్తి శత్రుఘ్నులును నట్లు, పరిణయార్హకృతులు జరపిరంత. 135

మ. నవఁబోణుల్ రతనంపుఁ బళ్లెరముల న్వాల్యోదనం బాల్పుఁ బ
ప్పును శాకంబులుఁ బిండివంటలు ఘృతంబుం బాయసం బానవా
లును బచ్చళ్లు రసావళుల్ దధి మొద ల్వువ్వం బమర్పంగ భో
జనము ల్బంధుజనంబుతోఁ జలిపి రైక్ష్వాకు ల్సభార్యాకులై 136

చ. హరిహయువిస్మయావహరమాధికుఁ డాజనకుండు ముద్దుఁ గూఁ
*తురుల వివాహము ల్జగతుల్ గొనియాడఁగ నిట్లొనర్చి య
ల్లురకరణం బొసంగె హరులుం గరులు న్రథము ల్ధనమ్ము లా
భరణము లంగనామణులు పట్టుపరీమళవస్తు లాదిగన్. 137

* తెలిచిక్కని యిట్లు ప్రయోగించుచున్నాఁడు

గీ. ఈగతి విదేహపతియింటఁ గృతవివాహు, లైనతనయులతోఁ గూడ నతనివీడు
కొని దశస్యందనుం డంతఁ దనదుపురికి, నడచు నెడ నొక్కనాఁటి పైనంబునందు

సీ. తను వెల్ల నిండి యాదలకు నెక్కిన రౌద్రరసము కైవడి జటారాగ మమరఁ
జేఁజిక్కి కృశియించు రాజన్యయశము వైఖరి జపస్ఫటికాక్షసరము దనర
నగభేది యనెడు చిహ్నంబుఁ దెల్పెడి జాడ గండగొడ్డలి భుజాగ్రమున మెఱయ
మరు గెల్చి యావీరవరు విల్లఱుత వైచికొనినట్లు జందెంబు కొమరు నెఱప
గీ. హారకుధరశృంగతుంగవంశాగ్రరంగ, నానటత్కీర్తినర్తకీనటనపటిమ
వర్ణనోదీర్ణతద్గృహాద్వార్గవుండు, మార్గమున కడ్డమై తోఁచె భార్గవుండు 139

గీ. తోఁచుటయు గుండె కదుఁ బాచుపాచుమనఁగ
భృగుసుతుఁ డమందగతిధుర్యుఁ డగుట గనియు
వినియు నెక్కడి నడివచ్చె వీఁ డటంచు
దిగులుపడి పఙ్క్తిరథుఁడు చింతింపఁ దొడఁగె 140

శా. ఈతో యేమి లలాటనేత్రుఁడు నహాహా యీధన్వితోఁ డర్క గుహా
వ్రీడాదాయి భుజాబలుం డితఁడు మున్ త్రిస్సప్తకృత్వోరణ
క్రీడాకృత్తరిపుక్షమాధిపవపుఃకీలాలవారాశి నీ
రేడాతొక్కతరాలవారలకుఁ దా నీఁడా నివాపాంజలుల్. 141

శా. ముల్లోకంబులుఁ దల్లడిల్లు నిపు డీముంగోపి కేనుంగుతోఁ
జెల్లాడం జనుబాలులీల నితనిం జేష్టించినం గీడు వా
టిల్లుం గాదని వేఁడుకొన్న మదిఁ జండించుం గదా వీనికిం
దల్లిం జంపిన దుండగీనికి దయాదాక్షిణ్యము ల్గల్గునే. 142

శా. ఐన ట్లయ్యెడుఁగాక వేఁడుటయ కార్యం బంచు నర్ఘ్యాదిపూ
జానిర్మాణ మొనర్చు పఙ్క్తిరథభూజానిం గటాక్షింప కో
హో నారి స్మదనారిధర్మమునకు న్యోజించినాఁ డెవ్వఁడో
వానిం జూతముగాక యిప్పు డని గర్వగ్రంథియై ముందటన్. 143

చ. నిలిచిన భార్గవుం గని మునిప్రవరుం డని తేరు డిగ్గి యం
జలియొనరించు రాఘవు నిశాటకులద్విపఝాటకూటపా
టలకరబాణలాఘవుని గన్గొనని గ్గరుణాబ్జపత్రబా
హ్యాళిఁ బచరింపఁ జూచి తలఁపూఁచి యతం డతిచండిమోద్ధతిన్. 144

శా. నీవా రామసమాహ్వయుండవు! జను ల్నిన్నేకదా మన్యుర
క్తావైచక్షణి భీరువుం డురములో ఖండించినాఁ డందు రో
రీ విశ్వాధికధర్మనిర్మథనపారీణప్రచారుండవై
నా పై వెక్కుడి రాచబిడ్డఁడవురా నారీతనుత్రాన్వయా! 145

చ. శివు దృఢముష్టిచే నొగిలి శ్రీహరికోపరసాబ్ధిమగ్నతం
జవికినప్రాఁతవి ల్లొకటి సద్మమునం దిడికొన్న మీవిదే
హవిభుఁడు దాని నెక్కుడుట యాత్మజఁ గోరి రయోనర్ప నిప్పుడా
చిపుకుచిదారపుంధనువుఁ జీల్చుట కింత మదింప నేటికిన్. 146

శా. నీలా విందునఁ గానవయ్యెడు మదానీతోగ్రచాపంబుఁ గెం
గేలం గైకొని మండలీకరణశక్తిం జూపెదే యంచు వీ
రాలాపంబు వచింప నారఘువరుం డావిర్భవన్మందహా
సాలోకంబున సన్నసేయుడు సుమిత్రానందనుం డిట్లనున్. 147

మ. జననీకంఠవిలుంఠనాచరణమో శస్త్రాస్త్రభృద్బ్రాహ్మణ
ర్తనమో మత్తనిశాచరీవధ మఘత్రాణంబు లుగ్రస్ఫుర
ద్ధనురాకర్షణనైపుణంబును మహత్త్వంబై విజృంభింప ని
మ్మనువంశప్రభవాగ్రగామి యగు రామస్వామికిన్ భార్గవా! 148

శా. ధానుష్కోన్నతి చెప్పఁదీరునె మునీంద్రా మేరువో మందరం
బో నీచాపము దాని బైసియు నీక న్నోపెట్టఁగాఁ గాననో
నే నింతే మది కింతలోఁ బదటమా యీవట్టి యాడ్ధత్యమే
లా ని న్విప్రత చూచి కాచితి దురాలాపంబు చాలింపుమా. 149

చ. అనుడుఁ బరశ్వథాయుధుఁ డహంకృతిఁ జేతికి నిచ్చినట్టి వి
ల్లనకడకంటిచాయ మణిధన్వత గన్పడ నెక్కు వెట్టి సం
జనితగుణధ్వనిస్తనితసంగతి నొప్పె ఘనాఘనంబు పో
ల్కిని నరపుంగవుండు నరలేఖశిఖావళికోటి రంజిలన్. 150

క. భజియించిరి నమ్రత్వం, బజతనయ తనూజ భుజసమర్పితగుణులై
త్రిజగన్నుతి గలభృగువం, శజనిం దగు చాపదండ జమదగ్నిభవుల్. 151

క. ఋజు వగుచాపము వక్రత, భజియించుట వక్రుఁ డైన భార్గవుఁ డంతే
ఋజుతం గనుటయు భరతా, గ్రజయుగపత్ప్రాప్త గుణతకతమునఁ గాదే. 152

గీ. మునితిలకుఁ డంతట నమోఘ మనుకులీన, మార్గణ నిరుద్ధ సౌవర్గమార్గుఁడయ్యెఁ
దద్గతిఘ్నవిఘ్నకృత్యమునఁ దోఁచు, ఫలము చేసేత ననుభూతి సలిపె ననఁగ

వ. అంత సంక్రాంతం బైనజామదగ్న్యశక్తి సంపత్తిచే సంపన్నుండును పన్నగ
పరిబృఢ భోగసాభోగ భుజాభిరాముండు నగు రాము నాలింగనంబు సేసి
మూర్ధంబు నాఘ్రాణించి దశరథుండు కరితురగపురస్సరరథుం డై పరిషుయుం
బలెఁ బరిసరంబునం బ్రవహించు సరయూతరంగిణిచేఁ బరీతం బగు సాకేతం
బును సదారు లైనదారకుల సాదరంబుగా నవలోకించు పౌరపురంధ్రుల
నీరంధ్రిత గవాక్షంబు లగుకటాక్షంబులచేఁ బింఛాతపత్రాయమాణ ధవళా
తపత్రుం డగుచుం బ్రవేశించె 154

ఉ. సారతరత్రపాభరవశంబున గూఢమనోజవిక్రియా
భారవిశేషతా జనకపార్థివకన్యలఁ గూడి సంతత
స్ఫారసుఖానుభూతి గను పఙ్క్తిరథాత్మజులన్ భజించె శృం
గారము యౌవనస్ఫురదగారము ధీరనుతప్రచార మై. 155

మ. కుటిలారిద్విరదావళీవిదళనక్రూరాసి*పారీంద్ర కై
యటకామారిలతాపిలాది బహుశాస్త్రాభిజ్ఞ ఋగ్వేదివేం
కటనారాయణసత్కవిప్రముఖసంఖ్యావన్నరాళిచ్ఛటా
పటువాగారభటీవిభాసురసభావద్భాకరాహస్కరా ! 156

క. అనుదినసురభిస్రక్చం, దనఫలదానక్రియాభినందితనానా
జనపదవసుధానిర్జర, వినుతకళాభోజరాజ విభవబిడౌజా ! 157

మాలిని. మదనజనకరూపా మంజుధర్మానులాపా !
వదనవిజితచంద్రా వైభవశ్రీమహేంద్రా !
పదనతరిపురక్షా పండితోద్యత్కటాక్షా !
కదనజయధురీణా గానవిద్యాప్రవీణా ! 158

గద్యము. ఇది శ్రీమదుమామహేశ్వరవరప్రసాద సమాసాదిత సరసకవితావిలాస
వాసిష్ఠవంశకీర్తిప్రతిష్ఠాసంపాదక ఋగ్వేదికవి తిరువేంగళార్యకలశరత్నాకర
సుధాకర జగద్విఖ్యాత కవిరాజకంఠీరవబిరుదాంక వేంకటాచలపతిప్రణీతం
బైన చంపూరామాయణం బనుమహాప్రబంధంబునందుఁ దృతీయాశ్వాసము.

ఇది బాలకాండము.

* పారీంద్రము = పాము-సింహము.

శ్రీరస్తు.

# చంపూరామాయణము.

## చతుర్థాశ్వాసము.

— • అయోధ్యాకాండము • —

క. శ్రీవెల్లంటికులాధిప, సౌవస్తిక విప్రభక్తిసంపన్నమనీ
షావిర్భావ నిషేవిత, కావేరినృపాలచంద్ర కసవనరేంద్రా 1

చ. పరదురవాపబాహుబలభాస్వరుఁ డుత్తరకోసలావనీ
శ్వరుఁడు శచీశ్వరుం దెగడువైభవ మొప్ప ధరిత్రి యేలుచున్
భరతుని లక్ష్మణావరజుఁ బంచె ముదంబునఁ గైకయాతలో
దరికి సహోదరుం డగుయుధాజిదిలాధిపురాజధానికిన్. 2

— • దశరథుఁడు రామునకుఁ బట్టాభిషేకము చేయఁ దలఁచుట. • —

శా. అంత న్విశ్వభరస్వయంవహభుజోదంతు న్విదేహాత్మజా
కాంతుం గోసలమాత్రధాత్రికిఁ బతిం గావింప రా జాత్మలోఁ
జింతించెన్ జగమెల్లఁ దాల్పఁగల తేజోగట్టువజ్రిని నై
కాంతస్తంభధురంధరత్వ మెనయించంబూనుచందంబునన్. 3

క. చింతించి తనదుకోరిక, మంతుల కెఱిఁగించి గురుసమానవయశ్రీ
మంతు లగునాగరకధీ, మంతులఁ బిలిపించి పలికె మధురతరోక్తిన్. 4

సీ. ఆచక్రవాళక్షమాచక్రధౌరేయు లాజన్మశుద్ధవృత్తానపాయు
లాచండకిరణాజహాదఖండభుజశౌర్యు లామనుస్థిరతరన్యాయధుర్యు
లాపురందరగోపకోపపాదితవార్త లాబ్రహ్మభువనవిఖ్యాతకీర్తు
లాస్థాణునారాయణాస్థానమ్మృతదాను లాకకుత్స్థపరిస్ఫుటావదాను
గీ. లైనమాపెద్దలచరిత్ర మతివిచిత్ర, మనుచుఁ గొనియాడుకొనఁ జెల్ల దందుకెల్ల
షష్టిసాహస్రకములు మజ్జనకు వెనుక, రక్షణముగన్న మీరెపో సాక్షు లెన్న. 5

క. వేదము మీయంగీకృత, వాదము లోకత్రయానివారితనిజమ
ర్యాదము గావున నది యౌఁ, గాదనరు గదా నిజంబు గాఁ దనరుఁ గదా 6

సీ. దోషాచరీహారదూరీకృతిఘటించు నతిరథత్వమునను నాఁపరాక
ఖలనృపాలకళత్ర ఘనసారచర్చఁ బోనిడు హేతివాడిమి నడఁగఁబోక

వైరివీరముఖేందువైవర్ణ్యరచనానిదానోగ్రసేనకు లోనుగాక
యాచకశ్రేణిదైన్యంబు వెల్వలఁబాటు హరియించు ధనముచే హానిలేక
గీ. తేఁటిలేబోఁటిగమికిఁ బూఁదేనెసోన, విందు సవరించువికచారవిందవాటి
నిందుపున్నమనాఁటివెన్నెల యనంగ, నెరసె జర మేన సిరసును నరసె మాకు 7
ఉ. కాన భవన్మతం బగునొకానొకవల్కి వచింతుఁ బార్థివో
ద్యానవినాశకృత్వరశుధారు జయించినవీరు సజ్జనా
ధీనవిహారు మేరుగిరిధీరు మదగ్రకుమారు నేనిఁకన్
భానుకులాధిరాజ్యమునఁ బట్టముగట్టి వహింతు నూఱటన్. 8
మ. అనుసీతాదయితాభిషేచనకరవ్యాహార మారాజసిం
హునివంకన్ విని నాగరోత్కరము వర్షోద్యోగజాగ్రద్ఘనా
ఘనఘోషశ్రవణక్షణాకలితకేకానిక్వణోత్సేకకే
కినికాయంబుగతిం బ్రమోదసినదాకీర్ణాఖిలాశాంతమై. 9
క. వనజోద్గతమధునిభవ, స్త్రీనటన్నోదాశ్రు వయ్యె రఘుపతినభిషే
చనబహుగుణితద్యుతి గనుఁ, గొనుటకుఁ గనుదోయి గడుగుకొనియెడుభంగిన్.
మ. మనువంశాగ్రణి జాగ్రదగ్రసుతసామ్రాజ్యాగమప్రాజ్యమ
జ్జనసమ్మర్దజ భూరజఃపరిజిహీర్షాచుంచురోమాంచకా
యనికాయప్రకృతిప్రజద్విగుణజాతానందముల్ డెందమం
ద నిగూహించుచుఁ బల్కె నాప్తసచివోత్తంసాళితో నత్తఱిన్. 11
ఉ. నేమవనప్రసక్తి నవనిన్ భరియింప నిదే మొకో జన
స్తోమము శైలజారమణజూటవిటంకసుధాంశుధాము శ్రీ
రాము నఖండమండలధురంధరుఁగా గణియించి నించెఁ గా
మామది కద్భుతం బనుచు మంత్రులు పల్కి రుదారచాతురిన్. 12
ఉ. ధారణి నావరించి యువదాతయశోనిధు లైనమీర లు
న్నారె కదా జనౌఘమయి నారఘునాథు శరణ్యుగా మదిన్
గోరక యున్నె యూరక చకోరక మాఁకలిగొన్నచో విధుం
జేరక చేరునే యమృతసింధువుఁ దజ్జనకత్వబంధువున్. 13
క. అనియెడు మంత్రులుఁ దారు, న్ననులపుడు వసిష్ఠుశాసనంబున నభిషే
చన సంభారాహరణం,బునకుం ద్వరపడఁగ నృపతిపుంగవుఁ డంతన్. 14

గీ. రాము వినయాభిరాము సుత్రామసదృశ, ధాము రావించి యోవత్స తావకీన
మౌళిమకుటంబుఘటియింపమామనసు యు,తిష్యమాణంబు రేపటితిష్యమందు.

చ. అని నియమించి పంచినయజాత్మజుయత్నము కోసలేంద్రనం
దన కెఱిఁగించి యాత్మసదంబునకుం జనుదెంచి యున్న య
జ్జనకసుతాసహాయు కరసారసముల్ ధృతికౌతుకంబుగా
నానరిచెఁ దత్పురీజనులయుల్లమురీతి వసిష్ఠుఁ డంతటన్. 16

మ. రఘురామోదయవార్తఁ దోఁచు జనహర్షశ్రీలకున్ గేహగే
హఘనానద్ధముఖానవద్యబహువాద్యశ్రేణు లాశాంతరా
ళఘుడంతావళకర్ణతాళపరిఖేలం గాంచు నా దావహి
ల్ల ఘటించెన్ భువనత్రయీమకుటిపై లాగెత్తునొద్ధత్యమున్. 17

— * కైక రెండు వరము లడుగుట * —

చ. హరిహయకంటకాన్వయలయావహవైఖరి కెల్ల యైన క
ల్లరి మదిరీతి మేను కుటిలమ్ముగఁ ద్రిమ్మరు మాయదారి మం
దర యనుజంత శాంతభరితం బగు కైకమనంబు దివ్యపు
ష్కరిణి విశుద్ధవారి వనకాసరి వోలెఁ గలంచె నత్తఱిన్. 18

మ. పటుఝంఝానిలవేష దోష ముదయింపన్ శీతలాంభోధర
చ్ఛటదంభోళిజనించినట్లు జనతాసౌఖ్యాపహ్నుత్యందరా
కటువాక్యార్భటి నుద్భవించె భరతుం గన్నట్టి కైకేయియం
తటసీమంతవతీశిఖామణిమతిన్ దౌర్జన్య మత్యున్నతిన్. 19

శా. ఆశాతోదరి మందరారమణి దయ్యాంబో యనం జిత్తమా
వేశింపన్ మును వైజయంతనగరోర్వీన్ శంబరాసీతబా
ధాశాంతిం బతివంకఁ గాంచినవరద్వంద్వంబు నావేళ యం
దాశించెన్ భరతాభిషేకరఘువర్యారణ్యచర్యాకృతిన్. 20

ఉ. కైకయి వేఁడుతద్వరయుగంబు నిశాతశరాకృతిం జెవుల్
సోఁకి తపింపఁజేయ మదిలో నిలఁజాలక దావపావకా
లోకము చుట్టుకొన్న వనిలోపల నుండి బహిర్వినిర్గమ
స్వీకృతి గాంచు నేణిగతిఁ జేతన వోఁ దలిమోవరిస్థలిన్. 21

గీ. వ్రాలి తెప్పిలి నరపాలమౌళి దా న, సత్యభయశీలి గావున జాలిగొలుపు
నాలి నీలితనాన కానసఁగఁజాలి, సోలి సుతుమౌలిమిఁ నాగయాలిఁ జూచి.

గీ. జాయమానస్థిరాకీర్తి జాయ మాన, వేమి నీసుతుఁడా రాజ్య మేలు మేలు
కౌతుకముఁ బన్నితిలకు నకౌతుకముగఁ, గౌతుకము* రాము వెడలనికౌతుకంబు.

క. అపరీతరామ మగుతత్రి, విపరీతము గాకపోదు విధికృతి మగునీ
యుపయమ్మవై భవ మిపుడా, యుపయమ్మవైభవ మొనర్పనున్నది యనుమా.

చ. అతివ నిరర్గళస్మితవదానన మై కితవాత్మనీన వాం
ఛితవరప్రాప్తికిం బతివశీకృతిఁ బూన్చుచు నమ్మచెల్ల యా
శ్రుతము నిరాకరించుటకుఁ జూచెద వేమనవచ్చు నింక ని
శ్రుతము వివేకపాకమును సూనృతముం మనువంశవల్లభా. 25

మ. తనమే మాంసము గోసియిచ్చిన కపోతత్రాణశీలిం శిబిం
వినవో యాశ్రితవిప్రశేఖరునకుం నేత్రప్రదుం డైనధ
న్యు నలర్కాహ్వయు నాలకింపవో వదాన్యుల్ దప్పిరే బాస ద
ప్పినఁ బాథోలిపిఁజేసె దుష్కృతముం బృథ్వీశు లూహింతురే 26

మ. అకటా యాడినమాట చెల్లుబడి సేయంజూడు మారీతిఁ జ
ల్పక కౌసల్యమనోరథంబె ఘటియింపం బూనినం దాళుకో
నె కదా నేనిఁక దారుణాగ్నిశిఖఁ గానీ నీటఁ గానీ కృపా
ణికఁ గానీ గరళంబుచే నయినఁ గానీ ప్రాణ మొప్పించెదం 27

ఉ. నావిని యీవినాదయవు నాదయితామణివా భవాదృశ
గ్రావకఠోర యొకరణి గన్య యగుం సతులందు రాముఁ డే
కైవడి నోఁచుఁ దండ్రి గలుగం సుతవంతులపోఁడి మింక మా
కేవిధి నబ్బు నీతనయుఁ డిచ్చు నివాపనివాపముం గొనం. 28

సీ. మణిమయప్రాసాదమహి మెలంగుపదంబు లడవుల నడచిన నడచుఁగాక
మడుఁగు దువ్వలువఁ బూనెడుకటీరంబు వల్కలశాటిఁ గట్టినఁ గట్టుఁగాక
కుంకుమవాసనాలంకృతం బగుఱొమ్ము బూది పైఁబూసినఁ బూయుఁగాక
పసిఁడితావొతుకుఁ బొల్పుమహాళిబంధంబు జడలుగాఁ జాలినఁ జాలుఁగాక

గీ. కైక యేమీఁకఁ బవళించు లేకలేక
కలిగిన కకుత్స్థవంశశేఖరునిమ్రోదుఁ
తను వమో యీాసు నెనయు నీమనసుకంటి
గడుసుఁదన మొందు నుపలసంఘములయందు. 29

* రాము వెడలిన కౌతుకంబు—అని యుండఁదగును.

గీ. అనెడు పతిజంకెనఁ గరంగదయ్యె నకట, మందరాక్రాంత మగుకైకమానసంబు
పూర్ణచంద్రోదయంబయ్యు భూరివీరు, దావరణ మొందుశశికాంతమనఁగనంత.

మ. పతి యాను కృతికిం బరాఙ్ముఖత దోఁపం గొంతసే పూరకుం
డి తనుంబిల్వ సుమంతు నంప నటకు న్సీతేశుఁ డేతెంచి యా
నతుఁడై ముందట నిల్చి రా జపుడు దీనస్వాంతుఁడై వర్తిలం
గత మేమీ యని భీతినొందఁ బలికెం గైకేయి నిర్లజ్జయై. 30

— * కైక రామునకుఁ దనవరములం జెప్పుట * —

మ. తనయాసక్తియు సత్యసూక్తియు విరోధంబొందఁ జింతాంబుధిన్
మునుఁగం జొచ్చె నరేంద్రుఁ డిదార నని న్మున్నొక్కచోఁ గాచి కై
కొనియుందున్ వరయుగ్మ మే నదియు నీకున్ మాండవీజానికిన్
వనచారావనిభారహేతు వన నైత్వాకుం డనుం బ్రీతుఁడై 31

మ. భరతుం డేమి తలంకునో మహిభరింపన్ రాముఁ డుగ్రాటవిన్
జరియింపన్ మదిఁగొంకునో సగరవంశస్వామికిన్ దండ్రి కీ
సరణిం జింతిలనేటికిం దనప్రతిజ్ఞాపూర్తి మావంక దు
ష్కరమై తోఁపఁగ వాసవోపకృతియో గంగాసమాసీతియో. 32

చ. నను వని గాత్రమాత్రభరణంబునకున్ నియమించి యాచతు
ర్వననిధిమేదినీభరణరాజ్యరమాగరిమంబుఁ దమ్ముగు
ట్టనితల కెత్తినావు సుకరత్వము దీన గణింప నాపయిం
గనఁబడుఁ బక్షపాత మధికంబయి నీమది కంబుజేక్షణా. 33

గీ. జనకుఁ డనుజాభిషేచననోత్సవశుభంబు, వీనులకు విందుగాఁ దానెయానతిచ్చి
మామకీనాంజలియుతప్రణామపూర్ణ, పాత్ర మున కేల కాఁడమ్మ పాత్రమనఁగ. 34

చ. కులిశనిపాతభీత మగుకొండవిధాన దవానలావళిం
దలఁకువనీవనస్పతివిధంబు దివస్పతిరాజధానికిన్
దొలఁగు యయాతితండ్రిగతి దోఁపఁగ భూపతి నేలవ్రాలపి
హ్వలపడఁబోక కైకగురునానతిఁ జేకొనుమయ్య రాఘవా. 35

క. అన దండమిడి తదాజ్ఞన్, ననదండగతిన్ శిరంబునం దాల్చి ధరా
వనమునకై రఘువీరుఁడు, వనమునకై చనుకడంక వర్తిలె నంతన్. 36

క. మను జేశునగరు వెలువడి, జననిగృహంబునకు నరిగి సవినయనతుఁడై
పినతల్లి చేతఁ దెలిపిన, విని యాకౌసల్య శోకవిహ్వలమతి యై. 37

— * రాముఁ డడవికిఁ బైనమగుట * —

చ. ధర జలజాదిచిహ్నములు దావుకొనంగ జగత్త్రయీశివం
కర మగునీకరంబునకుఁ గంకణ మూర్తినిదానకాననాం
తరతరుమూల కందఖననం బొనరింపు మటంచుఁ గట్టెనో
గురుఁ డగుశక్తితండ్రి రఘుకుంజర నిన్నటియుత్సవోన్నతిన్ 38

వ అని యిత్తెఱంగున నమ్మత్తకాశినీరత్నంబు చిత్తంబు శోకాయత్తంబుగా వర్తిల్ల నత్తఱి సుమిత్రానందనుం డమిత్రానందకుధరబృంద సంక్రందనుం డగుదశస్యందనాగ్రనందనుని తాలిమి యనెడు తూలంబున రవుల్కొనిన కోపశిఖ యాటోపంబు చూప ని ట్లనియె 39

చ కలితవివేకపాక యగునైక నయేతరవావదూకమై
తలఁచిన లోకనింద్యతకుఁ దా నవుఁ గా దనలేక యాకె మం
దులు తల కెక్క బుద్ధిచలితుం డగువృద్ధుఁడు పెక్కుసేయు మొ
క్కలివగఁ గైన మయ్యెదవు కానకు భానుకులీనశేఖరా. 40

చ ముది మది దప్పియున్న యతిమూర్ఖునకు న్నిజ మేది ? నిన్ననే
కద నినుఁ బట్ట మిర్వురకుఁ గట్టెద నన్నది యందు కింతి దన్
గదిమికొనం దలంకినది కన్నది విన్నది గాని దేమి చె
ప్పదు నిది నీతిగాఁ దలఁచుప్రాణిక నీది గణింపఁ జెల్లదే 41

చ. అడుగకమున్న నీకు నిఖిలావని తండ్రి యొసంగి యుండఁ ద్రొ
క్కడపడనేటి కుర్వరకుఁగా దొర కాశ్రమవర్ణరక్షలం
బడయుపదంబు లెంతటితపంబున లే వటుగాన దైవ మె
క్కడ వసియించుఁ బౌరుషము గల్గినవోఁ బురుషార్థసిద్ధికిన్ 42

మ అరుణత్వంబు వహింప నేమిటికి నీ యంఘ్రుల్ వనాటాట్య మ
త్కరయుగ్మంబు భజించుఁగావుత గుణాకర్షంబుచే రక్తిమన్
వరభీతుం డగుతండ్రి యాచతి నతిన్వర్తింప నీ కేటికి
స్ఫురియింపం జనుఁగాక నాథను వీడన్ నమ్రత్వ మోరాఘవా. 43

వ. అని పలుకు ననుజు నలుకయుం గలంకయుం దొలంగ సాంత్వవాదమాధురీరచితసీధుసాధురీతిలాఘవుఁ డగుచు రాఘవుం డి ట్లనియె. 44

మ జనకాదేశము భానువంశజుల కాచార్యం బగుం దండ్రివం
పున మున్నంకొనుఁడు రేణుకాతనయుఁడుం బూరుండు గోహత్యకున్

జననీహార్త్యకుఁ బ్రాయ మిచ్చుబరకుం దా రొప్పియుఁ సాధువ
ర్తనులై నా రటుగానఁ గాన కిపు డేఁ దాతాజ్ఞఁ బోకుండునే 45

గీ. అనియుఁ దమ్ముఁడు వెంటరా జననితోడఁ, గై కయీవాక్యనిశమనగ్లపితనృపతి
వపురవనభవ్యకర్తవ్య మపుడు దెలిపి, తత్కృతాశీర్వచోరక్షఁ దాల్చి యంత

చ. జనకశుభ వాద మోదభరసంగత సీతవసించుమేడకుం
జని ఘనగర్జనంబు విని శోభనటించు మయూరికిఁ ధను
ర్ధ్వని చెవిఁ దార్చు నాటవికువైఖరిఁ గాననవాసవార్తఁ దె
ల్పిన వెనుకోఁదలంచు నల్రవేయసిమాటకు విహ్వలాత్ముఁడై. 47

క. ఆననము *దగనులిపమే, రాన నముచిదమనురమణి కధికపు నీవా
కాననము మృగాస్రోగ్రవ్య, కాననము భజించుదాన వంభోజాక్షీ 48

గీ. అనెను విభువారణోక్తుల వెనుకదీయు,
దయ్యె మహికన్య సింహమధ్యాగ్రగణ్య
వనికిఁ దాదృక్ప్రియుత్సుఁ డయ్యెను సుమిత్ర
యనుఁగుఁబట్టియు హరిశౌర్యుఁ డగుట నంత. 49

చ ధనదంతావళధోరణీమణిగవాద్యం బైన యీవి న్నుయ
జ్ఞ నగస్త్యహ్వయుఁ గౌశికుం ద్రిజటు రక్షోశై త్రయాత్రాచితిం
దనిపె న్రాముఁడు మేదినీసుతయుఁ దదాసిష్ఠునిల్లాలిక
చ్చె ననేకాంబరభూషణంబులు వనీశ్రేయఃప్రయాణార్హతకా. 50

సీ దండకావిపినవాస్తవ్య మానివితానసంకటం బెడలించు కంకటంబు
శౌర్పణఖోరునాసక మాత్తికతుపారకణఖరజ్యోతి గాఁగలుగు హేతి
యచిరభావ్యబ్ధిమధ్యపురానిలింపసంపద్వ్యయం బైనచాపద్వయంబు
వలభిదాదిమతపఃఫలకాండకలనాతిశయకల్పనగ మైనశరధియుగముఁ

గీ. దెచ్చుట కనుజ్ఞ వడసి యాత్మీయపిత్ర, రాశి కోసలజాశ్రితాగ్రజున కొసఁగి
వెంట సౌమిత్రిరా రామవిభుఁడు నగరు, వెడలి సతిదానుఁ బురవీథినడుచునపుడు.

మ. అజరాడు ల్పొడగాంచఁగూడని యసూర్యంపశ్య నారాము దే
వి జనానీకవిలోకభాజనము గావింపక మదిం గొంకి పం
కజగర్భుండు ఘటించె నాగరకలోకశ్రేణికిం జూడ్కి బా
ష్పజలాకీర్ణముగా నజాహ్వయభృతభ్రాత్రాభిమానోన్నతిక. 52

* దగనుపదమేనాన - అని యుఁ పవచ్చును.

ఉ. వెండియు రాఘవుండు పృథివీపతిమణియింటికి న్సుమం
త్రుండు నిజాగతిం దెలిపి తోడ్కొనిపోఁ జని యూర్మిళాసహా
యుండు విదేహరాజసుతయున్ వనికిం దనవెంటఁ బైనమై
యుండుట విన్నవింప విపినోన్ముఖుఁ డయ్యె నతండు నయ్యెడన్. 53

క. చింతిలి సుమంత్రుఁ డాజగ, జ్జంతం గైకేయిఁ జూచి సడలందగ దే
యింతట నభిషేకనిదా, ఘాంతావగ్రహము నీదురాగ్రహ మింతీ. 54

— * సుమంత్రుఁడు కైకను నిందించుట * —

చ. మును పాకనాఁడు త్రేఁడు తవ్రులఁ బిపీలిక లాడుముచ్చటల్
విని నగ, నవ్వఁ గారణము వేఁడ నతం డది చెప్పినప్పుడే
తనువు దొఱంగుఁ బ్రాణ మనఁ దన్మృతికిన్ మతినొప్పకొన్నదు
ర్జనవికిఁ బుట్టినట్టియతిసాహసురాలవు గావె నావుడున్ 55

క. అసమంజు వెడలనడిచిన, వసుధేశ్వరుఁ డేజనాపవాదముఁ జెందెన్
దెస లెఱిఁగిన వరములకా, మునగనలని కైక నోరుమూయించెఁ బలిన్ 56

క. సరయూపాతితపౌరో, త్కరుఁ డాయసమంజురీతి దాశరథి యిఁకన్
బురివెడలుట కెంతటి ము,ష్కర వని సిద్ధార్థకుండు కైకం బలికెన్. 57

చ వనికి గురూక్తిఁ దోఁచుపరివారపుబొంద పయి న్నిరీహుఁడై
తనపినతల్లియానతిని దాల్చెఁ గటిస్థలి రాఘవుం డధి
స్తనతటనానటజ్జనకజానయనాంబుఝరాభిషేకసం
జనితదుకూలతాగుణవిశాలము వల్కలచేల మత్తఱిన్ 58

క. వల్కలధృతి నజగవహృతి, శుల్కాత్తకళత్రుఁ డతఁడు సుషమవహింపన్
నూల్కొనె జనముఖబిసకిం, జల్కతతిన్ వికృతి నిఖిలజగదద్భుతమై. 59

మ. అనఘుల్ గన్గొననోఁచు రాఘవునియాథాత్మ్యంబు భావించలే
ల నధోవల్కలదర్శనాసహనిమీలన్నేత్రుఁడై మున్ను గ
ట్టినహారాంబట్టు సడల్ప నేమికొద వుట్టెన్ గోటికందర్పమో
హానునెమ్మేని కటంచు వాక్పతిసుతుం డార్తిన్ మరల్చెన్ మతిన్ 60

క. కులగురువారితనిజవ, ల్కలధృతియై యపుడు సీత కౌసల్యపదం
మ్ములకెఱఁగి వనికి సెలవిడఁ, దెలుపన్ మది నడలి యాసతీమణి పల్కెన్ 61

చ. ఖరకిరణాతపోత్కరనఖంపచజాగ్రదరణ్యమార్గసం
చరణములన్ నిమీశకులజాత నవావతరారవిందమం

దిర వగు నిన్నుఁ జూచి వనదేవత లాత్మనిమేషకల్పనా
పరిహృతి కొఁగ్గినాఁ డనుచుఁ బంకజగర్భునిఁ దిట్టకుందురే. 62

వ. అని యనుష్ఠితానపాయవాత్సల్య యగుకౌసల్యకు సుశీలచారిత్ర యగుసుమి
త్రకుఁ ద్రిలోకీహితాచరణకార్మణవరోత్సేక యగుకైకకు విశకలితమనోరథుం
డగుదశరథునకు ననవరతనిష్ఠాగరిష్ఠుం డగువసిష్ఠునకుఁ బ్రయాణోచితప్రదక్షి
ణయుతప్రణామంబు లాచరించి కాంచనమయం బగునిశాంతంబు వెలువడి
నివార్యమాణానుసారికావారికవిశానుం డగుచు జానకీసౌమిత్రియుక్తంబుగా
నమేయగుణసముద్రుం డగు రామభద్రుండు తండ్రియానతి సుమంత్రుండు
మున్నుగాని హజారంబు చాయ కాయితం బొనర్చి తెచ్చిన మరుచ్చటులజ
వనిరాఘాటఘోటకానుషంగం బగుశతాంగంబు నుత్తుంగరంగసాను శృం
గంబు నారోహించు చంచలామణిధనురుదారధారాధరంబు డంబు మెఱయ
నెక్కి యొక్కటాఁ గ్రిక్కిఱిసి గుములుగుమ్మై వెంబడించు నాగరకసము
దయంబు పదరయంబువలన నుదయంబుఁ జెందు పెందూళి మైథిలీజాని *
లేనియారాజధాని విడుచుపుడమి వమువునం దొడరి సీత యడవికై నడచు
నెడ నిది యమంగళం బనుచుఁ దత్పౌరజానయనజాల కీలితానల్ప బాష్ప
పూరంబు దూరంబు గావింప సాంతఃపురంబుగాఁ బురంబును వినిర్గమించి
యొక్కించుక తడవునకుఁ దనరథం బతీతలోచనపథం బగుటయు వగం
బొగిలి మూర్ఛిల్లి పరిజనానీత శిశిరోపచారగౌరవానీతచేతనుం డై యజ
తనూజుండు పురికి మరలి కోసలకుమారికాగారంబు చేరి వర్తింప నిటు నివా
రింప రానిమానవపరంపరల సందడుల మందమందగమనుం డై చనిచని
వికసదరవింద సందోహశోణిమాళీకలో చక్షురాలోక దూరీకృతావగాహి
దేహి మోహాసంతమస యగు తమస డాసి వానరకరుండు తనదువనరాశి
శిగమిమ ననుకరింపక యపరవనరాశి గదియుపగిది నస్తమించుటయుఁ దత్త
టినీతట తరుతటాంచ లాస్తీర్ణపర్ణశయనాయతనరీతి నుల్లంబు పల్లవింపం
జేయ నెల్లవారు శయనించురాతిరి నిశీథసమయంబున నమాత్యునాలోకించి
వంచితజనప్రపంచవేగసంచారచారు వగు తేగు దోలించి వేగాసాదిత వేద
శ్రుతిగోమతినిషందికాహ్వయనదీత్రయాలంకృతియు నిక్ష్వాకునకు మను
వితీర్ణయు నగువసుమతిం గడచి జాహ్నవీసముద్వేలకల్లోల మాలికాను

* మైథిలీజానిమైనదావేని—అని యూర్పక.

వేలశీతలవిశాలమూలంబుగను నదూరమందాకినీసలిల శీకరాసారతోషితానేక శాఖాశిఖానిరంతరకులాయవిశ్రాంత బహువిధశకుంతవారంబును నభంగశృంగి బేరనగరశృంగారంబును నగుహింగుదీపాదపంబుచాయ నిరవుకొని యున్న సమయంబున. 63

— * గుహుండు రాముం జూడవచ్చుట * —

మ. జనిసాహస్రతపఃఫలం బితని సాక్షాత్కార మీస్వామి కై
క నిదేశింప వనిం జరింపఁ జను టాకర్ణింప శక్యంబె కా
దని తాదాత్వికమోదఖేదగుణశీతాశీతనేత్రాంబు లా
ననము న్నింప గుహుండు రాఘవునకు న్వందారుఁడై యిట్లనున్ 64

మ భటకుర్గోద్భటదుర్గవజ్జనపదప్రాజ్యంబు నారాజ్య మె
ప్పటికి న్నీది గదా చతుర్దశసమాపర్యంతముం దేవ రి
చ్చోటనే యుండి నను న్భవచ్చరణదాసుం బ్రోవరాదా మరు
త్తటినీసేవ జనన్భదర్శనమనస్తాపంబుఁ బాప న్గృపా. 65

శా * నామందాధిపుఁ డాదరింపఁదగు నన్నా రాఘవుం డంబకు
న్నే ము న్నిచ్చినమాటపట్టు సడల న్లేనా! యిఁక న్వల్కలం
బేమే నొందుటగాక రాచసాగను ల్వేట్టంగ నర్హింబె యే
లామిథ్య ల్మనువంశ్యులం దనుమఁ బల్కంగొంకె వాఁ డంతటన్. 66

సీ. హరులపగ్గము లూడ్చి యంబువు ల్గ్రోలించి సారథి దరితరుచ్ఛాయ నిలువ
మధుపర్క మిడురీతి మకరందబృందమందరిగంధవహుఁడు ముందఱ మెలంగ
వనవాసభృతనిజవ్యథ జూడలేక డాఁగినరీతి నపరాద్రి నినుఁడు గ్రుంకఁ
దనతోన సాంధ్యవందన మొనర్చినమునీంద్రులగోష్ఠి నిశఁ గొంతప్రొద్దు జరగ
గీ. ధనువు చేఁబూని భిల్లుండు దవుల నుండ, లక్ష్మణుఁడు నిద్ర సౌవిదల్లత భజింప
జానకియుఁ దాను గాంగరోధోనికుంజ, పర్ణమయశయ్య రఘుపతి పవ్వళించె.
క. మఱునాఁ డరుణోదయమున, భరితజటాభారుఁ డగుచు భాగీరథి ది
వ్యరథానుగ యగు నిమ్నగ, దరి నిలిచి రఘూద్వహుంను ధరిణిజ కనియెన్ 68
సీ. కంజాతవిమతశేఖరజటాకోటీరకాబేరవారిజాకరమరాళి
ప్రకృతికై తవగవీభరితశివాలయుఖ్యాతిధరోధత్సురక్షీరలహరి
కపిలకోపజ్వరగ్లపితసాగరసముద్ధృతనవ్యదివ్యౌషధీమతల్లి
జాతుమజ్జనకృజ్జనాతిపాతకజాతదర్దురీసందోహదందశూకి

* ప్రత్యంతరము లేక సవరింపలేదు.

గీ. ఆహరిద్వారవార్ధిపర్యంతచార, జటిహితనిమిత్తవిధికృతస్ఫటికరథ్య
యగు నది శరణ్య కృష్ణవేణ్యాదిసింధు, జలజదృగ్జాలమూర్ధన్య జహ్నుకన్య.

మ. అని మంత్రిం బురికి న్మరల్చి తరిచే నామింటిమున్నీటి జ
వ్వనిదాఁటించి గుహుండు వీడుకొని పోవన్ మత్స్యదేశంబు త్రో
వ ననేకావను లెల్లఁ జూచుచు భరద్వాజాశ్రమక్షోణికిం
జని యాతం డనుపం బ్లవోత్తరితభాస్వన్నందనావారి యై. 70

— * సుమంత్రుఁడు శూన్యరథంబుతో నయోధ్యకు వచ్చుట * —

చ. చనిచని కాంచె దాశరథి సానుఝరీతటజాతచూతచం
దనలతికాదిపాదప వితానకృతానిశఖేలనామిళ
ద్ఘనతతిగీతివిశ్రుతివిశంకటపంకజరాగధోరణీ
కనదరుణీకృతిద్విగుణగైరికఝూటము చిత్రకూటమున్. 71

ఉ. కాంచి వసించి దైవతశిఖామణి కోకిలకంఠ కాహళీ
పంచమనాదపంచశరపాటవమాఖరి లక్ష్మణప్రయ
త్నాంచితలోచనోత్సవదళాలయచాతురిఁ జెంత సీతవ
ర్తించుకతంబున న్నిజపురీవిస్మృతి న్మఱపించె నంతటన్ 72

వ. అంతట సుమంత్రుండు కాంతారవైరస్యంబున రఘువతంసంబు మరలునో యనుదురాశం జేసి శృంగిబేరనగరంబున గుహసకాశంబునం గొన్నివాసరంబు లుండి వేసరి కతిపయప్రయాణంబులఁ బరిక్షీణోత్సవప్రజాసమేతం బగు సాకేతంబు సొచ్చి దాశరథివిరహిత నిజసమాగమసంజాత శోకాతిరేక నాగరకలోక బహువిధాక్రందమందీభవన్నేమినిస్వనతరంగం బగుశతాంగంబు డిగ్గి నగరుసొచ్చి యచ్చట మహీపతికి నతి యొనర్చినఁ దనవినారఘుపతిసమాగతిం దిరోభూతచేతనుం డగుచు నతండు కోసలసుతాసుమిత్రాసమాశ్వాసితుండై రాఘవుం డేగతిం బదాతి యయ్యె, సీత యేమి యనియె, సౌమిత్రి యెట్లు మెలంగె నని చిప్పిల్లు కన్నీళ్ల నడరు గద్గదిక నసుగ మగుడ నసుగులకు నెరఁగి యి ట్లనియె. 73

క. నీరథమునకుం జోరము, నోరథమునకున్ భవత్తనుజు లెడవిరి మి
న్నేరవ్వలిదరి వని దా, వారికులై రావిదేహవరసుత కథిపా. 74

మ. కటు వై తోఁచుదురుక్తు లేమిటికి వక్కాణింతు వైరించియుం
తటి బ్రహ్మర్షి మరుద్గవీనవపయోధారాభిషేకంబు స

ల్పుటకుం జాలకయున్న కుంతలభరంబు న్నీతనూజుండు చెం
చటవిం దెచ్చిన మత్త్రిపాలఁ దడిపెఁ సాస్రీకృతోర్వీజుఁడై. 75

చ ఘనతతిఁ దోఁచుక్రొమ్మెఱుఁగుకై వడిఁ గాఱడవిం జరించు న
జ్జనకజకాల్లగోళ్ల నొకచక్కఁదనం బెదురక్తిమంబు మె
త్తనిజిగి లత్తుకయ్యె మఱి తాఁ గ్రానఁబోదు వివర్ణభావ మా
ననమున కింత యైన రఘునాథసనాథవిహారహారితన్ 76

మ వనమార్గంబున రాత్రులుం గిసలయప్రావాతంబుచే రామభ
ద్రునకుం దల్ప మమర్చి దుష్టమృగసందోహంబు రాకుండ బల్
ధను వమ్ముల్గొని కాచి యుండుట సుమిత్రాపుత్త్రుఁ డస్వప్నభా
వనకుం జొప్పడె రామసేవకుల కస్వప్నత్వ మాశ్చర్యమే! 77

క. అని సుతులయునికిఁ దన కా, యన దెలుప నృపాలుఁ డప్పు డపరాద్రికిఁ బ్రా
మిను కున్నెనగుమినుకుం, జనఁ గౌసల్యకన్ సశోకశల్యం బలికెన్ 78

క. మగువా నీకిఁక వగవం, దగవా విను మిందుకు న్నిధానము మున్నే
నగయాపితఘర్మవని, న్మృగయారతిఁ దమసకెలన మెలఁగుచు నచటన్. 79

చ యతిసుతుఁ డొక్కనాఁటినిశి నంబువు ముంచురొద న్మదేభమ
న్మతిశితశబ్దవేదిఁ దునుమ న్నను వృద్ధులు నంధులైన త
త్పితరులు హానితోన చితి పేర్చి శిఖిం బడువారు మాగతిన్
మృతిమొడఁ బుత్త్రశోకమె భరించుమటంచు శపించి రంగనా. 80

క. కలిగితినిల శూద్రావై, శ్యులవలనఁ దపస్వి నగుచు నోనృపవర సం
ధిలు బ్రహ్మహత్య యనువెత, వల దని యాదుర్గతుండు స్వర్గతుఁ డయ్యెన్. 81

— * దశరథుని మరణము * —

క. వశమా యటుగావున దు,ర్దశమాన్పఁగ రాదు రామరామా యనుచో
దశమావస్థకుఁ దార్చెం, బ్రశమాధికు శాప మపుడు పఙ్క్తిరథేశున్. 82

సీ. అమరావతీపురం బాఁగుకోఁ జూచెనా యసురాచరకులాధీశుఁ డైనఁ
జెఱవోయెనా యేమి జేజేనగరి * నూళగేరిలోపలి దేమిటారి యైన
రాయబారము వచ్చెనా యుత్తరీ నయోధ్య కింద్రుహేజీబులం దెవ్వఁడైన
నాజ్ఞప్తుఁ డాయెనా యఖిలావనీపరిత్రాణచాతురిఁ బ్రధాని యైన

---

* “ నూళిగేరి ’ యనుపదము ద్వితీయాశ్వాసము 25 పద్యములో నొకసారి వచ్చినది. నూళిగేరి (రు)= నాగవాసము (అని తోఁచుచున్నది.)

గీ. హరి యనఁడు తేరు వెదకఁడు కరిని గోరఁ, డనిమిత్తంబు వినువీటిపైన మతని
కనఁగ నరిగె నభంగురాహవవిహార, విశకలితదైత్యరథుఁడగు దశరథుండు 83

ఉ. ఉత్తరదృష్టనోదయత నశ్రుఝరంబులు గండమండలిన్
హత్తి కుచాద్రులం దొరసి నాభిసరంబులు నిండి పో నెలుం
గెత్తి నిశాంతచంద్రముఖు లేడ్చి రమర్త్యనతోదరీకరో
ద్యత్తరకిన్నరీముఖరితాహరితానవితానమాధురిన్ 84

ఉ. సూనృతవాది రాజనె యసుద్దులు నిష్ఠురమాయెఁ గైకసం
స్థాన మటంచుఁ దిట్లు రుదితంబులు గానకు రాఘవుండు పోఁ
గా నిపు డింత పుట్టెఁ గడగం డ్లనువార్తలు మిన్ను ముట్టి బి
ట్టై నగ రెల్ల గొల్లు మన నాగత మయ్యెఁ బ్రభాత మంతటన్ 85

క. భరతాగమపర్యంతము, ధరణీపాలకుని మేనుఁ దైలద్రోణిం
దొరయింపఁ దత్ప్రధానుల, నరుంధతీప్రాణబంధుఁ డాజ్ఞాపించెన్ 86

గీ. అర్హమాయెఁగృతాధ్వరుం డైనయతని, దేహము తిలోత్తమోదితస్నేహమునకు
నర్హముగదాకృతాధ్వరుం డైనయతని, దేహము తిలోత్తమోదితస్నేహమునకు.

— • భరతుఁ డయోధ్యకు వచ్చుట • —

వ. అంతట ననుక్షణం క్షీరథవిరామవార్తానీతభరతు లగుటకు వసిష్ఠుచే ననుజ్ఞాతులైన దూత లతిపవనజవనయవనహయసంయోచితసరణులై తురగపతినగరి కరిగి దుస్స్వప్న దూయమానుం డైన కైకయీసూనునకు గురునిదేశంబు విన్నవింప నాతని మాతామహుండును యుధాజిత్తుండు ననుపం గతిపయదినంబుల నవశకునసంపాతసాతంక చేతస్కుండగుచు దుర్దినాంబుకరణి నస్ఫురద్దివంబై వీరభటజనంబుగతి నసీతాసహాయఖేలనం బై నిదాఘసమయసరసిజాకరంబువై ఖరి ననూర్మిళాపాన్వితం బైనసాకేతంబు సొచ్చి, యచ్చోటు యథాపూర్వప్రచారచారుపౌరంబు గామికి విచారంబు దోఁప భూపతియగారంబు దరిసి యరసి యం దెవ్వరిం గానక మగిడి జనని నగరి కరిగి మాతకానతుం డై తంద్రిసేమం బడుగఁ బరుషతరవాదదూక యగుకైక యి ట్లనియె.

చ. అడవికిఁ దండ్రిపంపువడి యాలును దమ్ముఁడుఁ దానుఁ జెంచుకై
వడిఁ జనినాఁడు రాముఁడు భవద్గురుఁ డంతటఁ గాలధర్మమున్

దడయుడ లేమి గైకొనియెఁ దద్గతి నింకఁ గళంకు లేక నీ
కుడిభుజపీఠికి న్మరలు గొన్నది వంటవలంతి నావుడున్. 89

క. కేకయుజోక్తి మయూరీ, కేక యహిం గలఁచుపోఁకఁ గిలితపరితా
పాకృతిఁ బూన్ప వివేకా, పాకృతి ధృతిసడలి యడలి భరతుఁడు పలికెన్ 90

శా. కైకా యెంతటి పాతకంబు ఫలమో కా తల్లి వై తీ విఁకన్
మాకు న్నల్గుర కన్నదమ్ములకు నంబాత్వంబు నీయుం దనం
గీకార్యం బగు నింతనుండియును దుష్కీర్తి ప్రసూభావమే
చేకో నర్హావు నీకుఁ బట్టి ననుకో సిగ్గయ్యెడి న్నామదిన్ 91

క. మాతృవ్యాజము గాంచిన, పాతకధోరణి వటంచు భరితక్రోధుం
డై తన్ముఖమున కభిముఖు, మై తగుదృష్టి న్మరల్చి యనుజున కనియెన్. 92

గీ. మనుకులంబుఁ గాల్తు నని కంకణము గట్టు, కొన్నయట్టి చెట్ట కొఱవి యుండ
సవనభరణ కేళి భువనపావనకేలి, నాశ్రయాశసంఘ యగడుగాదె 93

శా. హాల్యన్నోచి కొమాల్లు దున్నఁగఁ దదీయక్రాంతి యెంతో మన
శ్శల్యం బై కనిపింప లంపటపడె న్సంతానబాహుళ్యమాం
గల్యం బొందియు వేల్పుటా వనఁగ నింకం బుత్రశోకంబు కౌ
సల్యాదేవికి నేకపుత్రకుఁ దలంచన్ శక్యమా యక్కటా! 94

చ తనవిధిచే నరేంద్రుఁ డవితర్కితమంత్రగతి న్వసింప నా
తని యసువాయువు ల్విరముధారసనాద్వయిఁ గ్రోలి యున్నదీ
ఘనకుటిలస్వభావ యిది గట్టును జెట్టును బుట్ట మిట్ట యుం
డిన వని కింతె గాని తగునే జను లుండెదు రాజధానికిన్. 95

గీ ఆత్మవృత్తి కర్హ మగుదైత్యకులము లె, న్నేని యుండఁ గేకయేశునింట
లెస్సపుట్టె నీపె లేమావిగుమినట్ట, నడుమ విసపుఁదీఁగె పొడమినట్లు. 96

క. జననీతి కెడయు మామక, జననీతిగ్మత నయంబు సౌజన్యంబుం
జననోఁచితి నిఁక మనుకుల, జననోచితకీర్తి యేల సంధిలు ననుచున్ 97

చ. అనుజునితోడఁ గైకనగ రాతఁడు వెలువడి కోసలేంద్రనం
దనఁ గని మ్రొక్కి పెక్కుశపథంబుల రామవనాప్తి కాత్మఁ దా
ననుమతి చెందమిం దెలిపి యంత గురూదితసూత్రపద్ధతిన్
జనకున కాహితాగ్న్యుచితసత్క్రియల న్నెఱవేర్చె నన్నిటన్. 98

క. జనకుం డీగతిఁ బితృవన, మునకుం జన భ్రాతృవనసముత్సుకుఁ డగు న
య్యనఘుఁడు జననీముఖహితత, జనములతో మరలి వచ్చె సదనంబునకున్. 99

వ. వచ్చి యంత యథావిధిసమాహితౌర్ధ్వదైహిక చతుర్దశదినుం డగుచు నా
ఘనుం డున్నయెడ జలజహిత కులహితాచరణ జాగరూకం బగుపౌరలోకంబు
సప్రధానానీకంబై మకుటభరణార్థంబు తన్నుం బ్రార్థింప నప్పార్థివతనూజుం
డి ట్లనియె. 100

శా. చాలింపుం డిది యేటిమాట యకటా సౌమిత్రి చారిత్రమే
నాలంబించుట కోపలేక భవదీయాజ్ఞప్తిఁ గోటీరము
న్మౌళిం బూనక యుందునే యొదవి యున్నం బర్ణశాలావకా
శాలంభం బిఁక దండకావిపినసాలాంతర్విశాలావనిన్. 101

చ. అని వనయాత్రఁ దెల్పె నతఁ డంతిపురంబున కేగి యచ్చటన్
జననయనాసుఖప్రరత సత్పథపాంసులతావహత్వముం
దనకుటిలత్వముం దలఁచిన న్నుడిగాలిని బోలు మందరం
గని యనుజుండు చంపఁ జనఁగా విడిపించినరాముతల్లికిన్. 102

వ. ఇట్లు తెలిపి యద్దేవి మొదలైన జననీజనంబు వెంబడింప నగరంబు వెల్వడి
యనల్పశిల్పికల్పితసమీకృతసమీచీన కాననపథంబు వట్టి ఘోట్టాణవారణ
ఘటావీరభటశతాంగసంఘసంఘాతభూతలోదితపరాగయోగపంకిలనభోవిటం
కరింఖద్ఖురీపరీవాహుండును సుమంత్రమంత్రిమణి ఘణితగుణనివహాగుహా
సహాయతానిస్తరిత భాగీరథీపురస్సరసరిద్వ్యూహుండును నై ముందట భర
ద్వాజు నాశ్రమద్వారంబునందుఁ బరివారంబు డించి యాతనిం గలిపయ
సమన్వితుం డగుచుఁ బొడగాంచి యావిరించిప్రభావుం డమేయనిజయోగ
మాయాబలానీయమాన సంతానకామధేనువై మానికచకోరలోచనా సమా
చారితోదాత్త తత్తజ్జనోచిత నిమజ్జనానులేపనాభరణభోజనాది బహువిధోప
చార గౌరవతృణీకృతశచీసహచరత్రిదివపదనైపథ్యం బైన యాతిథ్యంబు
సలుపం బొలుపెసంగుసేనతో నాఁ డచట నుండి మఱునాఁడు తన్మౌని
యనుప ననుపమచిరత్న రత్నవిచిత్రకూటం బగు చిత్రకూటంబు డగ్గఱి యగ్గిరి
యుపత్యకావకాశంబునందు సేనానివేశంబునుంచి చెంచుతేఁమునుం దామును

జానకీజాని నన్వేషించి యంచిత హవిర్గంధగంధవహకిశోరహోమధూమ దూరతోవిభావ్యమానంబును నచలితహరిణగణతిరోహితశరీర వనదేవతా వితాన శీలితోపహారప్రసూనంబును నిశిధినీచరపిశాచవాటీ సముచ్చాటన ప్రవీణ మంత్రాయమాణ రామానుజధనుర్జ్యానదనిశమనసముచితసమీప ఘటితదళకుటీరజటికుటుంబ పరిచయకరంబితమహీభాగంబును, ననేకశాఖ శాఖావలంబమాన వల్కలాంబరప్రతానంబును, నంబరపురాయాత దివిజ శాతోదరీకరకిసలయానీతపారిజాత సౌరనదవారిజాత కీలితవితానసీతావిహరణాగార తరుతలప్రచురవిచికిలలతాజాయమానకాయమానంబును, నధ్యుటజచత్వరాలక్షితసాలమూల హిమకరోపలవితర్దికానిహితసితకృపాణ తూణీర వారవాణ బాణాసనవతంసంబును, నతిథికులసపర్యాపర్యుత్సుక సుమిత్రాపుత్ర నిత్యాహితామందకందమూలఫలకోశమందిరాయితైకదేశంబును, నవిరహిత ధరణితనయాచరణవిన్యాసధన్యతా పరిహాసితసాకేతరామణీయకంబును నగురామాశ్రమంబు నొంది కైకయీనందనుండు కందళిత మానసానందుండై యంతట. 103

సీ. మినుమినుకను సీతమేనికాంతిఁ గడానివలువతళ్కులయు వల్కలమువాని
ఘనసారతిలకవైఖరి ఫాలతలమునం దీక్షింపఁ దగు హోమరక్షవాని
జలసేకజనితపాటలిమఁ గాంచనకిరీటతఁ గాంచు జూటజూటంబువాని
మహిమండలి వహించు రహినాదిభోగిభోగముల మించుభుజాయుగంబువాని

గీ. తమ్ములనదమ్ములనెడు నేత్రములవాని, నునుమెయిలుచాయలుడివోనితనువువాని
నకృతసుకృతావిధేయత నమరువాని, రాము శ్రీరాము సౌంత్యభిరాముఁ గాంచె

చ. కని యారామసమీపసీమ లతమై కన్పించు క్రొమ్మించుఁ బో
ణి నరణ్యాని కయోధ్యకెక్కు జిగిచే నిర్జించు రాజీవపా
ణి నిమిక్షోణికళత్రు వంగడపుమున్నీటన్ సముద్భూతిఁ గాం
చినదైవాత్మకరేఖ భూమితనయన్ సేవించె సాధ్వీమణిన్ 105

ఉ. ఏనృపుఁ డాసుమిత్ర కుదయించియుఁ దా నితరానవాప్యరా
మానుజచర్యఁ గాంచు నిశలం దపనిద్రతఁ జెందెనేని యె
వ్వాని కనుంగవం జెనయు వారిజబృందము లందు రాగుణ
శ్రీనిధి నూర్మిళేశు నిజదృక్పథముం దొరయించె నంతటన్. 106

చ. మరుగతి మాడు వేసవిని మ్రగ్గి తలంకెడు జింక పంకజా
కర మెదుటం గనుం గొనినకైవడి రాఘవుఁ గాంచి తత్పదాం

బురుహామదాళి దైు జనకపోఁకడ నేత్రాదవ న్వచించుచు
న్వరతుఁడు మూర్ఛముంచె రఘునాయకు లక్ష్మణు జానకీసతిన్. 107

క. ఆలో నంతఃపురజన, జాలోదితరోదనార్తి చదలంట నిడన్
వేలాతిగశోకార్ణవ, కోలాహల మావసిష్ఠకుంభజుఁ డణఁచెన్. 108

గీ. తెలివి ఘటియిల్ల నంతటఁ గులగురూక్తి, సరణి రఘుపీరుఁ డామరసైంధవాప
కృతనివాపాది సముచితకృత్యసముద, యుండగుచు నుండెనుఋగోష్ఠి నుటజవాటి.

మ. మనువంశంబునకున్ యశంబునకు ధర్మశ్రీకిఁ బ్రాక్పూర్వవ
ర్తన కాచారబహుశ్రుతాదుల కనర్హంబె ద్దియాజాడ కో
ప్పని తాత్పర్యము విస్తరించు భరతోపజ్ఞంబు విజ్ఞాపనం
బు నిజారణ్యనివర్తనంబుఁ దెలుపన్ భూపుత్రితేఁ డత్తఱిన్. 110

మ. సకృదుద్ధ్యోతచిరేతరాంశునిభరాజ్యశ్రీమదావేశి చి
హ్నా కిరీటంబు భరింపలే నమృతసౌఖ్యం బబ్బు నీరత్నపా
దుకల న్నావయి నుంచు మంచు పదపాథోజంబుల న్వేఁడుపో
లిక నమ్రం బగు మౌళితోడి భరతున్ లేనవ్వులోఁ జూచుచున్. 111

చ. మనము గురూక్తి సత్యగరిమం దొరయింపమి రాజధర్మమే
యని యఖిలావని న్నిజపదావనియం దిడుకోర్కి దాల్చినం
బనిచిన మాండవీపతి సమస్తబలాన్వితుఁ డై యయోధ్యకుం
జని యచట న్వసింప కనుజన్ముఁడుఁ దాను జటాధురీణులై. 112

క. ఎందాఁక రామువనగతి, యందాఁక వసింతు నిచట ననుపూనిక తో
నందిగ్రామావసథము,నం దిగ్రామాభినంద్యనయుఁ డతఁ డుండెన్ 113

క. దాశరథిజటాధరభయ, దాశరథిక్రూతి ఘటింప నంతట మర్యా
దాశరథియు భృతచాపమ, హాశరథియు నైన యనుజుఁ డతివయుఁ దానున్.

ఉ. లేటికులంబు నోటఁ గబళించిన దర్భ త్యజించి సోగకన్
దేటల కల్వచాలు వనినింద నిజాకృతిఁ గొంకులేని స
య్యాటముతోఁ గనుంగొనెడు నత్రిమునీశ్వరు నాశ్రమపుమా
వాటికి నేగి యాజటిలవశ్యసపర్య భజించె నయ్యెడన్. 115

గీ. అత్రికనకగాత్రి యువనిపుత్రికినంగ, రాగ మొసఁగె సానురాగసరణి
దాన నొకటఁ బూనె జానకి మేనును, మిఁచుమించు నాక్రమించు శ్రీవి. 116

చ. వననిధిమేఖలావలయవారిజనీరజనీభవన్నరా
దనభటతండఖండనవితండకతండనురక్తుఁడై ఘనా
ఘనవలయంబుఁ దూఱెను వికర్తను కైవడిఁ జొచ్చె దండకా
వనిఁ జమరీకిరీభహరివాహరిపూత్కరగండకావనిన్. 117

ఉ. చంద్రధరప్రభావ శతచంద్రధరోపమరూప శ్రీహరి
శ్చంద్రమహామహీంద్రనిభసత్యవచోరచనాధురంధరా
చంద్రమతీసమానగుణసౌరభవచ్చినకృష్ణమాజిమా
చంద్రముఖీమనోరమణ సాదరణాశ్రుతబాణభాషణా 118

క. కిన్నరనిధినాయకనిభ, కిన్నరకంఠీనవీనకేళిన్యధిపా
పన్నాళాగరధరణీ, భృన్నుతకీర్తిప్రతాప మృదుసల్లాపా 119

కవిరాజవిరాజితము. భరతభగీరథ నైషధనాహుష పఙ్క్తిరథాత్మజరంతియుధి
ష్ఠిరయువనాశ్వ తనూభవ భార్గవ చిత్రపవిత్రచరిత్ర నిధీ
వరకవిరాజవిరాజితమందిరవందిరసాలవసంతనిరం
తరనిరవద్యయశోజితశారదనారదపారదహారధరా 120

గద్యము. ఇది శ్రీమదుమామహేశ్వరవరప్రసాద సమాసాదిత సరసకవితావిలాస వాసిష్ఠవంశకీర్తిప్రతిష్ఠాసంపాదక ఋగ్వేదికవి తిర్వేంగళార్యకలశరత్నాకర సుధాకర జగద్విఖ్యాత కవిరాజకంఠీరవబిరుదాంక వేంకటాచలపతిప్రణీతంబైన చంపూరామాయణం బను మహాప్రబంధంబునందుఁ జతుర్థాశ్వాసము.

శ్రీరస్తు

# చంపూరామాయణము.

## పంచమాశ్వాసము

— * ఆరణ్యకాండము * —

క. శ్రీవేంకటపెరుమాళ్వసు, ధావరసంసేవితాంఘ్రితామరసలస
త్కావేరీ వల్లభపా, రావారగభీర కనవరాజవజీరా 1

శా. కాకుత్స్థాగ్రణి దండకావిపినభాగ వ్యోమసీమాఘనుం
డై కోదండము దోఁపఁ గాండనిచయం బాచాంతరక్షోదవా
నీకం బై మెఱయన్ మెఱుంగు కరణి న్దేవేరి వెన్వెంటఁ దాఁ
నేకింబోలి త్రిలోకి రంజిల మెలంగె న్నీలశైలచ్ఛవిన్. 2

మ. వనశుండాలకపోలకార్షవిగళత్వగ్జాలసాలాటినూ
తననిర్యాసము తావిమాటు హుతగంధంబుల్ నదంబుల్ తపో
ధనపుణ్యాశ్రమభూములం దెలుపఁ దత్తన్మౌనిపూజాహ్వతా
యనజాతి న్మనువంశు లాయడవి నుద్యానంబుగా నెన్నుచోన్. 3

క. శాతాయస్త్రిశిఖశిఖా, ప్రోతశవవ్రాతుఁ డై తిరుగువాఁ డచిర
జ్యోతిర్లతాశతావహ, సీతావనితావలోకచిత్రాకృతి యై. 4

గీ. యాతుధానుఁ డొకఁడు విరాధాభిధానుఁ
డలరుసరి మాంసమతిఁ గాకి మపహరించు
కరణి ధరణిజఁ గొని యభ్రసరణి నిలిచి
రాకొమలఁ జూచి తలయూఁచి కేకవైచి. 5

మ. కట్టినవల్కలంబు జడగట్టిన కైశికముం గరంబులం
బట్టిన వింట్లఁ జూడఁ గనుపట్టిన దచ్చెరు వెవ్వరో కదా
పెట్టెడుసొమ్ముచే సొగసు వెట్టెడు నిట్టి మిటారికత్తెతో
నట్టడవిం జరించెదరు నాయపదానము లాలకింపరో. 6

క. కాచితి మి మ్మిపు డీచెలి, నాచే నొప్పించి చనుఁ డన న్రాముఁడు దో
షాచరు చనుమొన నొకనా, రాచము నాటింప స్రుక్కి రక్కసుఁ డలుకన్. 7

సీ. సీత నుర్వికిడించి చేకొద్ది వైచుశూల మమర్త్యహృదయశూలంబుతోడ
నసువ గేడించి మార్గావరోధాపరాధము సైఁప నిందు భాస్కరుల సాను
వునఁ దాల్చువింధ్యమ ట్లనుజుతోడను నెత్తికొని మింటి కరుగు దైత్యుని భుజంబు
లిరువురు ఖండింప ధరపైనొఱఁగి మేనుఁ దొఱఁగి వాఁ డమరుఁడై తొలుతరంభ
గీ. బలిమిఁ బైకొనుటను విలబిలుని కినుక, గనిన యొడలిది గర్తార్హమనుచు వేఁడఁ
దత్తనువు మున్ను నెత్తుటఁ దడిసిపదన, యినధరణిఁ ద్రవ్వి పూడ్పించె నినకులుండు
క. శరభంగయతికి నతఁడా, శరభంగజకీర్తి రాక చాటుచు గంగా
శరభంగసంగరాశన, శరభంగజజనితదక్షిసఫలత సలిపెన్ 9
గీ ఇంద్రుఁ జూచియుఁ దను మానవేంద్రుఁ జూచు
దనుకననటుండి జటిలుండు ననలశిఖకు
సమిధ మై మింటి కరుగ నైక్ష్వాకుమణి సు
తీక్ష్ణు నాతిథ్య మెనసి యాదిక్కు వాసి 10
చ అరిగి కనెం గుఱంగట జలాశయసింధుమకరందకందళీ
శరణధురీణపాణిమయకంజితదంతికభీతభీతసం
చరణవిధాయితోయధరసంశయదాయక హోమధూమ దం
తురితపురోవనిన్ ఘటతనూజతపోవని లోకపావనిన్ 11

— * రాముఁ డగస్త్యాశ్రమముం జేరుట * —

వ. కనుంగొని యనుంగుటొయారి యగుమహీకుమారి కిట్లనియె 12
సీ. సెలయేటివడి నగస్థలినుండి పడి వాసవాభాసుగతిదెల్పు నజగరములు
నజగరములనోళ్ల కబ్బి వెల్వడలేక వాతాపిదశ చూపు వనగజములు
వనగజాహతులఁ గైవ్రాలి వింధ్యనగంబుభాతిఁ జొప్పడు సల్లకీతరువులుఁ
దరువుల శాఖాగ్రసరణిఁ జూపట్టి వార్ధి తెఱంగనుకరించు తేనెపెఱలు
గీ. నహుషఋషివిద్విషన్మేరుమహీధరప్రదీప వనరాజదుర్మదాటోపహరణ
పటుతరఘటీతనూభవప్రాక్చరిత్ర, మెదురుకొలిపెడు మదికి నిం దిగురుఁబోఁడి.
మ. జలరాశి న్వలకేలఁ గుంభభవుఁ డాస్వాదించుచో నీఁగలుం
బలెఁ బైమూఁగు మొయిళ్ల డాపలిచెయి న్వారింపఁ గంపించి శం
ఫలకుం బాసి నిలింపమార్గము భజింపన్లేక యామబ్బు లిం
దు లులాయాకృతిఁ బూని పల్వలముల న్వర్తిల్లెడుం గంటివే, 14

గీ. అని యగస్త్యనాశ్రమాభిరామతకు విస్మితమనస్కుఁ డగుచుఁ జేరఁబోవు
నెడఁ దదీయశిష్యు లెదురుగా వచ్చి తోడ్కొనుచుఁ జనఁగ నరిగి మనుకులుండు.

సీ. నహుషునాము భుజంగవిఖ్యాతిఁ దప్పించె మిన్నేటి కీతఁడిదిగా విప్రవరత
యంభోధి నొకగ్రుక్క నాపోశనముగొన్న వీఁడు పూనినదిగా బాడబాఖ్య
కేలనంటి నగంబు నేలమట్ట మొనర్చె నీమేటిదిగదా యతీంద్రచర్య
యసురప్రాణంబున కెసరువెట్టినకుక్షి గలుగు వీనిదిగదా కలశజన్మ

గీ. మనఁ దనరు లోకవంద్యు నిరాశుఁ డయ్యె, దక్షిణాశభజించు చిత్రప్రచారు
బ్రహ్మతేజోమయు నిజప్రభావగాత్రు, గౌతమాత్రిపులస్త్యు నగస్త్యుఁ గాంచె. 16

క. నామము గోత్రము నొడివి ప్రణామము గావింప మానినాయకుఁ డాశీ
స్తోమములో నాదవె ముని, క్షేమము లిఁక నని సపర్య సేయుచు నంతన్. 17

మ. మురజిచ్చాపముఁ దిగ్మచూలివిశిఖంబుల్ వజ్రితూణీరముం
గరవాలంబు నొసంగి యానియమిలేఖస్వామి తన్ బంప నేఁ
గి రఘూత్తంసుఁ డొనర్చెఁ బంచవటి చక్కం డెంకి గోదావరీ
సరసీజాతమరందమందరమరుత్సంప్రీత చేతస్కుఁ డై. 18

మ. పులుఁ గొక్కం డెదుటం జటాధరనిరంభోవార్ధియై వజ్రియా
వలిఁ దం జేరెడు గట్టురాకొమరు శేవం దోఁచి మీ తండ్రికిం
జెలినై యుండు జటాయువందురు నను జేకోఁ దగు న్నాయెడం
బలలాదభ్రమ మేల రామ! యని సంభాషించి పో నంతటన్. 19

క. పంచవటిన్ సౌమిత్రిఘ, టించిన కారాకునగరి టెక్కు లయోధ్యన్
మించ న్సంతోషించి వసించె రఘుపుంగవుండు సీతాన్వితుఁ డై. 20

— * శ్రీరాముఁడు పంచవటిని వసించుట * —

శా. అంతం దోఁచె నితాంతకంతువిజయోదంతంబు సిందూరితా
సంతాశాలివిపాకశీలితశిఖంగాకార కేదారసీ
మంతం బాదినయామనోదయ మిళన్మాంద్యాంశుమత్తంబు హే
మంతం బధ్వచరోద్ధవాదినటఝంపానాట్యసర్వంతమై. 21

క. శరదాతపతప్తనభః, స్థురదమితనిదాఘబిందుసంఘము లతుల
స్ఫురమదకుంజరసరసీ, శరనికరము లొలసెఁ దుహినకణవిసరంబుల్. 22

సీ. జాడ్యాకరం బయ్యెఁ జంద్రోపలవితర్ది శరపాత మయ్యెఁ గాసారవిఖ్యాతి
యుగ్రదృశ్యం బయ్యె హల్లకోత్పలవాటి విపదావహం బయ్యె నుపవనంబు

చర్చాగళితమయ్యెఁ జందనాలేపనం బతిశైత్య మయ్యెఁ జంద్రాతపంబు
గగనమయ్యె గృహాగ్రగతచంద్రశాలిక యసుకరం బయ్యె లాజానిలంబు
గీ. విరచితామోద మైతోఁచె విరులశయ్య, భారము ఘటించెఁ బూనంగ హారవల్లి
కంటకోత్సేధ మొనరించెఁ గప్పురంబు, నిరవధికభోగ పరులైన దొరల కపుడు 23

మ. బురునీసుల్ సకలాతియాంతరగృహాభోగాసికల్ దోమబ
త్తెరమంచంబుల ధూమధూసరహసంతీయంత్రముల్ కుంకుమా
గురుసారంగమదానులేపనములుం గోష్ణాంబుజాతేక్షణా
గురువక్షోజభరోపగూహములు భోగుల్గాంచి రాసీతునన్ 24

క. నెఱసునటి విశ్రమింపం, దతిదైమె నెఱిమించు మంచుతాఁకుల జిగివా
తెఱ పిల్లగ్రోవిఁబూనం, గొఱమాలె న్వెలమిటారికూఁతురితెగకున్. 25

ఉ. అట్టిమెడం గడంగి జగమంతయు నాఁగెను మంచుదాడి కి
ట్టట్టు చనంగ లేక శరణంచుఁ దమున్భజియించు వెట్టకుం
దట్టువునుంగు వాసనలతావగు లేజవరాంద్ర చొక్కపుం
గట్టెమెఱుంగుచన్గవలు గట్టె నిజోపరి పట్టుబంధమున్ 26

గీ. అనతిచకితదివాంధంబు లైనయెండ, లనతిముదితమరాళంబు లైనకొలఁకు
లనతిసుఖితచకోరిక లైనచంద్రి, కలుఁబ్రియము లానెజనులకుఁ గంటుగాక 27

సీ. హృత్పద్మ మాతంక మెనయనీయక మాటుకరణిఁ గరస్వస్తికంబు దోఁపఁ
జలివో జపించు నోట వణంకునఁ దొలంకు రదనఘట్టనమునఁ బెదవులదరఁ
గృపవుట్టి విధి యొసంగిన కంబళమనంగ నంగంబు రోమాంచ మాదరింప
దార్గత్యమయనృపధ్వజపతాకికరీతిఁ గటిఁ బటచ్చరవేష్టి గానిపింపఁ
గీ. దిరుగుభిక్షాశనులమీఁద దృష్టియిడని
యదయురాలగు కలిమితొయ్యలిగృహంబు
లలజడికిఁ దార్పుకై వడిఁ బులుముకొనియె
వనజపిసరంబు హేమంతవాసరంబు. 28

క. ఎన్నులతుద హిమకణము, ల్వెన్నుగఁదట్టొరగి రాజిలె బ్రాజనముల్
సన్నిహితలవనచింతా, సన్నుతిఁ గన్నీరునించు చాదము దోఁపన్. 29

క. తాలిమివదలి విరాళిన్, జాలిం బడి వెఱచు నళికవామణు లవ్వోఁ
జాల రతివ్యసనాంబుధి, వేలంగు రజనీవిరామవేలయుఁ దెలియన్. 30

— * శ్రీరామునికడకు శూర్పణఖ వచ్చుట * —

మ. దిశలాకాశము ముంచుమంచుల మృగీదృష్టిస్తనాశ్లిష్టులన్
దశమావస్థలఁ బెట్టునట్టి తతి సీతాసేవ్యుఁ డా నేతకున్
దశకంఠాసురు చెల్లెలాసపడెఁ బద్మాదేవి కేల్దమ్మికిం
బిశితంపున్నవి నేఁగు డేఁగచెలి తబ్బిబ్బైన చందంబునన్. 31

క. ఆసపడి చుప్పనాతిపి,సాసి తనుం డాసి హృదయజాతాసీతా
యాసముఁ దెలిపిన విని పరి,హాసము దొలఁకంగ నాతఁ డాసతిఁ బలికెన్. 32

చ. ఒఱపరి వాఁడు నీవయిన; నొక్కతె కోర్వమి నన్నొకప్పుడే
మఱక భజించు నీతరుణి, మంటికి వింటికి భంగురంపుటే
ట్రెఱ ఘటియింపఁ జాలిన యతిప్రమదావహ, దీనిమాయకు
న్వెఱతుము గాక లేక కనువిందగు నిం దగులంగఁ జెల్లదే 33

చ. మగువరొ వీఁడె లక్ష్మణుఁడు మన్మథమన్మథుఁ డీశుభాంగుఁ డే
తగులును లేక యీయడవి దండొనరింపఁగ వచ్చినాఁడు, నీ
జిగిబిగిఁ జూచెనేని తమిఁ జిత్తము హత్తకపోదు వానికిం
బగలును రాత్రియు న్నిదురపట్టదు కంటికి విప్రయుక్తతన్ 34

క. కాన నతం డీమేనుం, గౌనుం జిగితోడలు నడలు కన్నులుఁ జన్నుల్
వేనోళ్లఁ బొగడఁ జనుమన, నానీలిపిసాళి మోహనాకృతి యగుచున్. 35

మ. చరణాబ్జంబుల గిల్కుమట్టెలరొద ల్పంధిల్లఁ బాలిండ్లపై
నెరజాఱున్నను పైఁట నీటిడఁ గటాక్షాలోకనాళీక దం
తురితోపాంతధరిత్రి యై కవసి యెంతో మైత్రి సౌమిత్రితో
సరసాలాపము చూవ నాతఁ డను హాస్యప్రక్రియాశీలుఁడై. 36

ఉ. దాసుఁడ నేను రామున కతండు మదీశ్వరుఁ డామహాత్ము పాం
దే సవరించి లోకులకు దేవులసానివి గాక నీ విఁకన్
దాసివి గాఁ దలంచు టుచితంబె విదేహతనూజ కిప్పు డా
భూసుతపుణ్య మేమి నినుఁ బోలునె రూపవిలాససంపదన్. 37

ఉ. కొమ్మరొ దండు తాఁగౌమునకు న్వినుకోఁ దగుదానవీవు నీ
యెమ్మెకు రాముఁ డాసపడు నింతయు కాక నిరాకరింపఁ బోఁ
డిమ్మగు దుష్టసత్త్వముల కివ్వని యయ్యవనీజ యిచ్చటం
ద్రిమ్మరనోప దన్నిటను నీ కతఁడే పతి చుమ్ము పొ మ్మనన్ 38

మ. మరుజాలిం గుతి దప్పి శూర్పణఖ పల్లా ఱిట్లు నిర్లజ్జయై
గటికె న్నీటగు నేటియుద్దరులకుం గాంక్షించు నాఁబెయ్యవై
ఖరి నీ యుద్ధఆసుద్దులన్ బ్రమసి రాకాపోక గావించె వే
సరి సీతావ్యాప్తి గొగ్గ నగ్రజునికన్నన్ గృహీతాసి యై. 39

మ వనివా రీచెలి జాలిముక్కు గలుగ న్వ్రక్తించి తౌరా యన
న్మనువంశాగ్రణికూర్మితమ్ముఁ డురుకామక్రోధసంకల్పశూ
ర్పణఖాశ్వాసనమీరధోరణులకున్ బల్మాట వాటింప న
య్యనిమేషాంతకురాలు కాలజలదోగ్రారావదాక్రంద యై. 40

ఉ రక్కసిజోదు లంద ఱేఁక రాఘవుడాక విహస్తు లౌదు రీ
ముక్కిఁడిజంతకుం దగిన మొండివిటుండు నిశాటజాతియం
దొక్కఁడు లేక తక్కఁ డని యూహపరుల్ నగఁ జేఁటగోటిబ
న్మొక్కలపుంబిసాళి ఖరుముందటికిం జని నిల్చె నిల్చినన్. 41

ఉ విగ్రత నీకుఁ దెచ్చినవివేకపరాజ్ముఖుఁ డెవ్వఁడో యతం
డుగ్రతదీయసాయకతదుద్భవులం దొకఁ డైన నేమి ? య
వ్యగ్రత గెల్తు తె మ్మని నిజావరజోదితరామలక్ష్మణో
దగ్రత కాగ్రహించి ఖరుఁ డాహవసన్నహనార్హవేషుఁ డై. 42

చ. వెలువడి త్రోవకు న్భగిని వేగరి గాఁ బదునాల్గువేలజో
దులు పదునాల్గుచేరువలతో మునుకో నని కేఁగు దేఱఁ ద
త్కలకల మాలకించి సతిఁ గావ సహోదరుఁ బంచి సింగిణీ
విలు గుణయుక్తి మ్రోవ రఘువీరుఁ డెదుర్కొనె యాతుధానులన్ 43

వ. ఇ ట్లెదుర్కొని జనోదర్కగోచరేతరామోఘశరలాఘవ్రుం డగు రాఘవుండు మండలీకృతసముద్దండకోదండపిండితప్రచండకాండపారంపరి నిలింపులకు సొంపు సంపాదింప, నావిలం బగు రక్షోబలంబు తత్క్షణంబ హైమనదినంబు కైవడి ననవాప్తపుండరీకం బై రాశిచక్రంబువై ఖరి నవిభిన్నకేతుపాతం బై, యంబుజేక్షణావక్షోరుహంబులీల నాలక్ష్యమాణ పత్రభంగం బై, ధారాధరసమయరంగత్తరంగిణి తెఱంగునఁ బరివహదవేలకీలాలజాలం బై,యనార్యగోష్ఠిపోలిక ననేకప్రకారహతకవచస్ఫురణం బై, శారదావసరవాసరంబుసరణి విశకలితాపఘనసంకులం బై, చాంద్రమసబాల్యచరితంబురీతి సంభృతగురూత్త

మాంగనాశం బై, పాండవబలంబురేఖ ధర్మరాజాధీనదేహం బై, పరశురా
మాపదానంబుభాతిఁ బాతితసరోషకుంభినీధవకులం బై, పౌలస్త్యనగరంబులా
గునఁ బలాశనప్రతిష్ఠాసమంచితశివాలయం బై, యంబురుహబంధుబింబంబు
డంబున ననంతాభిపతదురుతరకరసహస్రం బై, దినావసానంబుచందంబున
వియోగభాజనరథాంగయుగళతాంగసంఘం బై, హరయదుప్రవరసమరంబు
పోఁక నప్రాణితత్రిశీర్షం బై, నిర్గలాంతరంగశీలంబుపగిది నిర్ఘాతదూషణం బై,
యద్వైతతత్త్వంబుఠీవి నాత్మావశేషం బై, నశింప రోషించి దోషాచర
సమాజశేఖరుం డగు ఖరుం డడరినప్పుడు విపశ్చిజ్జనంబునకు నైన నిశ్చయింపం
గూడని జయాపజయఖేలనంబు దోఁపఁ జూపఱ కనుసంధీయమానంబు లగు
విశిఖసంధానమోక్షణంబుల నంతరిక్షచరనిరీక్షణాద్భుతవితరణచక్షణం బగు
రణం బిరువురకుం బ్రవర్తిల్లు నెడ మార్తాండకులతిలకుచాపంబు నయ్యసుర
లోపంబు గావింపఁ గోపయావకితముఖసరోజుం డై దశరథతనూజుండు కుంభ
సంభవుఁ డొసంగిన శరాసనంబు మోపెట్టి బెట్టిదంపు బాణంబు దండకావన
తపోధనతనుత్రాణనిర్మాణపారీణంబుగాఁ బ్రయోగించె నంతట. 44

క. ఆఖరుని శిరము రవికుల, శేఖరుని శిరంబు దునుమ జతలేఖనదీ
వాఖరి యగు జటిలాళీ, వైఖరిఁ గొనె ముందె మంథర రఘుస్వామిన్ 45

మ. మునుము న్మంథర కైక యు న్వరయుగంబున్ సూనృతాపాయిభీ
తనృపాలోక్తియు జానకీరమణకాంతారప్రచారం బనం
జను పేళ్ల న్దశకంఠహీనతకు నోఁచంజాలు త్రైలోక్యభా
గ్యనికాయంబు రహింప నావని మునుల్ సానందు లై రందఱున్ 46

మ. ఖరనక్తంచరుఁ గీటణంచి యుటజాగ్రక్షోణి విల్లెక్కుడిం
చి రజోధూసరజాటజూటరుచిరశ్రీ మించు నైక్ష్వాకుశే
ఖరువక్షోజభరానురూపతదురఃకాఠిన్య యై కౌఁగిలిం
చి రణశ్రాంతి హరించె సీత యధికస్నేహాదరానీతి యై. 47

క. సౌమిత్రియు రాముజయ, స్థేమం దా రెండువేలజిహ్వలుగలవాఁ
డై మెచ్చె మువ్వురున్ సుఖు, లై మునుపటికరణి నుండి రాసమయమునన్

మ. అజహన్మత్సరవృత్తి చిత్తమెగపోయం జేటబల్గోటిజం
జ తనస్థానమురీతి లంక నజనస్థానంబు గావింపఁ బా

కజితుం గిలి జముం బలాదు వరుణుఁ గామ్పుఁ ధనేశుఁ భవ
న్భుజకండూతిఁ దృణీకరించుదశకంఠుం జేరి యానమ్రుఁ డై. 49

చ వినుము జగత్త్రయీభయదవిక్రమ నే నటు మున్న దండకా
వనికి వినోదకేళిఁ జని వర్తిలుచో భవదీయధాటి కో
ర్వ్యన మునివృత్తిఁ జెందినజయంతవసంతులొ పుష్పవంతులో
యనఁదగు శౌర్యవంతులు మదక్షులపాల్పడి రిద్దఱత్తఱిన్. 50

చ చరగతిఁ జిత్రపుత్రికకుఁ జాటెడు నెన్నడ దోఁపఁ దావి పై
క్కరిది గదా కడానిలత కన్నతిఁ జిల్కెడు మేనితళ్కు, తో
ల్కరికరిమించు మించు లిడఁ గంతునొయారపుఁ జికిలీటారిపై
ఖరి నొకపఱాంతకారి మెలఁగెన్ గనుఁగొంటిఁ దదంతికంబునన్. 51

సీ. అదిపూను వేణిసోయగముఁ జెందరు కదా పన్నగీమణు లెంద ఉన్న నేమి
యదివహించు నెలుంగు వావణింప లేదు గా! కిన్నరీతతి దావుకొన్న నేమి
యదచెందుపొక్కిలివారువు చేకోదు గా యప్సరోనికర మెంతైన నేమి
యదిగాంచుపిఱుఁదుసంపదకు నోఁచరు గదా యుర్విబోటులు పెక్కురున్న నేమి

గీ. యది గదా యింతి యటువంటి యలరువింటి
దంటమదహస్తి నెద హత్తి యుంటి వేని
గంటి వన వచ్చు వెలిదమ్మికంటివలఁతి
కలికిగావించుకలిమి రాక్షసకులేంద్ర! 52

ఉ రాముఁడు లక్ష్మణుం డనెడు రాచకొమాళ్లఁట వారు వారిలో
రాముఁడు పెద్దవాఁ డఁట! యరాళకచామణి సీత పేరి యు
క్కోమలి యమ్మహామహునకున్ జవరా లఁట దాని మేనితీ
రామరవారకామినుల కైన నధీశతఁ గోరఁ జేయదే! 53

క. నీ కాయొసపరి దగు నని, కైకోఁ జని విగ్ర నైతి ఖరుఁ డంత మదీ
యాకృతిఁ గనలి బలాన్వితుఁ, డై కదలి తదీయవిశిఖహతిఁ బడె ననుడున్. 54

మ దశకంఠుం డనునాసికోక్తు లటు లొందం జెల్లెలిం గొన్నదు
ర్దశ భావించి ఖరాదితాదృశజనస్థానోగ్రరక్షశ్చతు
ర్దశసంఖ్యాకసహస్రహంత్రి యగు సీతానేతచాపప్రతా
పశిఖిజ్వాలిక నాలకించి ఘనకోపవ్యాపృతస్వాంతుఁ డై.

ఉ. ఏంటి యపూర్వ మర్వ్వి నొకపింటినరుండె జయించువాఁడు ము
క్కంటిమలం బెగల్చినమగంటిమిజో దిసతాగె మింక నా
వంటవలంతి నోముగుమిపంట వహిం రహింపుచు వానివా
ల్గంటి వడిం హరించి తెఱగంటివజీరుల త్రుళ్ళడంచెదన్ 56

గీ. మత్తకరిమొకంబు చేకొని మరులువట్టి, ధరణిఁ బో నోమిన త్రిశంకుతనయుకులము
వాఁడగుట వీఁక నాచేత నేఁడు రాముఁ, డింతిఁ గోల్పోవ మారీచమృగ మొనర్తు

క. అని మారీచునికడకుం, జని దశకంధరుఁడు తనవిచారము దెలుపన్
విని యతఁ డీసుర్మతి కీ, తని కేమిటికొ వలె ననుచుఁ దహతహఁ బలికెన్ 58

శా. నీబోధం బిపు డెందుఁ బోయె నకటా! నిశ్శంకలంకాపుర
ప్రాబల్యంబుఁ బొకాల్పఁ జూచెదవు ధర్మంబా రఘూత్తంసభా
ర్యాబందీకరణంబు శూర్పణఖయూహాపోహ లాలింతురా?
"స్త్రీబుద్ధిః ప్రళయాంతికా" యనుట నీచిత్తంబునం దోఁపదా! 59

క. మాని నయినాఁడ రాముని, చే నొకచేపెట్టు మేసి చిత్తంబున కు
ద్యానారామపదం బవ, సానవిరామాహ్వయంబు జఘు కగు ననినన్ 60

ఉ. కన్నుం గ్రేవలఁ గెంపు దోఁప నదిరా కాఱోడ్డమా నేను జె
ప్ప న్నీ విప్పని కొప్పకోమి యిది నీపాండిత్యమో? చాలు నం
చు నైష్కర్మ్యము పుట్ట నాడుటయు నచ్చో వాఁడు నిమ్మూర్ఖుఁ డిం
కన్నాబుద్ధులఁ జక్కఁగాఁ డనుచుఁ దత్కార్యానుకూలాత్ముఁడై 61

ఉ. భానుకులీనుదేవిఁ జెఱవట్ట దశాననుఁ డెంచ బ్రహ్మ త
త్ప్రాణసమీరు సౌరపురయాత్ర కమర్చిన పైఁడిజోడునె
మ్మేనిరుటంపు లేటితలమిన్న పతాణి యనంగఁ దాటకా
సూనుఁడు దండకావనము సొచ్చె హిరణ్మయపుంగురంగ మై 62

క. ఇటువలె నేతెంచి కుటిం, గట మెలఁగెడు పైఁడిమెకముఁ గని దానిం దె
చ్చుట కవనిజ వేఁడన్ ధూ, ర్జటి యజ్ఞమృగంబువెంట జరిగెడుకరణిన్. 63

ఉ. వింట న్నారి ఘటించి రాముఁ డసుర న్వెన్నంట బల్గుత్తుపుం
గంటుం గొంటుపతాణి రావుతుఁడు ముం గాధేయుజన్నంబునన్
గంటిం జెండక పాఱిచన్నబడు గిన్నా ళ్లిచ్చటం డాఁగెనో
కంటింగంటి నటంచుఁ బాణము కరగ్రాహ్యంబు గావింపఁగన్. 64

మ మనువంశ్యుం బెనుమాయదారిమెకమై మారీచనీచుండు కా
నను దవ్వుట్లలయించి కొంచుఁ జని యంతం దత్కలంబాహతిం
దనకార్తస్వరశంబరాకృతి చన న్వాపోలెన్ "హతో౽స్మీతి" నా
గ్జనకార్తస్వర ముర్విపట్టి యధిపోక్తం బంచుఁ గంపింపఁగన్ 65

ఉ కంపముఁ జెంది సీత యనుకంప వహింపవు కంటనుం దడి
న్నింపవు లక్ష్మణా యతఁడు నిన్నదె చీరెడు నన్ను నల్లనై
లింపకుమారి మాయకుఁ జలింపకు రామునకా భయం బనం
దెంపరివై దురుక్తు లవనీజ వచింపఁగ నాతఁ డార్తుఁడై. 66

మ అకటా! నిన్ను సుమిత్ర గాఁ దలఁప హేయంపుం దురుక్తంపు వా
లికెతూపుం జెవిగాఁడ నాడితివి తల్లిం బట్టనూహించు పా
తకుఁడే లక్ష్మణుఁ డేమి చేయ వశమా దైవేచ్ఛకున్ నయో
ధ్యకె దైవచ్చియుఁ గైకఁ బోలి పడఁ బాలైనాఁడ నేఁ డీవనిన్ 67

క. విపరీతకాల మింతే, యిపు డెవ్వరి నొచ్చుకొనఁగ నేటికి నీచే
నపవాద మగుల నిజ మని, తపియించి సుమిత్రపట్టి తరలఁగ నంతన్ 68

సీ మితిమీఱి వెలికిఁ గ్రమ్మెడుమనోరాగంబుసరణి నీటగు ధాతుశాటితోడ
కామాంధతకు నూఁతగాఁ గొన్నయట్టిచందము దెల్పు వేణుదండంబుతోడ
తలదిమ్ము కామవార్తలఁ గ్రమ్మ నిడినపట్టనఁ దోఁచు గోపిచందనముతోడ
బలిమిచేఁ జేపడ్డబ్రహ్మాండభాండంబువలెఁ జెలంగెడుకమండలువుతోడ

గీ. నహామికనుబోలె "నచ్యుతో౽హంశివో౽హ"
మనుపలుకుతోడ నిజతుంగఘనశతాంగ
ముసుపదవి మాటి మున్నీటినడిమిపీటి
నట్టురాకాసి దొరఁకుసన్న్యాసి యగుచు 69

చ. దళనిలయంబు రాఘవయుతంబగుటం గని సీత సత్కృతుల్
సలిపెదురూపు మాని సహజంబగు నెప్పటిమేనిఁ బూని యా
నళినముఖిన్ హరించె విజనంబగు కోవెలఁ జొచ్చి జాగిలం
బలరుసరంబు నామిషదురాశ నవింగొనిపోవు కైవడిన్ 70

ఉ. ఈకరణిన్ హరించి యతఁ డేగెడుచో హరిదబ్జమాల్యద
వ్యాకులదృష్టిచాకచకి నశ్రువు లాఁగికొనంగ హా! జయ

శ్రీకమనీయ! హా రఘువరేణ్య! త్రిలోకశరణ్య! నాయెడ
న్నీకుఁ బరాకు సేయఁ దగునే యని యాపికవాణి కూయిడన్ 71

లయగ్రాహి. ఆయెలుఁగుచేఁ బులుఁగురాయనికి జోడగు
జటాయు వమరాలి పగదాయకు మొనై రయో
రీ యొచటికిం జనెఁగి పోయెదు పలాదపశిదాయని
గరున్నఖముఖాయుధసహాయుం
డై యనికిఁ దార్కొని తదీయమగు తే రయుగమై
యహారిసారథికమై యపరథాంగం
బై యిలఁ బడంగెడపి యాయసురనాయకుని
కాయమునఁ గొన్ని యసిగాయములు చేసెన్ 72

గీ. నిశితనఖభిన్నదశముఖత్రిశిఖవిశిఖ
పాశకుంతము నగుచును నాశకుంత
మాతనిక్కృపాణిఁ గనెఁ బక్షపాత మమర
పదమొసఁగుభూమిసుతపక్షపాత మమర 73

సీ. సుగ్రీవసాత్కృతోదగ్రపంక్తిగ్రీవ బహుదోఃప్రతాపసంగ్రహ మనంగ
వాలిరాజ్యప్రాజ్యవైభవాతిశయాంచితోత్పాతహేతుభూతోల్క యనఁగ
మనువంశ్యమైత్రీకృతినిమిత్తపుత్త్రాభిపతదుగ్రభానుబింబం బనంగఁ
నంగదయౌవరాజ్యరమావినోదోచితాసాదివై యన్నదాబ్జ మనఁగ
గీ. నంత వ్రాలె మతంగాద్రి హరులచెంత, నిశిచరేంద్రరథాంతరనీయమాన
జనకతనయోత్తరాసంగకనకపటని, బద్ధపేటీస్థమణిమయాభరణసమితి. 74

ఉ. ఏతరిదైత్యుఁ డాతఱిమహీతనయాకృతభూషణావళీ
పాతము నైజతేజమునిపాత మెఱుంగక లంక కుద్గదా
జ్ఞాతవిరోధిజాతభయశబ్దకలంకకు నేగి శోకసం
స్యూతను సీత నప్పురి నశోకనికేత నొనర్చె వింతగన్ 75

గీ. పోఁకుటింతులు నలువంకఁ జుట్టి యున్న, జనకతనయామణి నశోకవని భజించెఁ
గేసరితనూజవాలోగ్రకీలితోగ్ర, హుతవహస్తంభనౌషధిలతిక పోలె. 76

శా. సారంగం బగుతాటకేయునియెడన్ శార్దూలవిక్రీడితో
దారుండై చనుదెంచురాఘవుఁడు సీతాప్రేరణం జేసి తన్

జేరన్వచ్చినతమ్మునిం గని మదిం జింతాపరుండై దశా
గారం బంత మెఱుంగులేనిమొగులై కంటం దడి న్నింపఁగన్. 77

క. వనదేవత లీతనికా, జనకాత్మజవిరహ మనుచు సహితాశ్రువులై
కనుఁగొనఁగ వియోగవిధం, బనకు న్దారకొనియె దూయమానాశయుఁడై 78

ఉ. కుందనపున్నెకంబు నిటు గొంచు రయంబున రాక నీవు తా
నం దడ వుండినాఁడ వని నాపయి నేరమి సెంత నించి నీ
మందసితస్మితేందురుచి మామకదృష్టిచకోరి చెందకుం
డం దరువాటిలోఁ గినుక డాఁగితి వేమొ? తలోదరీమణీ 79

మ. సకియా నీమదిలోనికోరిక ఘటించన్ లేక మోహాబ్ధిపే
లకుఁ జేరం గొఱగాక పంచవటి చుట్లన్వెట్టు నామీఁదికి
న్నకు నీకున్ సమయంబె తావకవియోగం బిట్లు పైఁపంగ మా
మకదేహం బిది లోహమో విరసపుంబాషాణసందోహమో 80

శా. నీకు న్స్వాంతమెకంబుమీఁదఁ దమియుం టే నేమి కా దంటి నా
రాకాచంద్రున కంతరంగ మగుసారంగంబు రప్పించెదన్
గైకొమ్మా హరిణంబు నీకరమునం గన్పట్టునందాఁక శు
ద్ధాకారుం డతఁ డొందుఁగాక భవదీయాస్యైకదాస్యోన్నతిన్ 81

సీ. నే నింత తపియింపఁ బ్రాణంబుతో నున్నఁ జేర రాకుంటునా చిగురుఁబోణి
క్రొత్తనెత్తుట నేల జొత్తిల్లమి గజాదిచర్వితగాముగా జలదవేణి
పోదుగా తా నొంటి గోదావరీచారుపులినకేలి ఘటింప నలినపాణి
మునిసతీగోష్ఠిఁ జెందదన టన్నఁ బొరుగింటికెలన డాయదు గదా కీరవాణి

గీ. మున్ను సౌమిత్రిహేతిచేముక్కుకోఁతఁ, బడినపగ దీర్చికొననెంచి యడవిఁ బొంచి
యున్న జగజంతరక్కసి యుపరశిఖికిఁ, గబలమై తోఁచెనేమొ కోకంబుకంఠి 82

చ. అని తలపోయు, నుస్సురను, నబ్జముఖీ నినుఁ బాయ శక్యమా
యను, వనవాసపూర్తియెడమ న్దివికేగిన మామసేవకుం
జను టుచితంబె నీ కవనిజా యనుఁ జానరొ నీసమీపమున్
నను దొరయించుకోమి తగునా యను, హాయను, దుర్విధీ యనున్. 83

సీ. వని నొక్కయెడ మిన్కుఁ గని చాకచకి చూపుఁ జనకజతనుకాంతి యని చలించుఁ
బొదరింటికిసలయం బదరిపాటునఁ గోఁపఁ నదిగొ వైదేహికే లని భ్రమించుఁ

గలకంఠ మెలమావిఁ గంఠకాకలి నింప నిదె సీతరొద యంచుఁ గదియఁ బోవుఁ
గెలఁకుతమ్మికొలంకు చలిగాలి మై సోఁక నవనినందనతావి యని తలంచు

గీ. మఱియు రఘువీరుఁ డలఁతఁ ద్రిమ్మరిన తెఱఁగు, విన్నఁ దరమె యట్టిదురవస్థ కనికరంబు
లేక వర్ణించినట్టివాల్మీకి యెట్టి, బోయయో కాక తొలుతటిపుట్టువందు 84

వ. ఈకరణిఁ దరణికులశిఖామణి నిజహృదయపంజరవిహారకగంజశరవినోదకీరమణి యైనజానకీరమణి నయ్యరణ్యాని లక్ష్మణసమేతుఁడై వెదకుచుం బోయి ముందటఁ బురందరాదిబృందారకజయామందభుజబృంద మందోదరీశబందీకృతపిభీతసీతానిమిత్తజాతాహతాలూన పక్షమూలతవలన నేల వ్రాలి యున్నతన జాలి విన్నవించి యంచితవిముక్తిచంచలేక్షణాకుచాభోగమృగమదమేదురామోదసఫలితప్రాణవాయు వగు జటాయువు నజతనయుఁ డురవాపనై వాపసలిలయోజనంబునకు భాజనంబు గావించి, తత్క్షణంబ దక్షిణాశాముఖలక్ష్యమాణ యగు నయోముఖముఖంబున దశముఖానుజాననప్రియసఖ్యంబు గా సంఘటించి, నిలింపులు భయంపడఁ గబంధదోర్బంధనిర్బంధంబున కవరజయుతంబు గాఁ గొంతవడి తగుల్పడి యనంతరం బనశ్రుపాత్రంబు లగు రక్షఃకలత్రంబులనేత్రంబుల కవేలతరవారు లొనఁగుతరవారులం దదీయచండతరబాహాదండకదళీయుగళవేదండతుండపాండిత్యంబు హత్తుకొన వర్తిల్లి, యత్తఱి నరాదుండు మొండెంబు చెండఁ బొలదిండిమేనుం బోనోపి వైమానికుండై కేలుమొగిచి నిలిచి యొకమునికినుక దనుజతను వెనసి మీఁకతన నతిపాపనుండ నైతి నని భావిభావుకనిదానశ్రమణాశ్రమపథంబు సూచించి దివికరుగ, నురుగహనసంగతం బగుమతంగమునితపోవనిం దావుకొని, శబరిసవిధంబు చేరి యప్పులిందసుందరీసమాచరితపూజనోపచారి యై ఋశ్యమూకసరణివిజ్ఞాపనంబు సలుపఁ దదనుజ్ఞచే మనోజ్ఞకీరశారికామృగనికాయంబునకు నాస్పదం బైన గహనపదంబుఁ గడచి వికచారవిందసౌగంధికానుబంధగంధిలంబును, ననుపమేయవనదేవతావితానడోలావిహరణానుకూలంబును నతివిశాలకూలానువేలఖేలావిలోలశుండాల గండమండలమదాస్వాదనానుషంగియు, ననంగజయనిషంగరంగత్తరలతరసాలసాలకుసుమ విసరవిలసదాసవాసారభరవిసారియు, ననేకలతికాప్రదేశలాసికాదేశికంబును, ననూనకాయమానమానితలతాగృహవినోద సాదరనిషాదశాతోదరీకచనిచయవిచికిల మకరంద

బిందుతుందిలంబును, నభంగబిసభంగ భోజనప్రమోదజాలపదగరుత్పరింపరా
సంపాతరయ సముత్పతత్పాథోలవాకలితపాథేయంబును, నగు ననుతటోత్సంగ
పవనంబుచే నెకుర్కొనెనుపంప నవలోకించె నంత. 85

శా. హిందూరాజ్యరమాధురీణభుజభూయిష్ఠప్రజాబర్హిణీ
సందోహాభినవాంబువాహ ఘనవాచాస్వాదుమోదా శతా
నందానందకుమారపాదయుగళీనాళీకపూజాపరి
ష్వందాభ్యంచితపంచశాఖ సుఖితాసంధా కబంధాహితా 86

క. కుటిలారిమరున్నారీ, ఘటనాచణభుజవిహారికౌక్షేయభవ
స్ఫుటకీర్తివధూటీపద, కటకీకృతచక్రవాళ గండరబాలా! 87

నత్కుటవృత్తము అయివరగండ కుండలికులాధిపవాగ్విభవా
నయవినయప్రధాన సుగుణస్ఫురణాభరణా
జయరఘురామభీమబల శత్రువిరామధనం
జయనిభధామ ధీమహితసామ రసామఘవా 88

గద్యము. ఇది శ్రీమదుమామహేశ్వరవరప్రసాద సమాసాదిత సరసకవితావిలాస వాసిష్ఠవంశకీర్తిప్రతిష్ఠాసంపాదక ఋగ్వేదికవి తిరువేంగళార్యకలశ రత్నాకరసుధాకర జగద్విఖ్యాత కవిరాజకంఠీరవబిరుదాంకి వేంకటాచలపతి ప్రణీతంబయిన చంపూరామాయణం బను మహాప్రబంధంబునందుఁ బంచమాశ్వాసము

---

# చంపూ రామాయణము.

## షష్ఠాశ్వాసము

### కిష్కింధాకాండము.

క. శ్రీక్షితివాణీవారిరు, హాక్షీశ్రితదృగ్భుజాస్య యఖిలచ్ఛందో
లక్షణలక్ష్యవిచక్షణ, రక్షణగుణభోజ కసవరాజబిడౌజా. 1

ఉ. పంప స్వల్లదనూనమీనచయుగళీపాళంపరీశాంబరీ
శంపం గన్గొని సీతకన్దళుకు సాక్షాత్కార మైనట్లు వ
ర్తింపన్ ధైర్యము నిల్పలేక విరహార్తి న్రాఘవుం డాత్మఁగం
పింపం జైత్రుఁడు నింతనంతటఁ బ్రతాపింపం దొడంగె న్వడిన్ 2

సీ. జిగిలేవపడఁతికిఁ జెంగావిపావడ యవనీపజోచితయావకంబు
మాధవశ్రీకి నిమంత్రసిందూరంబు కలికానికాయతారలకు సంజ్ఞ
పరభృతవాఙ్మయప్రదశాంభవీరుచి వనికాపురంధ్రి కాననహరిద్ర
వనదేవతచనుంగవకుఁ గుంకుమముడంబు ధారణీరుహశైలగైరికంబు

గీ. కామినీకాముకవినోదకలనకొఱకు, సమయవర్ధకి పొదరింటిగమికిఁ గీలు
కొలిపిన రుటంపుఁగెంపుతాతళుకుటొడు, బిల్లగుము రెల్లకడనుద్భవిల్లెఁ జిగురు

మ మరునందు న్మరుసృష్టి బ్రమాఁకులమెడం బాలించుటెక్కు న్హిమో
పరిసంహారముఁ జూపి తత్త్రిపురుషీభాగాచితిం జైత్రుఁ డొం
దురజస్సత్త్వతమోగుణోన్నతు లనం దోఁచెం జిగుళ్లుం జిగు
ళ్లరకం బయ్యెడుక్రొవ్విరు ల్విరులపట్ల న్వాల్రిలుభృంగంబులున్. 4

చ చనదు వినోదకోప మిఁక సాగవు బింకము లాలకింపుఁడీ
మనసిజుఁ డానతిచ్చినక్రమం బిది యంచు విటీవిటాళికిం
బనుప వసంతుఁ డక్షరసమాజము వ్రాసిన కాగితంబులో
యనఁ దనరె న్నబంభరవనాంతరకాంతలతాంతబృందముల్ 5

మ సహకారద్రుమసారసంయమి పికీసందోహచంచూపుటీ
మహతిం గైకొని పంచమం బతిశయింపన్ షట్పదీగీతికా
బహుళీభూతనినాదరక్తి హావణింపం జొచ్చెఁ ద్రైలోక్యలో
కహృతాహ్లాదకుఁ డైనమాధవుఁడు సాక్షాత్కారముం జెందుటన్, 6

సీ. సుమనోఽపచయమయ్యె సుదతిచూపులకబ్జజనములం గావినోదవనములందుఁ
దవిలె డోలాకేళి ధవయుగ్వధూగాత్రతతులయందు వియోగిమతులయందుఁ
బ్రసవసంపద దోఁచెఁ బ్రతివత్సరవసంతయాజులందు మహీజరాజులందుఁ
గానిపించె రసాలఘనచాపలత కంతుపాణియందును బికశ్రేణియందు
గీ. నాదవెఁ గడురంగు రక్తియు మదనవీర, కదనజయభద్రకాహళీకలకలాను
కరణచణకోకిలకలాపకంఠకలిత, కాకలికలందును బలాశకలికలందు 7
సీ నవలాకటాక్షంబునకు నోఁచెఁ దిలకంబు సకియమో మీఁదగెఁ జంపకంబు
తరుణికే లంటఁ బాత్రం బయ్యె దేమావి గుబ్బెతకౌఁగిటఁ గబ్బెఁ గ్రోవి
వెలఁదినిట్టూర్పుతావి భజించె పాటలి వనితవక్త్రాసవం బెనసెఁ బొగడ
యతివపదాహతి కనువయ్యెఁ గంకేళి పడఁతి నవ్వింపఁ బాల్పడియెఁ బొన్న
గీ. మాటవినెఁ బాటయాలించెఁ బోఁటవలన, నోఁగుఁ బ్రేంకణమనఁగలోకులకునింకఁ
బంకజాక్షులు రేవగలంకపాళిఁ, గిలుకొనకున్న నవేళఁ దాళవశమె 8
వ. ఇట్లు జాతకౌతూహలావహ దశావతారగౌరవుం డైనమాధవుండు కూర్మితోఁ
డై తావృకోన శ్రీవిమోహయు వనరాశిలో నమందరాగం బభినవానంతమణి
కిరణ మహాగ్రాహిగుణయుతంబుగాఁ బలాశసుమనఃపరంపర లలవరింప
నత్తఱిం గరం బుద్భవిల్లి యుద్వేలకాలకంఠకంఠనిర్భరార్భటీ రసాలంబుఁ జెంది
రంభాదు లమర గణికలు ప్రభూత లై తనరఁ, గైతకరజోవిసరపరిపాండురాంగ
సారంగంబు లసమానజననతం జెలంగఁ జంద్రమండలసుధామధురసోద్వెల్ల
తాంతసంతానమందారగపారిజాతప్రభృతు లభ్యుదయంబు నెనయ, నంత నెన
యుడంగరాని మేనిసౌందర్యంబుతోఁ దోఁచు నిందిరాదేవి యన, భుజాంతర
నిశాంతవిశ్రాంతిం జెందినదై, యనంగశాంబరీవిజృంభణం బనెడు కాదం
బినిం బొడమి యులయించుచంచలాలతిక రీతి, లక్ష్యాలక్ష్యతరాకార యై మనో
రథమయూరామసీమ నుల్లసిల్లు కల్పవల్లి యుల్లాసంబునఁ, బాటలప్రభాధరప్ర
వాళరంబన మరులుకొలుపుచు, నవేలమోహామయ విభావరీసమాగమోదిత
యై, శీతాంశురేఖ యన, లోచనచకోరికల నూరించు నంచితగుణాభిజాత
యగుసీత డెందంబునం దవిలి జాలినొందింపఁ బంపాతటరసాలసాలమూల
శీతలశిలోపరి నధివసించి, పంచశరశరవికాసకారణ పటీరగిరిమరుత్ప్రపంచసం
చాలితగభీరతాశరధి యగు దాశరథి లక్ష్మణుం జూచి యి ట్లని వితర్కింపం
దొడంగె. 9

సీ. హృదయవ్యథాశాంతి నొదవించునవ్యదివ్యౌషధి యనఁగ నేయుత్పలాక్షి
కేళియం దనురక్తిఁ గిలించు కూర్మి నెచ్చెలికత్తె యనఁగ నేలలితగాత్రి
యనుకూలత వహించు యజ్ఞదీక్షల ధర్మపత్ని యనంగ నేపద్మపాణి
కలనిలో ధీరయై మెలఁగువీరక్షత్రియాణియనంగ నేయలరుఁబోణి
గీ. శిష్టగురుదేవపూజల శిష్య యనఁగ, నాపదల బంధువన మించు నేపురంధ్రి
యట్టి త్రైలోక్యనుత సీత యిట్టియడవి, నేదియుం గాక డాఁగె నిం కేమిసేయ. 10

మ. మలయాద్రి న్నెలవై మెలంగెడు మరున్మత్తేభ ముత్తుంగత
న్వలరామావృతుఁ డెచ్చరింపఁ బథికవ్రాతంబు లేఁదేఁటిశ్రేం
ఖల మట్టాడుచు శైత్యమాంద్యభరసౌగంధ్యంబుల న్దానధా
రలతోఁ జేరెడు మన్మనోజలజవప్రక్రీడకు న్లక్ష్మణా! 11

చ. అని రఘువీరుఁ డార్తినొలయం గలికాకృతిఁ జెంగమందపుం
జనకు నలక్ష్యపున్నడత సైఁచుట కామనువంశమౌళికిం
జనకజసేమముం దెలుపఁజాలినవాఁ డయి వాలిభీతిచే
నినతనయుండు దాత్య మెనయించి వడిం దనుఁ బంపఁ బంపకుఁ. 12

మ. కటిసూత్రంబును ముంజి పిల్లసిగయుం గౌపీనముం జింకతో
ల్పటుజందెంబుఁ బలాశదండ మమరం బౌలస్త్యకీర్తిక్షపా
విటనాశోచితకృష్ణపక్షచరితస్వీకారధౌరంధరి
న్వటువేషంబు వహించి వచ్చె నటకు న్వాతాత్మజుం డత్తఱిన్. 13

ఉ. వచ్చి యతండు పల్కు రఘువర్యుల నోయనవద్యులార మీ
రిచ్చటికాన యామని కనేకతఁబూన్ప నిమిత్త మేమి యు
ష్మచ్చరణంబు లీయుపలమార్గము సొచ్చుట కెట్టులోర్చె వై
యచ్చరలోకు లిచ్చలకు నచ్చెరువైనవి మీవిలాసముల్. 14

సీ. జిష్ణుచాపవిభూతిఁ జెనయుమీఘనతకు జనలోకసువినతాచరణ మరిది
తమముఁ బోనిడుభవద్రాజమార్తాండవర్తన కింతయాగపద్యంబు వింత
ధృతజటావల్లిలోన్నతిఁ దోఁచుమీభవ్యకల్పనాకృతికి జంగమత హెచ్చు
ప్రాప్తరూపతఁ గాంచు భవదీయమాధవాత్మభవస్థితికి ఘోరతపము చిత్ర
గీ. మార యుష్మద్గభీరత లమృతలహరి, చెవికిలాహిరిఁ గొలుప నాజిహ్వ ప్రహ్వ
యైన దటుగాన మీసమ్ముఖాన కిప్పు, డేను వచ్చినవృత్తాంత మేర్పరింతు. 15

మ. కలఁ డుద్యత్తిరధైర్యనిర్జితహిమగ్రావుండు సుగ్రీవుఁ డ
న్బలియుం డద్రిచరావలి న్ననుపఁ బెంపం దక్షుఁ డామేటికిం
జెలికాఁడై యుండుఁ బ్రభంజనాంశజనసంశ్రీ నాంజనేయుండ లో
కులు వన్ను న్హనుమంతుఁ డండ్రు మిముఁ గన్గోవచ్చితి న్వర్ణినై 16

క. వాలి నిరాతంకమహః కేలిని వారింపఁ గరుణఁ గ్రేఁగంట నిడక
న్వాలినవా రని మీకడ, కేలినవాఁ డనిచె నను మహీవరులారా! 17

మ. అను నయ్యర్కతనూజుమంత్రికి నిజోదంతంబు సౌమిత్రి దె
ల్ప నతం డంత విధేయుఁడై తెరువు సూప న్ఋశ్యమూకాద్రికిం
జని సుగ్రీవునిఁ గాంచి రాఘవుఁడు తత్సఖ్యంబు జాతావనీ
జనసౌఖ్యం బనలాభిముఖ్య మమరం జల్పెం బ్రసన్నాత్ముఁడై 18

చ. అనిలకుమారుఁ డిట్లు హరియై సమవర్తియు నైనభానునం
దనునకు రామచంద్రునకు నం టకమీఁదట బ్రహ్మనాము నే
నను మహిమన్ ఘటింప హరియై సమవర్తియు నైనభానునం
దనునకు వాలికి న్నలువ నం టొనరింపఁదలంచు టబ్రమా! 19

ఉ. అంబుజబంధుసూనుఁ డపుడాధిపయోధి నడంచు మిత్రభా
వంబు తనందుఁ గీల్కొలిపి వాలిఁ గీలి కవార్యమైన శౌ
ర్యంబు నొసంగుసంగరధురంధరుఁడై తరుణీవియోగజా
తం బగుదుర్దశం దెలుపు దాశరథి న్మనమ్మి యాంతట న్. 20

మ. ధరకు న్రావణహుర్మృతాప మడఁగం దద్రామసఖ్యంబుతో
ల్లరికిం గట్టి మెఱుంగువిత్తనము రేఖ న్జానకీపాతితా
భరణంబుల్ గని తాను దాఁచినవి చూప న్వానిఁ గన్నీట సం
స్మరణాభావరజంబు వోఁ దడిపె నైక్ష్వాకుండు శోకార్తుఁడై. 21

గీ. అంతట నిజానుజుఁడు దేర్ప నంతయుడిగి, తపనతనయునిఁ జూచి యోకపికులేంద్ర
యింద్రనందనుతో వైర మేల నీకుఁ, గలిగె నన నాతఁ డిట్లని తెలుపఁదొడఁగె.

మ. మనుజేంద్రా విను మున్ను దుందుభికి మిన్నాయావి యన్నాఁడు వా
లి సరిధ్వాంతమరీచిమాలి రణకేళిం రేఁచికొలై వసిం
జని పాతాళము సొచ్చిన న్విడువ కాశాఖామృగాధీశుఁ డా
తని వెన్నాడి నను న్రసాతలబిలద్వారస్థితుం జేయుచు న్. 22

మ. అరి వెన్నాడి హరీశుఁ డాకరణిఁ బోఁగాడ న్వడిం గ్రొత్తనె
త్తురు లేఁజయ్యెను వాలి గామి మిసిమింతుం జొట నూహించి ది
వ్యరిపుక్రోధగతి న్శిలావృతబిలద్వారుండ నై వచ్చితిం
బురికి న్మంత్రులయాజ్ఞ వారముదినంబు ల్పాలితి న్రాజ్యమున్ 24

క. ఆలో నాలోలశిఖ, జ్వాలోపమకోపశీలి వాలి వడిం శా
శాలోదితుఁడై కృతనతి, నై లోఁగెమునాపయి న్దురాలోచనుఁ డై. 25

క. ఉసురుకొనం గసరిన వెన, దెస చెడి యిక్కొండ నెక్కితి నతం డిటుఁ దా
రసమై వచ్చుటకు న్సాధ్వసపడఁ గారణముఁ దేటపడ విను మింకన్ 26

ఉ. దుందుభిదానవోగ్రజయదుందుభి సైరిభమై నిజోన్నతి
న్వందురి వింధ్య మంతటిది వంధ్యముగా జలధిం గలంచి సం
క్రందననందనుం బిలిచి కయ్యము దీయఁ గపీంద్రుఁ డంత వా
నిం జెగటార్చి తత్తనువు నెత్తురుచేతులఁ ద్రిప్పివైచినన్ 27

మ. లయవాతూలవిలోలతూలగతి లోలాయాంగ మిచ్చో మతం
గయమిస్వామివనాగ్రభూమిఁ బడి రక్తిం బూన్ప నాతండు కో
పయుతుం డై హరిసూతి కీగిరి భజింప న్వానిదోఁప న్శపిం
చె యతీశోక్తి నవాలిపశ్య మగుటం జేకొంటి సీదుర్గమున్. 28

ఉ. వాలిభయంబు వెన్దగుల వర్తిలు నార్తుఁడ నౌట మిమ్ము నా
పాలిటిభాగ్యమంచుఁ దలప న్ధృతిసాలనినాదుడెంద మూం
దోశముఁ బాపె మబ్బు దవధూమముగాఁ దలపోయు కేకి కే
కాలపనంబునింప వలిగాలిగతి న్హనుమంతుఁ డిత్తఱిన్. 29

ఉ. నావుడు రాఘవుండు రవినందన చెందెద వెల్లసౌఖ్యము
ల్నీ వికఁ నావలీముఖు శిలీముఖయుక్తి ననూనవృత్తికిం
దావొనరింతుఁ జిత్రవధనైపుణి నంచు వచించినంతట
న్లావరియంచు నమ్మట కిలం దగుదుందుభిదేహమంఘ్రిభిన్. 30

క. తనపదనఖమున దశరథిరా, జనములు చనమీటి వానిసంశయ ముడివో
మి నతం డదె వాలి దెమల్చినచె ట్లని సప్తసాలిచే వణఁగించెన్. 31

క. లుప్తాశర మగుశరమున, సప్తజగద్భృతినిమిత్తజడజాతజనుః
క్లృప్తస్తంభాశయకృతి, దీప్తం బగుసాలసమితి దెగిపడ నేసెన్. 32

చ. ననుఁ గొని సప్తతాళదళనం బొనరించితి వాపుల స్త్యసం
దననగరంబు సాలదలనంబు ఘటించుట యేమిదొడ్డు నీ
కినజునివంటిబం టనుచు నింద్రజుఁ గన్నుల కెచ్చరించె న
ద్దినమణివంశ్యు న త్తఱిఁ దదీయశరంబు శిలాహతిధ్వనిన్ 33

క. సందేహ ముడిగి యంతట, మందేహవిరోధిసుతుఁడు మాత్సర్యభర
స్పందనుఁ డై పోరికి సం,క్రందననందనునిఁ జీరె గర్జారభటిన్ 34

సీ. స్ఫారితకంఠకఠోరకహాకహాధ్వనిశంక శరభాకృతికి శూలి సంభ్రమింప
వీరభద్రోగ్రహుంకారిమోహవిభీతి దక్షుఁ డంబుజభవాస్థాని గొడుగఁ
బ్రలయాభ్రనిస్వనభ్రమచేత స్వర్లోక జనులు మహర్లోక మనుసరింపఁ
గిటిరాజఘుఘుర్ఘుటీఘుటఘుటభ్రాంతిచే వసుమతీయువతి సంతసముఁ జెంద

గీ. భయద మగుసింహనాద మాభానుసూను, వలన నాలించి కోపించి వాలి వెడలి
వచ్చి చిచ్చుఱపిడుగు కై వడి నిజాను, జన్ము మార్కొని యని సేయుసమయమందు.

చ కరము లురంబులు న్నఖముఖంబులు భిన్నతఁ జెంద నొంచుసం
గరమొనరింపఁ బాల్పడియు గాత్రవిభిన్నతఁ దోఁపనీని య
య్యిరువురఁ జూచి సాయకము నేయక యూరక యుండె రాఘవే
శ్వరుఁడు సభాంతరంబునఁ బ్రసంగము సేయనివాని కై వడిన్ 36

గీ. తరణిజుం డంత వితరణికరణి మార్గ,ణాగతికెదురెదురుచూచి యరికిఁ దలఁకి
తనుఁగదియరా నబాణమోచననిమిత్త, మతని కెఱిఁగించి క్రమ్మఱ ననికిఁబూన్చి

ఉ గ్రీవం గురుగ నొక్క పువ్వుసరముం గీలించి రాముండు సు
గ్రీవుం బంప నతం డకాండఘనమై కిష్కింధఁ జేరం దదా
రావాకర్ణనచే నకర్ణభరతారావాక్యుఁ డై వాలి కో
పావేశంబున వచ్చి కూలె రఘువీరాస్త్రాహతోరస్కుఁ డై. 38

క. అంతట వాలినిపాతో,దంతము చెవిసోఁకి తార యశ్రులహార్యా
క్రాంతతరతారయై శు,ద్ధాంతనిశాంతంబు వెడలి యాళియుత యై. 39

సీ. ఉడివోని కన్నీటిజడి ముద్దునెమ్మోము హిమధూసరాబ్జవిభ్రమముఁ జూపఁ
జిఱునవ్వుదవ్వైన చెంగావిజిగిమోవి ననలేనిచిగురాకు నెనకుఁ దీయ
గద్గదస్వరయుక్తిఁ గంఠనాళంబు మంద్రధురీణ మగువీణవిధముఁ జెంద
ముడి వీడి క్రొమ్ముడి ముంచుకో నెమ్మేను మొగులులోనిమెఱుంగువగలు నెఱప

గీ. వచ్చి హరిలూనకరివోలె బ్రాలియున్న, వాలిఁ గని సోలి జాలిఁ దన్మాలి నంక
పాలి నిడి హేళిజహితానుకీలి నంశు, మాలికలుఁ బల్క శోకవరాలి దోలుక.

చ. సకలజనార్తిహారి యగుచల్లఁదనంబు సుధాంశుమూర్తికిం
బ్రకృతిగఁ దోఁచుకైవడిఁ గృపాళుత నీకు నిసర్గ మట్టి తా
వకకరుణార్ద్రభావనిరవద్యత నెక్కడ నిద్రవుచ్చెనో
యకట మదీయపాతకఫలావగుణంబది రాఘవేశ్వరా 41

మ. ప్రియుఁ డీరీతి రుజన్ భజింప నొడలం బెన్ప్రాణముం దాల్చుని
ర్దయురా ల్రక్కసి యంచు బాణహతి న న్దండించినం బాప మే
మియు నిన్నంటదు తాటకావధముచే మేల్సేయవా యుర్వికి
న్దయితాశ్లేషము గానొసంగు టది పుణ్యంబే యగు న్రాఘవా. 42

ఉ. భూమిపతుల్మృగవ్యరతిఁ బూనుట యుక్త మటంచు ధార్మిక
స్వామివి నీవె యానతి యొసంగుట నాచెవి సోఁకి యుండ శా
ఖామృగిఁ దావకీనశరఘాతనిపాతితఁ జేయకుండురా
యేమృగిమీఁద నేమృగయుఁ డెక్కటికం బిడు రాఘవేశ్వరా 43

క. ఇతనికి భయపడి మును నీ, హితబంధుఁడు ఋశ్యమూక మెక్కినగతి మ
త్పతియు న్నెలకొనియెదు నా, శితవిశిఖాభేద్యహృదయశిఖరీంద్రంబున్. 44

మ. ఇనవంశోత్తమ నీమొనం దునిసిపో నే వాలినో సప్తసా
లినొ మారీచునితల్లినో యవిశిఖాళీభేద్యత న్వజ్రసా
రనిరాతంకహృదంతరాళ నగుతారాకాంత నింతే యిఁక
న్నను నిర్జింపక నీవు ధన్వి ననుకొన్న న్నవ్వరే యెవ్వరున్ 45

గీ. ఇనకులనృపాలు రాదిగర్భేశు లగుట
శౌర్యమును బోలె మార్దవ్యంబు సహజమేమొ
వాలి నిరపాయమన్మనోవసతినుండ
వీనికై యేల తొడరెదు విల్లుపూని. 46

చ. అని విలపించుతార నయనాశ్రుజలశ్వసనార్తిజాతచే
తనుఁ డగురీతిఁ గన్దెఱచి దాశరథీశ్వరుచేతి కంగదు
న్మనుచుట కొప్పగించి దిననాయకసూతికిఁ దా వహించుకాం
చనమయదామకం బొసఁగి సద్గతికిం జనె వాలి యత్తఱిన్. 47

ఉ. శాఖిపినాయకప్రవర పాదశకంధరదండశూకబం
దీకరణాహితుండికవలీకృతవాలధి హాగునైకర
త్కాకర హోయితే దివిక నంచు వలీముఖు లాచరించి రై
త్పాకునియాజ్ఞ సంక్రియలు వాలికి శౌర్యజితాంశుమాలికిన్. 48

క. మహితనయావిభుఁ డంతట, మిహిరజు నభిషిక్తుఁ జేయ మేఘము లర్ఘ్యా
వహము లయినట్లు తన్మహి, మహిషిని నభిషిక్తఁ జేయ మఱి దివిఁదోఁచెన్.

చ. తనుఁ గిష్కింధ వసింప వేఁడుకపినేత ప్రాఘువుం డేఁ బురం
బునకున్వచ్చు టయుక్త మీఘనదినంబు ల్వీట నీ వుండి ర
మ్మని వీడ్కొల్ప నతండు నేగి నిజరాజ్యప్రాజ్యసౌఖ్యాప్తిఁ బొ
ల్చెను రాముండును మాల్యవంతమున నిల్చె న్వానకై యయ్యెడన్. 50

— * వర్షాకాలవర్ణనము * —

సీ. హలధరహృదయప్రియాసహాకరంభణం బాశాంతవిపినాంతహవ్యవహము
శాంబరాడంబరచ్ఛన్నాబ్జహితబింబ మచిరాంశురుచిదీపితాంబరంబు
నవనవారచితార్జునవికాసగరిమంబు ధార్తరాష్ట్రనిరాసదాయకంబు
శితికంఠబాంధవప్రతిపాదనోచితం బాయతశక్రగోపావనంబు

గీ. వితతఘనఘోషపోషణం బతిశయోద, యాశ్రితకదంబమాత్తమహావనాగ్ర
జాతికమునై తనర్చి వర్షాదినంబు, దేవకీనందనునిఁబోలి దెలిపె నపుడు. 51

చ. సరసుఁగొలందు నన్నుఁ దనచాయల వాలి నడంచె మత్పురం
దరవిభు నడ్డ సేయక యితం డని రాఘవునాలిజాలి ము
న్నరకకుఁ జెప్పుపోలిక ఘనాఘనమాలిక తత్ప్రియాసమా
హారణ జలాశ లాశలను నాఁగె సగర్జితసింహనాద యై 52

క. కయికొనియె ప్రాజులపస, మొయి లపుడు నిరస్తతాపము న్సత్పథవ
ర్తియుఁ బౌరస్త్యమహాబల, రయచలితము జీవనస్ఫురద్వసుధము నై. 53

వ. అత్తఱి వియత్తలంబు హత్తి లాగెత్తు మెఱుపుటాలపులాఁడిన రత్నచమత్కృ
తికి నచ్చెరుపడి వియచ్చరోచ్చయంబు లిచ్చిన చిరత్నవరత్నబిరుదమంజీరవల
యంబుమంజిమం జడల నాఖండలీయకోదండంబు దోఁప, నాపురందరశరా
సనంబుఁ గొని ఘనుం డఖండనిజమండలాసహంబు లిప్పాండురాండజంబు లని
శరాసారంబుఁ గురియింప సొంపుసెడి యంచగుంపు లలకకెలఁకుకొలఁకున కై
వడిన వలి వఱచి వెఱచఱచుటకుఁ గేకవైచు కేకికలకలంబునకు నలిక

కేతకీతతి భుజంగసంఘంబు డంగ, నారీతతి భోగినీపతుల కగు మొగలితెగల
తగులునకు నగుపగిది వికచకుటజనిచయరుచిర యగుచు నరణ్యానిచే నగణ్య
యగు ప్రావృషేణ్యప్రక్రియకు విక్రియం బూని యయ్యాజానకీజాని యత్యుగ్రంబు నిర్
ర్ణించి యి ట్లనియె. 54

మ మెఱుపుందళ్లు మిటారిచాయ దెలుప న్మేఘుండు తన్వంగిపె
న్నెఱిగుంపున్నెఱయింప జాదినవలా నెత్తావి పై నింప నెం
దఱిఁ జిందుల్గొను నెమ్మిగొమ్మ నటన ల్దార్పంగఁ గందర్పుఁ డి
త్తఱి నేపాంథుని నొంపఁ డీనవపయోధారాసమీరాహతిన్ 55

పృథ్వి. చెలంగె నలుదిక్కులన్ శిఖిశిఖావళీకంఠ కా
హళీధ్వని వియోగితా మపి నరేషు నారీషు వా
జలాకులఘనే దినే నపది యాంతి కే కా యితి
చ్ఛలారభటితో మనోజరణవేగసంసూచి యై. 56

ఆ-గీ అభ్రగర్భనిర్యదంబుధారాకరం, బితసమీరభరసమీర్యమాణ
వికచకుటజకుసుమవిసరంబువలన నా,కాశవలయ మనవకాశ మయ్యె. 57

మ. వనధింగ్రోలెడు నీటితోఁ దొడరు నార్వజ్వాలచేఁ గుత్సి యె
ల్లను దస్తంబగుటం జలించి యువి మర్లం గ్రాయఁజొచ్చెన్ ఘనా
ఘనసందోహము లభ్రచారిదివిషద్గాణిక్యమాణిక్యమో
హనభూషామణిదాయులై ద్యుతలతావ్యాజంబుచే నిత్యుడన్. 58

క. సౌమిత్రీ కంటివె చా,లై మహి డిగువర్షధార లభినవజలద
స్తోమశ్యామలపత్ర, వ్యోమన్యగ్రోధశాఖయూడలువోలెన్. 59

వ. అని వియోగవ్యథాదూయమానుం డగురఘుసూనుం డొక్కవిధంబునఁ
బయోదమలినంబు లగుదినంబులు గడపె నంతట, 60

మ హరినిద్రారజనీదినోదయము హర్షాకర్షణోపాయమం
త్రరహస్యం బచిరోపయోగ్యఫలకేదారం బనాలస్యపా
దరిషేలానటనాంతమాంగలికగేయం బన్వితాన్యోన్యకై
త్రరణోద్యోగమహీధవంబు శరదారంభంబుదోఁచె న్దిశన్. 61

సీ. కాకుత్స్థునిరహోకులాకారదశఁ బూనుకరణి మేఘుండు పాండురతఁ జెందె
నినవంశ్యుఁ డెత్తు పిల్లిక నంచుఁ దాఁగిపోయున రీతి నిలదమ్ము నింద్రధనువు

రఘువీరకీర్తినర్తకీచక్రిణికాయుక్త మగుచామరంబులై యమరె తెల్లు
కపివాహినులపిండు శాఁగల్లుటూహించి యుంబువాహినులెల్ల నాఁటఁదొడఁగ

గీ. లంకవంటిది యింక నిశ్శంకరాజ, హంససంచారమునకుఁ దావగు నటంచుఁ
జంకియై లోఁచెఁ బుడమి నిశ్శంకరాజ, హంససంచారమునకు నయ్యవసరమున,

శా. చేతోజాతశరప్రణీతహృదయచ్ఛిద్రప్రణాళీవిని
ర్యాతస్నేహమయప్రతిశ్రవభరుం డై యుండుమార్తాండి రా
గాతివ్యాప్తి నిరాకరింప భృతకోపాటోపచాపోగ్రతిన్
సీతానాయకుఁ డంప లక్ష్మణుఁడు వచ్చె న్వేగఁ గిష్కింధకున్ 63

— * లక్ష్మణుఁడు కిష్కింధకుఁ బోవుట * —

శా. వాలిప్రోద్భవుఁ డప్పు డంతిపురిక్రేవ న్నిల్చి రాగాంధత
న్రేలెల్ల న్రతిజాగరూకుఁ డగుట న్మేల్కాని సుగ్రీవుని
ద్రాఘుత్వమ్మునకు న్విచారపడు నో రామానుజాలోక భీ
తాలోలప్లవగారవాపహృతనిద్రారక్తనేత్రాబ్జుఁ డై 64

క. లేచి కొలువుండి సచివుల, వాచోన్నతిఁ బ్రకృతిఁ జెంది వర్తిలు నవై్వ
రోచని సౌమిత్రిధను,ర్జ్యాచండస్వనాదనిశమనానతముఖుఁ డై. 65

మ. ఘనఘోషస్ఫురితిచేఁ దలంకునహిరేఖం బీఠముం డిగ్గుచో
హనుమంతుండు నినున్ జయోన్నతునిఁ జేయ న్నెయ్యపున్గినఁ ద
మ్మునిఁ బంపం జను రాఘవుం డని భయంబు న్మాన్ప సౌమిత్రిసాం
త్వనకై తారనుఁ బూన్ప వెల్వడియె నత్తన్వంగి శుద్ధాంతమున్ 66

గీ. వారుణీయుక్తిఁ దేహంబు వదలి రాజు, కనఁబడ నిశాంత మవుడు నిష్క్రాంతతార
మపగతతమంబు నయ్యెఁ బూర్వాశ నత్త, మిలెను సత్పథసంచారి మిత్రుఁ డమర

ఉ. తారధరావతారకరతార యనం దులలేని మేన్ని శృం
గారముతోడ సెన్నడలఁ గార్యవశత్వరఁ దెల్పు నూత్నము
క్తారశనాగుణాంఘ్రికటకస్వనితార్భటితోడ లక్ష్మణుం
జేరఁగవచ్చి కేల్మోగిచి చిల్కఁదొడంగె వచోమరందమున్. 68

చ. బిసరుహబంధుపూతి నొకపెద్దిరిపైఁ జెలియిడ్డ యింద్రజ
వ్యసనమడంచె మున్ను రఘువర్యశరం బది యుండుఁగాక నేఁ

డాసపడిచంటికగట్టుఁ దిగనోపని యీకపిరాజుపేంద్రదా
వ్యసనముఁ బాపె నద్దిర భవద్ధృఢచాపవిటంకటంక్రియల్. 69

శా. లోకాలోకముదాఁక నేకగతి నాలోకింపఁ జాల్పడ్డ యీ
లోకాలోకవిధాయిసూనుఁ డివు డిల్లు న్వాకిలిం గల్గి వ
ర్షాకాలోదిత మైనపోణిమికి నోఁచం జాలె నిన్నాళ్లకు
న్నీకారుణ్యమువంక నిట్టి హితుని న్నీ విట్లు కోపింతురా? 70

వ. ఏవంవిధోదారతారావచనచారిమాపనీతకోపాటోపతానముత్పన్నప్రసన్నతామిళన్నిరవధికమైత్రి యగు సౌమిత్రి వెంబడి హనుమదానీతనానావిధానూనవానరానీకినీవితానసంసేవ్యమానుం డగుచు చండభానుసూనుండు రాఘవుం డున్నకొండదరి కరిగి యతనియడుగుదమ్ములకు నెఱఁగి తదాదరణాభరితకౌతూహలాంతరంగతం జెలంగి యాతట. 71

— * సుగ్రీవుఁడు సీతను వెదకుటకు వానరుల నంపుట * —

సీ. తళుకుబేగడకొండదండనుండు నితండు పారియాత్రతటీవిహారుఁ డితఁడు
వలిగట్టుచెట్టుపట్టుల మెలంగు నితండు నిషధాద్రిమేఖలానిలయుఁ డితఁడు
తఱిమెట్టుజాళువాదరి కాఁపరి యితండు గంధమాదనవనోత్కరుఁ డితఁడు
కడనేలదాల్పు నిల్కడఁ జెలంగు నితండు వింధ్యాటవీజాతవిహృతి యితఁ

గీ. డని మఱియు నెన్నవసపోని యచలవితతి, నధివసించియు సంఖ్యకు నధికమైన
వానరేశుల వేర్వేఱఁ గానిపించి, యినతనయుఁ డప్పు డారాఘవేంద్రునాజ్ఞ 72

సీ. మిహిరుండు వొడము వోమేనుతోల్సంజకుంకుముటెక్కుఁ బూనుదిక్కునకు వినతుఁ
బరువంపువిరిపంటిదొరమత్తకరి యత్త మిలుహరిత్తునకు సమీరతనయు
మొసలితేజవయాళిమురిపంపుజగరాతు సామి గానోఁచునాశకు సుషేణు
జంటనాలుకకంలసరిదంటచెలినంటు గలదిశకును శతబలికపీంద్రు

గీ. నెలకు జానకినేమంబుఁ దెలిసిరండ, టనుచుఁ బంచిన వారలు నచట నచట
నరసి ధరణిజఁ గానక మరలి రంత, హనుమదాదులు దక్షిణంబునకు నడచి. 73

శా. పోవం బోవ నఖండకండుజటిలభూమీభంగజాతస్థలీ
భావోదగ్రసరణ్యరణ్యధరణీభాగంబునం దోకపర
క్షోవీరుం డెదిరింప వానరబలస్తోమంబు గంపింప న
చ్చో వాలిప్రియసూనుఁ డానిశిచరు న్వాలాగ్రఘాతాహతుఁ. 74

క. కినుకం దోడరి కచాకచి, యని సలిపి తదీయగాత్ర మసురహితముగా
నొనరించె సురహితం బగు, తనచరితము జనుల కద్భుతము గావింపన్. 75

ఉ. అంతట వానరప్రముఖు లద్రివనద్రుమదంతురీభవ
త్ప్రాంతరయానుజన్య మగు శ్రాంతత వాయ నుపాంతవర్తివే
శంతము పొల్పుఁ దెల్పునవసారససౌరభవంతము న్మధు
స్వంతము మెచ్చి యొక్కబిలవాటము సొచ్చి తదంతరంబునన్. 76

చ. మును పజుఁ డొక్కమానితపముం జెలువ న్మది మెచ్చి హేమ ని
చ్చిన మయుకృత్తహేమవనిఁ జెల్వగు మేరుసవర్ణి కూర్మినం
దన నొకతె స్వయంప్రభ యనందగు దివ్యవధూటిఁ గాంచి యా
వనిత మహత్త్వశక్తి బిలవాటము వెల్వడి వచ్చి రొక్కెడన్. 77

— • హనుమదాదులప్రాయోపవేశప్రయత్నము. • —

క. మిట్టాడ నరుఁడు పుట్టని, నట్టడవి వసించి కపులు నాథుఁడు మనతోఁ
బెట్టినమితిఁ దప్పియు మహి, పట్టిం గనమైతి మెట్టిపాపం బనుచున్. 78

చ. కళవళమంద నంగదుఁడు డీకొన్న నూరక పోయినప్పుడే
తలఁ దెగవ్రేయుఁ గాని యొకతప్పును గావఁడు భానుసూనుఁ డా
ఖలమతియుగ్రదండమునఁ గాయము వాయుటకంటె నీవన
స్థలి మునివృత్తిఁ బ్రాణములు దాల్చుట మే లగునంచుఁ బల్కినన్. 79

మ. హనుమంతుం డను నేటిమాట పలికార్యం బట్లు పోకార్చి యీ
వని నెట్లుండెదువార మాదొరకు దవ్వై యివ్వనం బెంచఁ దూ
త్రినఁ బోనీయక పంపువెట్టి తల లేత్రించుం గపిస్వామి యొ
ప్పని యాలోచన మాని మే న్నడలుఁడీ ప్రాయోపవేశంబునన్. 80

గీ. అనుచు హనుమదాదు లైనవానరులు ప్రా, యోపవేశమునకు నుద్యమంబు
సలిపి కుశలయందు శయనించువా రార్తి, తోడఁ జింతసేయఁ దొడఁగి రిట్లు 81

మ. మనువంశంబునఁ బుట్టనేమిటికి రామస్వామి దాఁ బుట్టఁగా
క నిగాఢాటవి కేల వచ్చె గురువాక్యస్వీకృతి న్వచ్చెఁగా
క నిశాటేశ్వరుఁడు సీత నెత్తికొని లంకామార్గముం జేరనే
ల నతం డేగ జటాయు వాయసుర నేలా తాఁకి కూలె న్మహిన్. 82

క. కూలినజటాయు వట్టి పో, కాలక రఘుపతికి సీతఁ గైకొని చనియెం
బౌలస్త్యుఁ డనుచుఁ దెలుపఁగ, నేల యుతం డలకబంధు నేలాతునువాన్. 83

గీ. వచ్చినకొ బంధుఁ డీటికి కొంచరి తెలియఁగుఁ, జెప్పు నదియేటి కినసూను చెలియఁ డొల్లె
వాలి వధనేల సుగ్రీవుఁ డలనేల, మనము రానేల యీనేల వనరనేల ! 84

క. అని వనరుకపుల పరిదే,వనమునఁ జెవిసోఁకు రాఘవుకథాసుధ ము:
న్నినరుచిఁ గమురినతౌకపుల, పునరాగమ మనుజవిగముముం దెప్పుటయుఁ. 85

మ. గుడి నామోదము ఖేద మొక్కట జనింప న్లేచి తా నున్నవ
న్య దరి న్వల్లవ్రడి వచ్చి యుత్తతి నిజోదంతం బెఱింగించి యే
ల దిగు ల్మీ కిఁక రామదూతలకుఁ గల్యాణంబె సంధిల్లు న
ల్లదె మున్నీ రదె లంక దాశరథియిల్లా లందు వర్తిల్లెడుఁ. 86

క జనకజకుశలముఁ దెలియం, జనుఁ డని సంపాతి తెలుప సంతసపడి యా
తని గారవించి యంగద, హనుమన్ముఖు లచటుఁ గదలి యటుచని యెనుటఁ. 87

సీ. అంజనగిర్యధిత్యక శాద్వలస్థలి పచ్చతాకోణిగలోఁ బారువంబు
బలుతుంగమడువులో పలికరేణువు వట చ్ఛదములో నిమువైన శౌరిమూర్తి
దానవారియురంబులోని శ్రీవత్సంబు భానుజాంతరపద్మపత్రసమితి
కాదంబవనిఁ దోఁచు నాదిమశ్యామిక మింటనంటినసీలమేఘరేఖ

గీ. యనఁగ నిజమధ్యమున ధాత్రి దనర మెఱయు
భవాలవాతూలజవము హర్మ్యహారుదగ్ర
లహరికాజాలడోలికావిహారదంబు
నరవితానంబు జలనిధానంబుఁ గనిరి. 88

గీ. కనిదురాలోకశరత భీకరతఁ జూపు, శరధికి మొగంబుగాక దాశరథిశరధి
యట్టిదగుటకు ఘట్టిదం బైనకలఁకఁ, గపు లలుకతోడ నుండ నంగదుఁడు పలికె.

మ. తగునా వానరులార మానయుతు లై తర్కింప నీ కొయ్యెడ
న్నగరు ల్దగ్గిన యుప్పుకాలువఁ దరించన్ శక్తి లే కున్నచో
నగసంస్తంభనమానిగాలి కటు డాయంగాక యారాప్తిగ్ని కిం
దెగనాడ న్వనపోని దుర్యశపుటబ్ధి న్నక్కమా దాఁటఁగన్. 90

— • జాంబవంతుఁడు హనుమంతుని సముద్రలంఘనమునకుఁ బ్రోత్సహించుట. • —

వ. అని పలుకు నంగదుని వలన నంగద లడంగ నఖలప్లవంగపుంగవు లభంగుర
తరంగిణీభుజంగహారీణాప్రసంగరీణత మెలంగడు తెఱంగు లూహించి యం
ధిత నమోఘాయువంతుఁ డగు జాంబవంతుఁ డుదయగిరిశిఖరజాత చూతసూ

తనఫలవిమోహకౌతూహలగృహీతాభినవమార్తాండమండల ప్రచురబాల్య
చాపల్యకుపితపురుహూతకరవిధూతభిదురపాత నిహతహనుమదతిఖ్యాతనా
మధేయుండును, జరాచరనిరోధబాధాకరసమీరణ ప్రసాధనాయాతజలజాత
జాతకరుణాసమాసాదితాసాధారణ బహువిధవరదానపాయకాయుండును, సఖం
డజవసమానాయమానపవమానవైనతేయుండును, నగునాంజనేయుం డిష్టు
మెడ కరుగుదెంచి, యతనియతిశయంబు బహుధానుతించి, వెండియు నా
వలీముఖశిఖామణుల కిట్లనియె 91

సీ. శాఖామృగస్వామిశాసనంబునఁ దరింప గండమై యుండిన నుండుఁగాక
విగళితారికళంక యగులంక యిచటికి దూరమై తోఁచినఁ దోఁచుఁగాక
దశకంఠభుజమహాదర్ప మల్పేతరస్థేమ వర్తిలిన వర్తిల్లుఁగాక
యవనిజ యునికి మర్త్యామర్త్యగోచరేతరవృత్తిఁ దొరసిన దొరయుఁగాక
గీ. చింత యేటికి మన కింక నెంతకార్య
మైనఁ బవమానసూనుఁడు పూనుకొన్న
సులభత వహించు నితఁడె కావలయు నన్న
గోష్పదముకంటె మున్నీరు కొంచియంబు. 92

మ. అని భల్లూకనిలింపనేత పలుక న్హర్షాకులస్వాంతుఁడై
హనుమంతుండు త్రివిక్రమానుకృతిచే నంగంబు పెంపొందఁ బ్లవం
గనికాయంబు చెలంగఁ దుంగలహరీగంభీరవారాశిలం
ఘనజంఘాలజవానుషంగమునకుం గావించె నుత్సాహముల్. 93

క. తత్త్వాదృశాసిధారా, కృత్తారాతిక్షితీశకీర్తిశ్రీరా
జత్తర యహార్యధీరా, చిత్తశయాకార యార్యశేఖరగేయా. 94

చ. సలలితరత్నకందుకలసత్కుచభారధురీణహల్లూణాకుం
తలరమణీసకంకణరణత్కరణాంచితపాణిపల్లవాం
చలపరిధూయమానసితచామరమారుతలోలమానమం
జులచికురచ్ఛలభ్రమరచుంబితచారుతరాననాంబుజా. 95

ఉ. సాధూన్నతిగాంగేయ, త్స్మాధర ప్రాప్తోపరాష్ట్రాబ్ధ్యావ్హానసమా
రాధితరాధారమణా య,సాధారణవారగేంద్రదసప్తాంగహరా, 96

ఉత్సాహ. సింగరిక్షితీంద్రచంద్రసేవ్యమానభవ్యకీ
ర్త్యంగలావనీశశక్రవిశ్రుతాగ్రసంభవా
రంగనాథపాదపద్మ రాజహంసమానసా
సంగరాంగణప్రచండశౌర్యగాండివాయుధా 97

గద్యము. ఇది శ్రీమదుమామహేశ్వర వరప్రసాదసమాసాదిత సరసకవితావిలాస, వాసిష్ఠవంశకీర్తిప్రతిష్ఠాసంపాదక, ఋగ్వేదికవి తిరువేంగళార్యకలశరత్నాకరసుధాకర, జగద్విఖ్యాతకవిరాజకంఠీరవబిరుదాంక, వేంకటాచలపతి ప్రణీతంబైన చంపూరామాయణం బనుమహాప్రబంధంబునందు షష్ఠాశ్వాసము.

---



# చంపూ రామాయణము.

## సప్తమాశ్వాసము

— * సుందరకాండము * —

క. శ్రీకర విధ్యండనరో, జాకరవర్ధిష్ణుకీర్తిహాంసత్రోటీ
ధీకృతకాంచనశైల ని,రాకృతరిపుజాల కనవరాజనృపాలా 1

ఉ. చారణమార్గసీమను నిశాచరనాయకనీత యైనసీ
తారమణీశిఖామణిని దా వెదక న్మదిఁ గోరి వైరిసం
హారిబలోజ్జ్వలుం డెగసె నారఘునాథునిదూత తుంగశృం
గోరుమహేంద్రసానువుననుండి యఖండఖగేంద్రవేగుఁడై 2

— * హనుమంతుఁడు సముద్రముం దాఁటుట * —

వ. అప్పు డప్పుడమితా ల్పనల్పకల్లోలినీవల్లభసముల్లంఘనదృఢతరనిహితహను మచ్చరణతలపీడనంబు సైరింపంగ నక్షమం బై, నిశ్శేషనిస్సరన్నిర్ఝరఘోషం బగుట నిరంతరనిష్ఫతద్బాష్పవర్షంబునుంబలె, నితస్తతోవితతజీమూత జాతం బగుటఁ జారిప్లవశిథిలధమ్మిల్లంబునుంబలె, సంత్రాసపుంజితకుంజర యూథం బగుట సంజాతశ్వయథుకంబునుంబలె, సాధ్వసధావమానహరిణ గణాఖురతరఖురకోటిపాటనోద్ధూతధాతుధూళీపాళీపాటలితవికటకటకం బగుటఁ బ్రకటితశోణితంబునుంబలెఁ, దక్షిణప్రబుద్ధకంఠీరవకంఠకహాకహారావముఖరిత కందరం బగుటఁ గృతాక్రందనంబునుంబలెఁ, బరిసరగహ్వరనిబిడనిస్సరత్సరీ సృపం బగుట నిర్గళితాంత్రమాలంబునుంబలెఁ, బ్రస్ఫారితతటోపలపతనదళిత కీచకసుషిరసమ్మూర్ఛత్పవనపూరపూరితగగనం బగుటఁ బ్రవర్ధమానోర్ధ్వ శ్వాసంబునుంబలె, వాగగోచరం బైనపర్వతావిశేషంబు నొందె నయ్యెడ 3

ఉ. కేసరిసూనువెంబడిని ఖేచరపద్ధతి నుద్గమించి యెం
తే సరయంబుగా జలనిధిం బడి బంతిగ నుచ్ఛ్రితంబులై
భాసిలు భూమిజాతములు భావినలాళినిమిత్తసూత్రవి
న్యాసనిఖాతశంకునివహంబుగతిం గనుపట్టె నంతటన్. 4

ఉ. శ్రీకరపక్షఘాతరయసేచితవీచివిరోచమానర
త్నాకరకుక్షినుండియు మహాబలనందనవిశ్రమార్థ మై
ప్రాకటతుంగశృంగతలరాజితనిర్ఝరలోక మైన మై
నాకనగంబు సంభ్రమమునం బొడసూపె మహాద్భుతంబుగన్. 5

క. తనయాత్రకుఁ బ్రత్యూహము, జనియించె నటంచుఁ దను భుజామధ్యతటం
బునఁ దాఁకి త్రోయు ప్రాభవ, జనిఁ జూచి హిరణ్యనాభశైలం బనియెన్ 6

క. మోదమున వచ్చితిఁ జుమీ, నీదుపథిశ్రాంతి నడఁప నే నిపుడు కృత
జ్ఞోదధిపనుపున నిచ్చట, సాదరముగ విశ్రమించి చనుమా హనుమా 7

క. పూని గిరిభేదివలనం, దా ననుఁ గాచె న్భవజ్జనకుఁ డటుగాన న్
గాను విపక్షుఁడ నీకిపు, డేను సపక్షుఁడఁ జుమీ సమీరకుమారా. 8

వ. ఇవ్విధంబునం బ్రార్థించు నవ్వసుంధరాధరంబును సబహుమానంబుగా నాదరించి పవమానతనయుం డరిగె నయ్యవసరంబున. 9

మ. జలరాశి న్వలమానమూర్తి యగు నాశైలాధిరాజాత్మజు
న్వలమానాతిశయప్రమాథకులిశవ్యాపారుఁ డీక్షించి త
ద్బలవన్మారుతసూనుసేవనవిధిప్రాగల్భ్యము న్మెచ్చి యిం
పొలయంగా శతమన్యుఁ డయ్యు గతమన్యుం డయ్యెఁ జిత్రంబుగన్. 10

ఉ. అంత నిశాచరేశ్వరపురాభిముఖంబుగ నేగు నంజనా
సంతతి సాధుపద్ధతికి సంభరితోద్ధతిరోధహేతు వై
యొంతయు నిల్చె నాగజనయిత్రి వడి న్సురసాఖ్య మున్ను భా
స్వంతునిత్రోవ కడ్డపడు శైలకులప్రవరంబు చాడ్పునన్. 11

మ. స్థిరసామర్థ్యమునం దనర్చె సురసాధిక్షారలీలానమా
దరసాధిష్ఠితమీఱు మారుతిపదద్వంద్వంబు కల్లోలినీ
శ్వరసాంగత్య సమేధమానమయి మస్తం బామరద్వీపినీ
వరసాంభఃకమాలికాభరణాశస్తం బై సముద్భాసిలెన్ 12

క. తనువుం దనూకరించుచు, హనుమంతుఁడు సురసయుదరమ్మందుఁ బ్రవేశం
బొనరించి వెడలి వర్తిలె, దనుజారి త్రివిక్రమావతారము దారిన్. 13

శా. భూయఃప్రస్తుతనిస్తులాంబరపథాభోగప్రయాణుండు త
చ్ఛాయేశాన్వయదూత శాతముఖతాజాగ్రన్నఖాగ్రంబులన్

మాయాసింహమ్మునై వడిం గడువడి న్నమ్మారుతి చించె న్నిజ
చ్ఛాయాగ్రాహిణి యైనసింహికఁ జకాసన్మూర్తి నత్యుగ్రుఁడై 14

— * హనుమంతుఁడు సీతాన్వేషణమునకై చింతించుట * —

ఉ. అంబుజబంధుతేజుఁ డగునా హనుమంతుఁడు వారిరాశిపా
రంబునుఁ జేరి లంబశిఖరంబున నిల్చి యనంతరంబ తీ
వ్రంబుగ లంకయుత్తరపు వాకిటనుండియు ఖండితాంతరం
గంబునఁ జింతిలం దొడఁగెఁ గార్యసిసాధయిపాధురీణుఁడై. 15

సీ. కడచు నేకరణి శాఖామృగానీకంబు ప్రత్యూహాకరము వారాకరంబుఁ
గడచుఁగా కేరీతి వడిఁ బ్రవేశించు నీరజనీచరాధీశరాజధాని
గావున సర్వథా కపి నిరర్థకమనోరథుఁడౌఁ గదా పంక్తిరథకుమారుఁ
డదికాక యేను మహారౌద్ర మాగు నీసముద్రమ్ము దాఁటుట మోఘమయ్యెఁ
గీ. గటకట యెఱుంగ సకలలోకప్రతీత, సేమమున నున్నదియొ లేదొ భూమిజాత
యని తదన్వేషణార్థమై యాంజనేయుఁ, డరుణకిరణాస్తమయమాత్ర నభిలషించె
క. శతమఖనిక్షేపమహా, ద్భుతధనువునకుం బ్రయోజనావసర ముపా
గత మని పాశికిఁ దెలుపంగ, ధృతిఁ జనుగతి భానుఁ డుం బ్రతీచిం జేరెన్ 17

— * రాత్రివర్ణనము * —

సీ. చరమాచలనితంబసంభవోజ్జ్వలదావపావకోత్కటశిఖాపాటలితమొ
సవిధార్కకరశ్మివేష్టనభృతానలతటీసూర్యకాంతప్రభాశోణితంబొ
యాగంతుమిత్రపూజార్ఘ్యార్థవరుణోద్ధృతాంభోధిరత్నకాంత్యరుణితంబొ
ఖనదీరసగ్రహోగ్రత్వరాపరపయోరాశిబాడబహేతిరంజితంబొ
గీ. యని జనులు డెందముల సందియంబు నొందఁ
గరము రాణించు సాంధ్యరాగంబు వలన
గగనభాగంబు కౌసుంభకంజరాగ
పల్లవజపాభిరూపమై యుల్లసిల్లె 18
గీ. క్షీరవారాశికన్యానికేతనములు, ముందుగా నత్తఱిని బీగముద్ర లయ్యె
వికచకుముదాళి మధుకరద్విజకులంబు, నవ్యమకరందభిక్షాటనం బొనర్చె 19
మ. నలుదిక్కు ల్మొదమంద వీవఁ దొడఁగె న్సంపుల్ల శేఫాలికా
కలికాశాపకషాయగంధవహము ల్గాఢాంధకారచ్ఛటా

చ్ఛలకాలాగురుధూపధూమసమితిశ్యామీకృతం బయ్యె ను
జ్జ్వలదిక్పాలపురాభిరామసముదంచద్గోపురంబు ల్వెసన్. 20

గీ. పొడమెవిశ్లేషవేదనాపూర్వకంగ, నై కోలాకులఁ జక్రవాకార్తరవము
లలితనక్షత్రమాలికాలంక్రియాభి, శ్శోభితం బయ్యె గగనమత్తేభ మపుడు 21

క. సంతమసతమాలద్రుమ, కాంతారకుఠారధార కహ్లారవనీ
కాంతుఁ డుదయాద్రిఁ దోఁచె, న్నంతతశృంగారసారసర్వస్వం బై 22

క. ఆజాబిల్లికరంబులు, తేజగిలె న్దివిఁ దమ స్తతినిరుద్ధము లై
రాజిలుకొలఁకుల శైవల, రాజితిరోహితబిసాంకురమ్ములు వోలెన్. 23

చ. అనిలజుఁ డాప్రదోషసమయంబున న్గాత్రవకీర్తిమండలం
బనువిలసత్తిరస్కరణి యాశుగతి న్నడలించి కన్పడెన్
ఘనసుమనోగణంబునకుఁ గౌతుక మావహిలం బులస్త్యనం
దనకటకప్రవేశనవనాటకపాటవసూత్రధారుఁ డై 24

సీ. ఆవేళ లంకాధిదేవత తనతోడ విగ్రహింపఁగ వధూవిగ్రహంబు
ధరియించి పథినిరోధము సేయఁ దద్విగ్రహ మొనరించి యుగ్రతవహించు
తనుఁ జూచి వారిజాసనశాసనంబుఁ దెల్పు తొలువేల్పుపడఁతుకపలుకులకును
డెందంబునందు నానందం బమంద మై నలువొంద నంజనానందనుండు

గీ. తదనుమతిఁ గాంచి లంకాభిధానరాజ, ధాని వేగఁ బ్రవేశించి ధరణిసుతను
వెదక మది నెంచి యంచితవిభవ మైన, యసురపతిసౌధరాజంబు నధిగమించె

మ. ఇది రక్షోబలగుప్త లంక యిది లేఖేంద్రారిసౌధాగ్ర మ
ల్లదె యక్షేశ్వరు గెల్చి తెచ్చినవిమానాధ్యక్షు మీక్షింపు మం
చెదురం దెల్పె సమీరనందనున కెంతే చంద్రమోదీపసం
పదభిద్యోతితవిశ్వదిఙ్ముఖత్రియామావేళ తా నయ్యెడన్ 26

ఉ. వారక రామనేత కిటువంటిసహాయతఁ జేసి కీర్తిఁ గ
న్నారిమిసూనుచే రవి తగుం గృతకృత్యతఁ గాంచి యార యా
దారినిఁ దానుఁ బేరసముఁ దాల్తునటంచుఁ దలంచి లంక నెం
తే రఘునాథుదూతసరణి న్నెల కన్పడె దిండుకై వడిన్ 27

— * హనుమంతుం డశోకవనముం జొచ్చుట * —

సీ. అప్పు డప్పవనజుం డన్వష్టసుందరీసౌందర్యముద్రాతిశాయిమూర్తి
నిద్రాముకుళితాక్షినీరజాతంబును వేశవిలాసినీవృతము నైన

యవరోధకామినీనివహంబు ననవరోధంబుగా నీక్షించి తత్క్రాంబ
వితథమనోరథవృత్తి యై విరచితచింతాసమాకులస్వాంతుఁ డగుచు
గీ. నంతఁ బ్రాకారలంఘనం బాచరించి, సురుచిరాశోకకాననాంతరమునందు
విశ్వవిఖ్యాత సీతను వెదకఁ దలఁచి, యిష్టదైవతవందనం బిటు లొనర్చె 28
శ్లో నమోఽస్తు రామాయ సలక్ష్మణాయ దేవ్యైచ తస్యై జనకాత్మజాయై
నమోఽస్తు రుద్రేంద్రయమానిలేభ్యో నమోఽస్తు చంద్రార్కమరుద్గణేభ్యః
వ. అని యిష్టదేవతానమస్కారంబు సమనస్కారంబుగా నొనర్చి యంత 30
చ ధరణిజ నిందు నంకుసు బదంపడి రోసి వృథార్తి రోసి ధీ
సురుచిరుఁ డై నమారుతి యశోకవనావనిఁ జెందె శాంతిమం
దిరుఁ డగుమాని తాఁ బరగతి న్భజియించునుపాయ మాత్మయం
దరయుచుఁ గల్మషప్రశమనైకశుభౌషధి యాత్రయించబలెఁ. 31
వ. అందు మందేతరపిచుమందమందారకందరాళ నాగపున్నాగతాలహింతాలత
మాలకృతమాలసరళవకుళతిలకామలకలికుచకుటజతక్కోలాంకోలలవంగలుం
గవికంకతకేతకీ కదంబోదుంబర కపిత్థాశ్వత్థకురవకమరువక మధూకమాకంద
చందనస్యందన చంపకచాంపేయ పనసవేతసపలాశపాటలప్రియాళుప్రాయా నే
కానోకహానికాయపరివృతం బైన యావనావనిం బరిభ్రమించుచు, నభ్రం
కషవిటపనిబిడితగగనప్రపంచం బగు నొకానొకకాంచనశింశుపాతరువుం గాం
చి, యారోహించి తత్పత్రసంఛన్నగాత్రుం డై వటవిటపిదళపుటనిలీనకపటవ
టునిచందంబు నొంది యంత. 32
ఉ మామిడితోఁపునం దనరుమల్లిని భిల్లుఁడు కల్లిఁ జేర్చిన
ట్లామిషబుద్ధి వేఁపి యమరాలయమాల్యముఁ గాకుదాచ్చిన
ట్లామఘవారి యాత్మపురి కాశ్రమధారణినుండి తెచ్చి దు
ష్కామత నిల్పినట్టి మహికన్యను జూచె నభూషితాకృతిఁ. 33
క. ప్రతిపత్ప్రాకైకసముద్యతుఁ డగునధ్యేతవిద్యహారువునఁ గార్శ్య
న్వితయగుతత్సతిఁ గనుఁగొని, జితారి సామీరి యిటులు చింతిలె నాత్మఁ. 34
ఉ యామినిఁ జంద్రికారహితుఁ డై శశిరాయుండిన నుండు వాసర
గ్రామణి చాయఁ బాసి యధికప్రథ నుండిన నుండుఁగాక యీ
తామరసేక్షణామణినిఁ దా నెడఁబాసి కకుత్స్థవంశ్యసు
త్రాముఁడు మేనఁ బ్రాణములు దాలిచియుండుట చిత్ర మెన్నఁగఁ. 35

వ. అని యిత్తెఱంగునం జింతాయత్తచిత్తుం డగుమరుత్తనూజుండు నిశీథసమయం బుఁ గడవ, నిశీథినీనాథుండును జరమగిరిశిఖరోపకంఠసేవోత్కంఠితుం డగుడు, దశకంఠుండు నిద్రావశేషంబున నతనుశరప్రహారవిశేషంబునం గలుషీకృతాత్ముండును సరసహరిచందనచర్చానుచర్చిక జ్జానకీదర్శనేచ్ఛాహాలాహలికం బ్రకటీకృతరాగహృదయుండును, బరివర్తితవైకక్ష్యదామంబునం బ్రకటమకుటఘటితరత్నధామంబునం దిరస్కృతనక్షత్రమాలికుండు నై యల్లనల్లన నశోకవనికాప్రవేశంబు గావించిన 36

ఉ. ఆసమయంబునం బరిసరాగతవారవిలాసినీకరో
ల్లాసితదీపమార్జనికలం దరళీకృత మై చతుర్దిశా
ధ్యాసితమోవితానము సమస్తము వైళమె చేరెఁ బంక్తికం
ఠాసురసార్వభౌమహృదయం బాకకే శరణంచు నెంతయున్ 37

ఉ. దానవలోకనాయకుఁ డతండు నితాంతమదాంధుఁ డై కడు
న్మానవకాంత యంచు రఘునాథవధూమణిఁ జేరె నక్కటా!
యానిజమూలపల్లవిత యై తగు నల్లకి యంచు వేగ నై
తానకృశానుకీల సవిధంబును జేరు గజేంద్రముం బలెన్ 38

— • సీతాదేవి రావణునికి హితము చెప్పుట • —

సీ. ఆదశాననుఁ జూచి యాకంపితాంగి యై పై దేహరాజన్యవరునికన్య
పరుషతాసంపత్తిభాజనంబులు విపర్యాసితలోకమర్యాదములును
నాత్మప్రశంసతాప్రాంచన్నృశంసతాపత్రపంబులు నైనపంక్తిముఖుని
సాటోపదుష్ప్రీతాపానుపూర్వికలచేత విదార్యమాణచేతస్క యగుచు
గీ. సంతతాశాంతనుతకీర్తిమంతుఁ డైన, కాంతు శౌర్యంబెఱింగినగతిత గాన
ననుఁదృణముగనెంచినయదియుఁబోలెఁ,బలుకునడుమనుంచిధీరతఁబలికెనిట్టులు.

క. సకలసదాచారస్థాపకుఁ డగువిధి కులగురుండు పౌలస్త్యుఁడ వీ
వకట పరకాంతఁ గోరెద, వోకయింతయు సిగ్గులేద యోహో నీకున్ 40

మ. విపరీతోక్తులు మాని విన్ దశముఖా విఖ్యాతకూలోపకం
ఠపరిభ్రష్టతరి న్సదాశుగము కుంఠంబై యథాస్థానము
న్నిపుణత్వంబునఁ జేర్పుచందమున నన్నిప్పుం బ్రతిష్ఠించినం
గృపయు న్నామకజీవితేశ్వరున కెంతే సంధిలు న్నీయెడన్. 41

సీ. అటులు గాదేని ఖరాసురదూషణత్రిశిరఃప్రముఖదైత్యదేహరక్త
పటలమేదోమాంసపంకిలముఖము లై మొనయురాఘవశిలీముఖములకును
నై జగాత్రక్షరన్నవశోణితమునఁ బ్రక్షాళనం బెవ్వఁడు సలుపఁగలఁడు
నీవు దక్కఁగను వెండియు నఖండితశాతసౌమిత్రిపటుపత్రిచాలకముల
గీ. కేఘనుఁ డమర్చు నభినవాసృక్పరంప,రారసవదంబుధారణిపారణంబు
ననుపమపవిత్రచారిత్ర ఘనపులస్త్య, కులపయోరాశికల్లోల కుటిలశీల 42
గీ. పంచబాణవిభిన్నుఁడౌ పంక్తిముఖుని, నిందుముఖ యేక వాణియుఁ బొందదయ్యెఁ
బంచవక్త్రాభిహతదృష్టుఁడౌ పంచజనుని, వినిహతపిపార్తి యాపధి మనుపఁగలదె
సీ. ఈతెఱంగునఁ బల్కు సీతానతోదరి యవధీరణోక్తుల నవధరించి
కినుకచే విముఖుఁడై తనరుపంక్తిముఖుండు తత్కాంతచెంత సంతతమునుండు
కావలిపడఁతులఁ గనుఁగొని మీరీనృపాంగనఁ జతురుపాయములచేత
వశ్యఁగాఁ జేయుఁ డవశ్యంబు నటుగాని, తఱి నీహతాశ నిత్తలిరుఁబోణిఁ
గీ. బ్రాతరాశంబునకు వేగఁ బాకశాల, గుణుల కొప్పించుఁ డనుచు దుర్గుణగరిష్ఠ
తానిధానంబుకుమతియైయానతిచ్చి, యంతటనిశాంతమగుడు నిశాంతమొందె.
సీ. తదనంతర ముదారదారుణవీక్షణాక్షణదాచరాంగనాజనకఠోర
వచనఘోషోన్మేషవశముకుళీకృతహృత్పుండరీక యై యినకులాధి
నాథునికూరిమినారీశిరోమణి యాభీలపుండరీకావృత యగు
రమణీయసారంగరమణీచందమునఁ దాపసదత్తఘోరశాపంబువలన
గీ. వసుమతీభాగమందు గీర్వాణతరుణి, కరణి నత్యంతదీనతాకలిత యగుచు
బంధుజనహైన్యపరితాపభరముచేత, నెంతయును జింతిలఁదొడఁగె నివ్విధమున
క. నావృత్తాంత మెఱింగిన, యావిహగాగ్రణి జటాయు వటవి నిలిగనే
మో విన్నవాఁడు కాఁ డటు, గావున నాయునికి నిచటఁ గాకుత్స్థుండుఁ 46
క. రక్కసుల పెక్కుమాయలఁ, జిక్కుపడిన యార్యపుత్త్రు చేతోభువియం
దక్కట యాస్థ గణింపఁగ, నొక్కింతయుఁ బొడమదయ్యెనో నెయ్యమునన్
క నన్నపహరించి తెచ్చిన, యన్నీచాత్మకుఁడు సహజ మగు రాముకృపా
భ్యున్నతి వారించెనో కా,కున్నఁ బ్రపన్నావనుఁ డతఁ డూరక యున్నే. 48
వ. ఇవ్విధంబున నవ్వధూలలామ బహువిధంబులుగఁ బరిదేవనం బొనర్చి యం
తరంగంబున రఘుపుంగవుం గని సంతతంబునుం జింతించుచు మూర్ఛా
క్రాంత యై యున్నసమయంబున. 49

మ. తగువిఖ్యాతచరిత్ర రామరమణిం దర్శించుదుర్జాతభా
వగరిష్ఠక్షణదాచరప్రమదల న్వారించి తెల్పె న్మనో
జ్ఞగుణశ్రీనిధి యైనయాత్రిజట యస్వప్నాంతరంగోత్సవం
బగుసుస్వప్నము సాధుసీధుమధురవ్యాహారధారింధరిన్. 50

క. భూమిజ ముపమ్ము మొకరిటి, లేమి నిలువ బొరలుచునవలిస్తానురకాం
తామఖదర్శిత యగుసీ, తామహిళాలతకుఁ ద్రిజట తా జట యయ్యెన్. 51

— * హనుమంతుఁడు సీతాదేవితో సంభాషించుట * —

గీ. అపుడసుత్యాగ మొనరింప నభిముఖయగు, సీత ననుపేక్షణీయఁగాఁజిత్తమునను
తెలిసి నీతివిచారించి ధృతివహించి, యంతికముఁ జేరె నలభవిమ్యదిద్వరించి 52

మ. ధరణీభృద్రిపువైరి నిష్ఠురవచోదంభోళిదీర్ణావనీ
వరకన్యాశ్రవణాంతరవ్రణశమవ్యాపారభైషజ్యము
న్నరవద్యాన్వయసంగతిప్రథితము న్సత్సంభృతార్థంబు దా
శరథిస్వామిగుణానుకీర్తనసుధాసారంబుఁ జల్లెన్ గ్రహిన్. 53

సీ. తదనంతరము సమంతాత్ప్రసారితదృష్టి యై శాఖశాఖాగ్రమధివసించు
శాఖామృగంబును సత్వరంబుగఁ జూచి చకితాంతరంగ యై సానుజుఁ డగు
రామభద్రునకు భద్రంబు గావుత మని వచియించి యపుడు దుస్స్వప్నబుద్ధి
నడలుచు నిర్నిద్రమగు నిజ్జనమునకుఁ గలవచ్చుటకు నేమికారణం బ

గీ. టంచు నూహించి జనకకన్యాలలామ, ప్రబలమాయాసమాయాతపంక్తికంఠ
యామినీచరవల్లభుఁ డనుచు నల్ల, గంధవాహాత్మజునివల్లఁ గరము తలఁకె 54

క. ఆసమయంబున డిగి వి, శ్వాసనిదానంబు లైనవచనములఁ గృతో
ల్లాసుఁడు ప్రాంజలి యగుచు మ, హీసుత నీక్షించి హనుమ యిట్లని పలికెన్

క. వేగమున నెనఁగు నీదువి, యోగమున నితాంతశాంతి నొందించిననా
భాగాన్వయపతిదూతను, గా గరిమ నెఱుంగు నన్నుఁ గల్యాణి మదిన్.

ఉ. నీకును దోసు గాఁ దనదుచెమ్మనముం గనువేగ నంచి యం
గీకృత జాగరాగరిమ ఖేదవిశేషమున న్విభావరీ
కోకసమానధర్ముఁ డగుకోసలరాజతనూజుఁ డిమ్మెయి
న్నీకుశలంబు దా నడిగె నీరజలోచన మన్ముఖంబునన్. 57

క. ఔదలను వంచి మీ కభి, వాదన మొనరించి భక్తివైభవ మెసఁగ
న్వైదేహి లక్ష్మణుఁడు మఱి, యాదిత్యసుతుండు సేమ మడిగె న్నిమ్మున్. 58

గీ. అని మఱియు జాతవిశ్వాస యైనసీత, కనిలజుఁడు వాలివధము సూర్యజుని చెలిమి
నొడివి వాల్మీకిమనసు కైవడిని గలిత, రామనామాంక మగు నుంగరం బొసంగె.

క. మరుదాత్మజనీతశ్రీ, కరరఘురామాంగుళీయకలితోత్సవవా
సరశతతమాంశమునకు, న్సరియే సీతావివాహసంభ్రమదినముల్. 60

క. క్షిత్యాత్మజాత యంతట, నత్యంతప్రమద యగుచు నసురేంద్రునకుం
బ్రత్యాసన్నం బయ్యెను, మృత్యువు హనుమంత! యని మఱియు నిట్లనియెన్.

చ. అనల యనంగఁ బేరు గనినట్టి విభీషణుపుత్త్రి తల్లి పం
పునఁ జనుదెంచి రావణుఁడు పోరొనరించియు గాని యూరకే
యినకులసార్వభౌమునకు నీయఁడు నిన్నని పల్కె నేనునుం
దనువును మాసమాత్రమును దాల్చెదఁ బ్రాణముల న్వరాకి నై 62

క. నావుడు మారుతి యిట్లను, దేవీ! వెఱవకుము నిన్ను ధృతిఁ దోడ్కొని నే
నీవార్ధిఁ గడచి దక్షతఁ, బోవుదు రఘుపతిసమీపమునకు న్వేగన్ 63

గీ. అని మహామేదినీధరంబునకు సాటి, యైన దేహాభివృద్ధిచే నతిశయిల్లు
నపుడు గాంభీర్యవిస్తారహారి యైన, జలధి యెలదోఁటకాలువచంద మొందె. 64

ఉ. అంతట సంతసం బొదవ నాహనుమంతునిఁ జూచి రామసీ
మంతిని పల్కె లంఘితమహాంబుధి వైయు తగు నీకు దుష్కరం
బింతయు లేదు పెంపున వహించి ననుం జనువేళ నంబర
ప్రాంతరయానలీల ననపాయిని నీకు నుపాయపారగా 65

వ. మఱియును, 66

శా. పాతివ్రత్యము వాసిచే దశముఖున్ భస్మంబు గావించినన్
ఖ్యాతైక్ష్వాకుశరాళికి న్సముచితగ్రాసంబు నందిల్లఁబో
దే తత్కీర్తినిశాకరుండును విభాహీనుం డగుం గావునన్
దైతేయు న్రఘునేత గూల్చినతఱి న్నారాక యుక్తం బగున్ 67

వ. అని సమాఖ్యాతవినయవచనజాత యగుసీతం గనుంగొని శ్రీరామదూత
యి ట్లనియె 68

ఉ. ఓమిథిలాపురాధిపకులోదధిచంద్రకళా! వనోర్వి మా
యామృగవంచితాత్మకత నాశరగేహమునందె నీవు శా
ఖామృగనీత వై యిపుడు కన్పడిన న్దివసేశ్వరాన్వయ
గ్రామణికార్ముకంబులకుఁ గల్గునె కీర్తి యొకింతయు న్భువిన్. 69

సీ. అది యటులుండని మ్మవనికన్యామణి రఘువీరగృహిణి కర్హంబు లీదృ
శాచారమునకును సదృశంబు పంక్తిముఖాపరాధతత్క్రియ కనుగుణంబు
కులకాంతయీలువుకును ననుకూలంబు క్షత్రియాణ్యుక్తికి సముచితంబు
నగు నట్లు పలికితి వనుచుఁ బ్రశంసించి యంజనానందనుం డనియె మఱియు
గీ. రామలక్ష్మణు లీకైతవ్యరాజధానిఁ, జేరినా రని యెంచుమీ చిత్తమునను
రాఘవజ్ఞాతపూర్వకశ్లాఘనీయ, మగు నభిజ్ఞాన మిచ్చి న న్ననుపు మిపుడు. 70

— * హనుమంతునితో సీత ప్రత్యభిజ్ఞానంబు దెల్పుట * —

వ అనుటయు నజ్జనకరాజనందన నిట్టూర్పు నిగిడించి యి ట్లనియె నోయసాధా
రణమేధానిధానా! సావధానంబుగా నాకర్ణింపుము. మున్ను సమున్నతానేక
మాణిక్యచాకచక్య ప్రకటతటనిరాఘాటం బగుచిత్రకూటనికటంబున సముల్ల
సత్పల్లవాంతరసంఫుల్లకుసుమసందోహస్యందమాన మకరందధారాసాస్వాదననిర్భ
రానందతుందిలమిలిందబృంద ఝుంకారహుంకారితసంక్రందనోద్యానవైభవం
బగువనంబున, రఘునందనోపధానీకృతోత్సంగ యగు నానముత్తుంగపయో
ధరపరిసరంబు ప్రఖరనఖరముఖవిదారితం బొనరించిన ధారాధరనామకాకంబు
నైత్యాత్మకుం డాలోకించి. 71

చ. సమధికరోషయుక్తవిలసతుృశరూపకు శేశయాసనా
స్త్రము వడి నేసె దుర్దదపురందరనందనవాయసంబు పై
దమితమదంబు నై యదియుఁ దత్కృపచేత హృతాక్షిమాత్ర మై
క్షమఁ జిరజీవి నాఁదనరుసంజ్ఞ వహించె యథార్థ మై తగఁ. 72

క. అని పూర్వకథాస్మరణంబున ద్విగుణితదుర్గశానమున్నతి యై యి
త్తు నభిజ్ఞానాంతర మను,చును హనుమంతున కొసంగెఁ జూడామణియుః 73

మ మతి నెంతేఁ బ్రమదంబు నంధిల మాతిం బొలస్తృసంత్రాసవుం
జితయాగాగ్నిదశం గృశాంగి యగురాజీవాక్షి యీయం బ్రణ
మితచేఁ గైకొని యంజనాతనయుఁడు న్మాణిక్యగర్భాననాం
చితభోగిప్రతిమానబాహుఁ డగుచుం జెందెం బ్రయాణత్వరః. 74

క. కృతకృత్యుం డయ్యె విని, గ్గతుఁ డై తనరాక దశముఖజ్ఞాతము గా
మతిఁ దలఁచి పావని గుణా,ద్భుతుఁ డ శోకవనభంగముం గావించెః. 75

సీ. తనదుకృత్యములచేఁదగు భూరిశాఖల కవనలెసంఘాత యగుటవలన
మతిసుమనఃకదంబకముల కెల్లను ముఖభంగ మొనరించిపోలుచువలన

శ్రుతిమధురోక్తిసంగతసద్ద్విజాలికి నతిభీతిసన్త్రాత యగుటకతన
చారణమార్గసంచారక్రియాధురంధరత నుద్దాముఁడై తగుటవలన
గీ. నముచిదానవరిపుదూతనందనుం డు,దారలంకాపురాంతరోద్యానమునను
బూనివసొన్యకసారాధిపానుజన్ము, పటుతరాటోపలీలను బరిభవించె 76

— * హనుమంతుఁ డశోకవనభంగ మొనర్చుట. * —

సీ. అంత సత్వరముగా నారక్షకము హాగ్ర రక్షోనివేదితప్రమదవనవి
భంజనజాతకోపవశారుణాలోకభీకరదశముఖప్రేషితులును
గాలకింకరభయంకరులు ప్రహస్తకుమారవిశ్రుతజంబుమాలిసహితు
లై యరుదెంచిన యాతుధానులఁ ద్రుంచి చైత్యతోరణసదేశంబునొందె
గీ. మారుతాత్మజుఁ డామాట మఱియు విని ని,శాచరానీకమారణశ్రవణకుపిత
పంక్తిముఖుఁ డావలీముఖుఁ బట్టి తెండ,టంచు వడిఁ బంచెఁ బంచసేనాగ్రగులను
క. వీరులను సప్తమంత్రికు,మారులనుం బనుప సమరమత్తాశయుఁడై
తోరణపరిఘముచేత స,మీరణనందనుఁడు వారి నెల్లం గెడపెన్ 78
క. వెండియుఁ బవనతనూజుఁ డ,తం డురువడి కోసలేంద్రదాసుఁడ నముచుం
జండత నని ఘోషింపఁగ, భండనమున కక్షుఁ బనిచెఁ బౌలస్త్యుండున్. 79
శా. వక్షశ్చూర్ణితహేమభిత్తి భృశదీవ్యచ్చైత్రధూళిం బగ
ల్నక్షత్రాధ్వము నెఱ్ఱసేయుచు నఖేలద్వీరలక్ష్మీకుఁడై
రక్షశ్శూరములన్ క్షమాఫలకనిర్వర్ణంబులం జల్పఁగా
నక్షక్రీడ యొనర్చె వాయుజుఁడు లంకాళిందభాగంబునన్. 80
చ. అమరవిరోధియోధుల మహాకుపితాత్మకుల న్నిమేషమా
త్రమున వధించి పంక్తిరథరాజతనూజునిదూత గీతవి
క్రముఁ డలచైత్యసౌధమునకంబముఁ జేకొని తద్భవాగ్ని హ
ర్మ్యమును దహించి తోరణసమాశ్రయుఁ డయ్యె యథాపురోద్ధతిన్. 81
క. ఏవంవిధవృత్తాంతము, దా విని కుపితాత్ముఁడైన దశకంధరుఁ డెం
తే వింశతిపీక్షణముల, దేవాధిపజేతఁ జూచి ధీరతఁ బలికెన్. 82
క. భువినిం దివినిఁ బురందర, భవనంబున నైన సమరపటు నిను వీక్షిం
ప వలంతి యెవ్వఁ డిచటికిఁ, బ్లవగంబును దెమ్ము టంచుఁ బనిచె న్నుతులన్. 83
ఉ. సారవిరోధిసేనకును సంహృతి, బెట్టగురోదనంబు ర
క్షోరమణీగణంబునకు, శోకము రాక్షసనేత, కర్కశ

ప్లోరసఖానవాప్య యుగులంకకు నగ్నివిశుద్ధి, సేయఁగాఁ
దోరణమందు వాయుజునితోఁ రణ మయ్యె సురేంద్రజేతకున్. 84

శా. ధారాపాతశరాభిఘాతనిరవద్యస్ఫూర్తికిం బౌమహో
దారాస్కందనదుర్దినాంతరమున న్హర్షించెఁ దన్మేఘనా
దారంభంబున గంధవాహతనయుం డత్యంతము న్మేఘనా
దారంభంబున నుల్లసిల్లెడు భుజంగాహారిచందంబునన్. 85

శా. హుంకారోద్గతుఁ డై నిజాస్త్రచయవైయర్థ్యంబు సంధించు ని
శ్శంకాతంకజయేందిరాసఖుని రక్షశ్శిక్షకు న్మారుతిన్
లంకాధీశ్వరనందనుండు విజయాలంకార ధౌరేయుఁ డై
పంకేజోద్భవసాయకోత్తమమునన్ బంధించె నాలంబునన్. 86

గీ. అష్మాహ్వాగ్రచతుర్వదనాస్త్రమునను, బరవశశరీరుఁ డై యున్నప్లవగవరుని
గట్టిశణవల్కలంబులఁ గట్టివైచి, రేఁచి యామవతీచరనీచు లకట. 87

ఉ. ఆసమయంబున న్మదయామవతీచరపాశకృత్త మా
వాసవదూతసూనుదృఢబంధకు బంధవిమోక్షహేతు వై
భాసిలె ము న్నుబలస్త్ర్యకులపాంసనుఁ డుద్ధతచిత్తవృత్తిఁ గా
రానదనంబుఁ దార్చిన సురప్రమదాజనకోటి కెంతయున్. 88

క. చతురాననాస్త్రబంధ,చ్యుతుఁ డయ్యును నితరబంధయుతుఁ డగు నమ్మా
రుతిమహిమఁ దెలిసి రావణి, ద్రుతముగ నిజజనకుసభకుఁ దోడ్కొనిపోయెన్

వ. అయ్యెడ 90

మ. కనియె న్మారుతసూతి పంక్తిముఖునిం గాలారిలీలాద్రితో
లనఖేలాపటుతాపరీక్షితబలాలంకారబాహాబలం దపో
ఘను బందీకృతనిర్జరేంద్రనగరీగాణిక్యహస్తారవిం
దనటచ్చామరమారుతాంకురచలన్మంజూత్తరీయాంశుకున్. 91

మ. పురుహూతాదిభయంకరాజికలనప్రోత్సాహ నిర్భగ్నస
త్వరమగ్నామరదంతిదంతకృతముద్రాడంబరక్రోడభూ
కరు ఛాయాత్మకవిభ్రమప్రతితరంగభ్రాజమానత్రపా
కరబింబాఘననాథశైవలినికాకాంతోపమానాకృతిన్. 92

మ. ఘననిశ్శ్రేయసమార్గరోధన మొగిం గావింప మూర్తీభవిం
చినలోకత్రయపాపశాశికరణిం జెన్నొందుగర్వాంధునిన్

దిననాథేందుకృశాను తేజములను న్నిర్జించి యంచత్తపం
బున సాక్షాదభిషిక్త మైనతిమిరంబుం బోలు దుశ్శీలునిన్ 93

మ. తరుణాపాటలపల్లవాధరపుటాంతస్ఫారదంష్ట్రామహా
గరిమవ్యాపనశాతఘోరతరజాగ్రద్విగ్రహాభు న్మహో
హరసంధ్యాసమయాంబుదాంతరితమధ్యాబ్జాతరేఖాధురం
ధరసంక్రందననీలశైలము గతిన్ రాజిల్లులంకేశ్వరున్. 94

ఉ. అంత దశాననుండును మహాబలనందనుఁ జూచి విస్మయా
క్రాంతహృదంతరుం డగుచు రాజతభూమిధరప్రకంపనా
సంతతమంతు వేగమున శాప మొసంగినయట్టినంది ని
శ్చింతత నిట్టిరూపమునఁ జెంతకు వచ్చె నటంచు నెంచుచున్. 95

క. తనసమ్ముఖమున నిలిచిన, యనుయోగవిధిప్రశస్తుఁ డైనప్రహస్తుం
గనుఁగొని యి ట్లనియె ఘనా, ఘనరసితవిజృంభమాణగంభీరోక్తిన్ 96

ఉ. ఎక్కడనుండి వచ్చె నిపు డెక్కపి యెవ్వఁడు పంచినాఁడు తా
నిక్కడ కేగుదెంచుటకు నెయ్యది కార్య మభిఖ్య యెద్ది యో
నిక్కముగాఁగఁ దెల్పు మని నీ వనుయోగ మొనర్పు మన్న నా
రక్కసిఁ జూచి యి ట్లనియె రాఘవదూత యభీతచిత్తుఁ డై. 97

— * హనుమంతుఁడు రావణునితోఁ బ్రసంగించుట * —

వ. లంకాపురాధిపా! యనహంకారుఁడ వై మదాగమనకారణం బాకర్ణింపుము, త్రిలోకదీపకుం డగులోకబాంధవునియన్వయం బనుమహాదన్వంతంబునకుఁ బార్వణశర్వరీకరుండును సాతత్యసత్యసంధానుబంధబంధురుండును, బితృనియోగసముపనతవనవాసలీలానిరతశీలుండును, బ్రచండశూర్పణఖాప్రాప్తవైరూప్యకుప్యత్ఖరప్రముఖనిశిచరబలపలాలజాలకల్పాంతానలకల్ప శిలీముఖుండును, కపటహరిణ హననసమయ పరిముషితదారాన్వేషణసంజాత సమగ్రసుగ్రీవసఖ్యుండును సముత్ఖాతవాలికంటకుండును దుర్వృత్తశత్రువంశవనపవనసారథియు నగుదాశరథిదూతను, సీతాన్వేషణంబునకుం బ్రతిదిశంబును దపనతనయప్రేషితు లగువానరులయందేనొకండ, గంభీరలవణాంభోరాశిలంఘనజంఘాలుండ నై భవదీయనగరప్రమదవనసీమంబున రామస్వామిధర్మదారావలోకనంబుఁ గావించి నమస్కరించి కృతకృత్యుండ నై పునఃప్రయాణావసరంబున భవద్దర్శనకుతూహలి నై నారాక నీకుఁ దెల్పుటకుఁ బ్రమ

ధితాశోకవనికా నోకహనివహంబుండను, సమనుభూతనైరృతలూతాతంతుసహా
నుండను నై దురాపం బగునీసమీపంబునకు వచ్చితి నని మఱియును 98

చ ఒఱపగులోకవంద్య గుణయూథము రామనృపావరోధముం
జిర మిచట న్నిరోధమును జేసి విరోధము గొంటి వోరి చే
టెఱుఁగనికూన! నీతిగుణహీన! వితానవితర్దిజాత మా
కరువలినెచ్చెలిం బటిమఁ గట్టఁగ యత్నముచేసి తక్కటా 99

చ అని మొన లక్ష్మణాస్త్రహత మై పసు నీమెయిపైఁ బలాశ డా
సినఖగమండలిన్ గొనుగు సేయకు మింక భవన్నిమిత్త మై
యనఘుల స్త్ర్యవంశలయ మయ్యెడునప్పుడు త్వత్పురంధ్రిదృ
గ్వనజగళన్నవావము నివాపజలం బొనరింపఁబోకుమీ. 100

మ. పరదారైకపరిగ్రహాదరమతిం బాటించు నీవాపిభా
కరవంశోత్తముభార్యఁ దెచ్చుటయె దుష్కార్యం బనార్యాశయా!
మరుదాహారి నటించుఁ గుండలి గరుత్మత్తుండని శ్వాసని
ర్భరవాయున్ప్రవహాయాలు తాలుయుగధుర్యం బైనచందంబునన్ 101

క. వైళమ భుజచందనధా, రాశ్లేషుధికోటరాంతరచ్యుతరామా
భీలాశుగజిహ్మగ మిఁక, వాలాయము నీప్రాణవాయువుఁ గ్రోలున్ 102

చ. సరభసశాంబరీమృగము సంగరనాటకసూత్రధారత
న్నెరపఁగ శాఖికామృగము నీ కరయం బ్రతికూలవాత మై
పరఁగఁగ వీక్షితోద్యమత భాసిలురాముజగాలకోటికిన్
సరయగతిప్రణాశకవచంబు వినా కవచంబు గల్గునే. 103

చ. అని తను జీరికింగొనక యాడినవాయిజుఁ జంపుఁ డంచుఁ గో
పనుఁ డయి యానతిచ్చె భటసంతతికిం బంక్తిముఖుండు నప్పు డా
ఘనవిశుద్ధుఁ డైనమతిశాలి విభీషణుఁ డగ్రజన్మునిం
గనుఁగొని దూతమారణ మకార్య మటంచును మాన్చె నంతటన్. 104

సీ. శర్వరీచరలోకసార్వభౌముఁడు దుహూహా మొనర్చి కపిసమూహమున కెల్ల
నంగకంబులయందు లాంగూల మెంతయు ముఖ్యంబు గావున మున్ను దానిఁ
గార్పాసవాసోనికాయవేష్టితముఁ గావించి పావకశిఖాసంచయప్ర
దీపితం బొనరించి యాపురంబునవీథి వీథులందును దోపవితతి నుగ్గ

గీ. డింపుచును సంప్రహారపారంపరీక, ముగను ద్రిప్పుడు మీరని మూర్ఖయాతు
ధానులకు సెల విచ్చిన నానృశంస, చరితులును నట్ల చేసిరి సరభసముగ 105

గీ. నిర్ణయాగోచరంబును గర్ణికార, వర్ణరుచిరంబు నైనతద్వాలకీలి
నిర్ణిమేషులభాగ్య మున్నేమశాలి, యగుటఁ బూర్ణశిఖోదీర్ణ మయ్యె నపుడు. 106

— * లంకాపుర దహనము * —

క. అగచరుదుర్దశ కావలి, మగువలు వినిపింప దూయమానాత్మిక యై
జగతీసుత ప్రార్థించెం, దగ "శీతో భవ హనూమత" యటంచు శిఖిన్ 107

శా వాలిప్రాణహరప్రియాఘనతపోవహ్నింధనత్వంబు నే
వాలాయంబుగఁ బొందఁజాల ననుచున్ వైశ్వానరుం డత్తఱిన్
వేలాతీతసుజాతశీతలగుణావిర్భూతి వాతాత్మభూ
వాలాగ్రంబున రత్నదీపముగతిన్ వర్తిల్లెఁ జిత్రంబుగన్. 108

ఉ రాతిరి యాదశాస్యనగరంబు ప్రకాశము గాఁగఁ జూడలే
దీతఱి నగ్నిసాక్షిగ రహిం గనుఁగొందు నటంచు దైత్యసం
ఘాతము లెల్లఁ దోరణాలగత్పరిఘంబున సంహరించి సీ
తాతరుణీమనోహరునిదాసుఁడు దుస్సహదోర్బలాసుఁడై 109

ఉ భూవనితాసుతేందిరను బూమకులేంద్రుని కీఁదలంచి లం
కావనధిం బరిక్షుభితగాఢబలోర్మిభయంకరంబు నెం
తే వనజోద్భవుండు మథియించెను రజ్జుభుజంగరాజభో
గావృతగంధవాహతనయాహ్వయమందరభూధరంబు చేన్. 110

మ దనుజస్త్రీముఖారవిందరజనిన్ ధాత్రీమయూరీఘనా
ఘనవేలాసదృశి న్దశాననయశఃకాదంబకాదంబినిన్
ఘనవైధవ్యదశార్హవేషవిధిలంకాస్త్రీజట న్రామమో
హనకుం దత్త్రిజటాసమం బఱపె ధూమ్యం గీశుఁ డారా దివిన్ 111

ఉ. ఇట్టులు పావమాని మెఱయించినశౌర్యముఁ జూచి కన్నులం
దొట్టెడుహర్షబాష్పములతోన బుధుల్ దనుజేంద్రభీతి ను
ద్ఘట్టితులౌట వాటుకొన దానినెపంబుగఁ పర్వె ధూమ్య యి
ప్పట్టున హా దివంబునకు భానుజ జాల్కొనె నంచు నెంచఁగన్ 112

చ గురుజఘనంబునం దసితకోమలశాటి కటీతటంబున
న్మరకతబద్ధనీవి కుచమండలిఁ గస్తురి గ్రీవ నుత్పలో

తోరణసరము న్గనుంగవను గాటుక యయ్యె దిశాంగనాళికిన్
ధరణీధరారివైరిపురదాహసముద్వహధూమ్య యుత్తతిన్. 113

మ. అతివేగంబున లంక కాలెడునెడన్ హా తాత హా మాత హా
సుత హా బాంధవ హా మనోదయిత హా సుస్నిగ్ధ మీ రెందుఁ బో
యితిరో నేను హతుండ నైతి నని భూయిష్ఠంబుగాఁ బౌరసం
తతినానాపరిదేవనోక్తులఁ బరీతం బయ్యె నల్దిక్కులున్, 114

చ. వఱలు సురీముఖాళికి నివాళి యనీరద మైననింగికిన్
మెఱపులభంగి యంబుధికి మిక్కిలి బాడబ మయ్యె నద్ది యా
గురుతరవాలకీలి మిణుఁగుర్లు గనుంగొన నద్భుతంబు లై
హరహర వర్తిలె న్ద్రిచతురాహము లాఱక ఘోరకాంతులన్. 115

ఉ. ఆరయ దీప్యమానపవనాత్మజువాలముసంగతి న్మహా
గారసమూహశేష మగుకర్బురరాజపురంబుఁ జూచి బృం
దారకవైరు లంబరపథంబుననుండి సృజించి రశ్రువుల్
జోరన నాత్మగేహములఁ జొప్పడ నార్పు తెఱంగు దోఁపఁగన్ 116

చ. శతమఖవైరియాజ్ఞ నని సల్పినకృత్యము దైత్యరాణ్ణియో
జితులయి యుండియుం గడఁగి చేయ నిశాటు లశక్తులైరి య
ద్భుతి మిది మారుతిప్రథితభూరికృశానుఁడు లంకఁ గాల్చె నే
గతి మఱి యిట్లు తత్పితృసఖత్వము నొందియుఁ గాల్పలేఁడుగా. 117

శా. ఆహానుమ న్మహారణీభవానలునందుఁ బ్రణీతశుద్ధి యై
యాహవరంగవిక్రమవిహారకుతూహలిదైత్యుఁ దుల్లస
ద్బాహుబలంబునం దొడరి పట్టిన నిర్జరరాజలక్ష్మి న
స్నేహతచే నిజాధిపునిఁ జేరుటకుం దగ నిచ్ఛయింపఁగన్. 118

క. ఏల యిఁక వేయుమాట, లొప్పల స్త్ర్యభుజాగ్రగుప్త లంకాపురము
న్వాలిరిపుదూత చేరెను, గాలునిదూతయు సుఖంబుగాఁ జేరుటకున్. 119

చ. మలినదశాస్యపాతకిసమాగమసంభ్రమజాయమాన మహా
కలుషము నెల్ల శోధితము గా నొనరింపఁ దలంచి యామహా
బలసుతయజ్వ యత్నజయపండితుఁ డై నిజవాలవహ్నిలో
నలఘుగతిం బలాశసమిదావళి హోమము సేసి భాసిలెన్. 120

